PRSUMORA144

సాహిత్య ప్రస్థానం
డిశంబర్ 2012
సంపుటి : 11 సంచిక : 12

## మెరుగుదలకు 'మెరుగు'!

2012 ముగిసి పోతున్నది. ఈ ఏడాదిలో తెలుగు నాట సాహిత్య సాంస్కృతిక వాతావరణం మొత్తంపైన ఉత్సాహభరితంగా మారింది. రకరకాల రూపాల్లో అన్ని పట్టణాలు నగరాల్లో సాహిత్య కార్యక్రమాలు పుంజుకుంటున్నాయి. అనేక సంస్థలూ సంఘాలూ వీటిలో పాలు పంచుకుంటున్నాయి. కొన్నిసార్లు ఉద్రిక్త వాగ్వాదాలు శ్రుతిమించుతున్నా పరిశీలన విశ్లేషణ పెరుగుతుండడం సంతోషకరమైన విషయం. పుస్తకాల ప్రచురణ వ్యక్తిగత స్థాయిలో కూడా గతం కంటే బాగా పెరిగింది. ప్రసిద్ధ రచయితల సంకలనాలు తీసుకురావడం జరుగుతున్నది. తెలుగు భాషా వికాసం గురించిన శ్రద్ధ కూడా పెరిగింది. అలాగే స్థానిక సంస్కృతులు గురించి మెళకువ ఇనుమడించింది. పత్రికల సాహిత్య శీర్షికలలో సజీవమైన చర్చలే జరుగుతున్నాయి. అంతర్జాలంలోనూ అక్షర సంపద విస్తరిస్తోంది. కళా సాహిత్యాలు ఏదో కొద్ది మందికే పరిమితమైనవనే భావంపోయి విస్తారత సంతరించుకుంటున్నాయి. ఇవన్నీ ఆహ్వానించదగిన పరిణామాలు. వాణిజ్య ప్రయోక్తలు పాలకవర్గ వ్యూహకర్తలు ఈ రంగాలను కూడా వదిలిపెట్టడం లేదు. అలాగే ఆధ్యాత్మికత సంప్రదాయం ముద్రతో తిరోగామి దృక్పథాలను రుద్దే శక్తులూ వున్నాయి. సాంస్కృతిక కాలుష్యం శరవేగంతో వ్యాపిస్తోంది. ఇవన్నీ నిజమే అయినా ప్రగతిశీల సాహిత్య ధోరణులదే ముందంజగా వుందనడంలో సందేహం లేదు. వాటిని మరింత పటిష్టం చేసుకోవడమే ఇప్పుడు ప్రధానంగా జరగాల్సింది. రానున్న ఏడాదిలో ఆ దిశగా జరగాల్సిన కృషిపై ప్రణాళికలు రూపొందించుకోవాలి. ప్రస్థానం వంటి సాహిత్య పత్రికలను మరింత విస్తృతంగా తీసుకెళ్లడం అందులో ముందుండాలి.

బొమ్మలు : శివాజి, వెంకటేష్

## ఈ సంచికలో...





చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్టీసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136.
ఇ.మెయిల్ : ssprasthanam@gmail.com
Prasthanam_ss@yahoo.co.in
www.prasthanam.com



కథ

# ఆ రెండేళ్ళు

వి. ప్రతిమ
✆ 9848541485

“అంకుల్ ప్లీజ్...”

కడుపు నిగ్గుమనింది

చాపీ చాపని ఆ చేయి, ఆకళ్ళల్లోని దీనత్వం, ఒకింత బెరుకూ, సమయాన్ని గురించిన ఆదుర్దా కలగలిపి ఆ అడుగుతున్న తీరుకి నాగుండె చెమ్మగిల్లింది.

“లేదు” అంటూ మా ఆయన తలతిప్పి ఎటో చూడసాగాడు.

ఆయన జేబులోని నల్లపిల్లిని ఆ పిల్ల గమనించే వుంటుంది.

దెబ్బతిన్న దానిలా కళ్ళు చికిలిస్తూ కదిలి వెళ్ళబోయింది.

“ఇదిగో పాపా” అంటూ నాబేగ్ లోని ఫోను తీసి ఆపిల్ల కందించాను. నా ఎదుటే నిలబడి వాళ్ళమ్మకో, నాన్నకో తెలీదుగానీ నెంబరు నొక్కింది.

అటువైపు ఫోను ఎత్తగానే

“డాడీ... ఆ పిల్లగొంతు గద్గదమవడం తెలుస్తూనే వుంది. గుండెల్లో నీళ్ళూరాయేమొ తెలీదు గానీ ఆపిల్ల కళ్ళు మాత్రం సజలాలుకాలేదు.

“డాడీ... ఈ నెంబరుకి ఫోన్ చేయండి” అంటూ కట్ చేసి పక్కకెళ్ళింది.

మా ఆయన పనున్న వాడిలా లేచి క్యాంటీన్ వైపుగా సాగిపోయాడు.

గత నెలరోజులుగా నేనూ, తనూ ఈ రెసిడెన్షియల్ జూనియర్ కాలేజీని క్రమం తప్పకుండా దర్శించుకుంటున్నాం... మా చిన్నాడపడుచు కూతురు యశస్వి యిక్కడ చేరింది కొత్తగా....

ఆమాటకొస్తే అసలీ బిల్డింగే కొత్తది... ఈ సంవత్సరమే ప్రారంభమైంది. ఈ కాలేజీ యాజమాన్యానికి నగరంలోనూ, బయటా చాలా భవనాలున్నాయి. ఎన్నో క్యాంపస్‌లూ, ఎంతోమంది విద్యార్థినీ విద్యార్థులు. వాటిల్లో యిది సరికొత్తది....

“నీట్”... దీని పేరే ‘నీట్’

ఈసారి పిల్లల ప్రాణానికి ఎంసెట్ లేదట... తల గోక్కోడానికో కొత్త కొరివి ‘నీట్’ అన్నారు. అది నీటో, పోటో యింకా తెలీట్లేదు. తల్లిదండ్రులకీ, విద్యార్థులకీ కూడా.. అసలు మాస్టర్లకే అర్థంకావడం లేదు.

ఆలోచిస్తూనే నాఫోన్ మాట్లాడుతోన్న పిల్లకేసి తదేకంగా చూశాను. ఆ పిల్ల ఏమీ మాట్లడడంలేదు. అటువైపు నుండి వాళ్ళ వాళ్ళు మాట్లాడుతున్నది శ్రద్ధగా వింటోంది... ‘వూఁ’ కొడుతూ... పెదవి విప్పితే మాటకంటే ముందు దుఃఖం దూకేలా వుంది....

ఏమిటీ పిల్లల బాధ?... మాముందు నుండి వెళ్తోన్న ఏ అమ్మాయిని చూసినా దిగులు దిగులుగా బెరుగ్గా, భయంగా అన్పిస్తున్నారు.

నిజానికి చదువులంటే గొప్ప ధైర్యాన్ని, నమ్మకాన్ని, ఆనందాన్ని యివ్వాలి గానీ వీళ్ళేవిటి యిలా వాళ్లని వాళ్ళు పోగొట్టుకున్నట్టుగా దీనంగా, దిగులుగా తిరుగులాడుతున్నారు.

‘ఫ్చ్’ దీర్ఘంగా నిట్టూర్చి కాళ్ళు చాపుకుని కుర్చీలోనే సర్దుకు కూర్చున్నాను. యశస్వికి యింకా క్లాసు జరుగుతున్నట్టుంది.... మా ఆయన జాడ కూడ ఎక్కడా లేదు. ఒకసారి చూట్టూ కలయ చూశాను.

“మేం డబ్బు చూడలేదండీ సౌకర్యాలు కావాలనుకున్నాం. మీరు ముందుగా మాకు చెప్పిన సౌకర్యాలలో కొన్నింటిని కూడా పిల్లలకి యివ్వడం లేదు. ఒక్కోగదికి ముగ్గురు మాత్రమేనని మీరా రోజు చెప్పారు.

ముగ్గురి కోసం కట్టిన గదుల్లో అయిదుగురిని కూరారు... లేచిం దగ్గర్నుండీ బాత్‌రూం కోసం వాషింగ్ కోసం పిల్లల మధ్య గొడవ... మా అమ్మాయిని రూమ్మేట్స్ హెరాస్ చేస్తున్నారు" ఎవరో ఒకావిడ బిగ్గరగా అరుస్తూ మెట్ల దగ్గరే ప్రక్కనే టేబిల్ వేసుకుని కూర్చుని వున్న వార్డెన్ల మీదికి ఒంటికాలితో లేస్తోంది.

పిల్లి మెడకి ఎవరు గంట కడతారా అని ఎదురు చూస్తున్న వాడిలా మరొకాయన చప్పున లేచి వార్డెన్ వద్దకి వెళ్ళాడు.

"అంతే కాదండీ ఆ రోజు తరగతి గదికి నలభయి మందన్నారా? ఇప్పుడు ఒక్కో తరగతిలో ఎనభయి తొంభయి మందున్నారు. అవి క్లాస్ రూమ్‌లా బందెల దొడ్లా చెప్పండి?" ఆవేశంతో క్షణ మాగాడతడు...

"ఒకటీ రెండూ కాదు లక్షరూపాయలు ఫీజు... మనకేమయినా చెట్లకి కాస్తున్నాయా డబ్బులు ఎన్నెన్ని యిబ్బందులు పడి పిల్లలు సౌకర్యంగా వుంటారు కదాని చేర్చేం... ఇంత కట్టి కూడ పిల్లలెందుకు సఫరవాలి?"

"ఏం చేద్దామండీ? మన జుట్టు వాళ్ళ చేతిలో యిరికించేశాం. ఇక ఏం జరిగినా తప్పదు..." అంతా తల్లిదండ్రుల తప్పేనన్నట్టుగా నిర్ణయించాడు మరొకాయన...

ఒకరూ, ఒకరూ పేరెంట్సంతా అక్కడికి చేరుకుంటున్నారు.

ఎందుకో గొంతెండి పోయినట్లుగా అన్పించి బాటిల్ పైకెత్తి మొత్తం నీళ్ళు తాగేశాను.

"థ్యాంక్యూ ఆంటీ" ఆ పిల్ల ధన్యవాదాలు తెలుపుతూ ఫోను నాకందించింది.

"ఏంపేరమ్మా?" అనాసక్తంగానే అడిగాను.

"సంహిత" చాలా చిన్ని గొంతుతో చెప్పి నేనేవూరని ప్రశ్నించే అవకాశం యివ్వకుండా వెళ్ళిపోయిందామ్మాయి...



సన్నగా, పొడవుగా, తెల్లగా, జీన్స్‌ప్యాంటూ, ఫుల్‌షర్టూ, బోయ్ కటింగ్‌తో ధీమాగా నడిచి వెళ్తోన్న ఆ పిల్లకేసి చూస్తూండగానే

"ఆంటీ ప్లీజ్.. ఒక్క మిస్ కాల్" అంటూ మరో అమ్మాయి నేనివ్వాల్సిన అవసరం లేకుండానే నా చేతిలోని ఫోన్ లాక్కెళ్ళిపోయింది. ఎన్నాళ్ళయి పోయిందో కదా ఆ పిల్ల వాళ్ళమ్మా నాన్నతో మాట్లాడి....

"నేను... నాలుగు రోజులు చూస్తానండీ క్లాస్‌రూమ్‌కి నలభయి మందిని వుంచారా సరే లేదంటే వూరుకోను... డబ్బు కోసం కక్కుర్తి పడకుండా సౌకర్యాల కోసం మాత్రమే మేమిక్కడ చేర్చేం" మళ్ళీ మళ్ళీ అదే డైలాగులు వల్లె వేస్తూ ఆమె వార్డెన్లను నిలదీస్తోంది.

ఏం మాట్లాడినా, గొడవపడినా ఒరిగేదేమీ వుండదని ఆమెకీ తెలుసు అయితే అందరిలా మిన్నకుండ కూడా ఒక గట్టి ప్రయత్నం చేస్తోందామె.

అప్పటిదాకా అందరిమీదా డామినేటింగా అరుస్తూండిన వార్డెన్లు ఆమె ముందు పిల్లులయి అత్యంత వినయంగా

"ఏదయినా వుంటే ప్రిన్సిపాల్‌తో మాట్లాడుకోండి" అంటూ లో గొంతుకతో సమాధానమిస్తున్నారు.

"మిమ్మల్నడిగితే ప్రిన్సిపల్, ఆయన్నడిగితే మరొకరు, ఆ మరొకరు యాజమాన్యాన్ని... ఏముందీ యిది?" విసుక్కుంటున్నారెవరో

"ఇప్పుడు అధిష్టానం అన్నపదం దేశవ్యాప్తంగా ప్రభావితం చెందింది.... ఏదయినా అధిష్టానాన్నడిగి చేయాల్సిందే.." తను వేసిన జోక్‌కి తనే నవ్వుకుంటూ నిండుగా నింపిన చల్లటి నీళ్ళ సీసాతో నావైపుగా వస్తున్నాడు మా ఆయన.

వచ్చీరాంగానే

"నీ ఫోనింకా రాలేదు కదూఁ" అంటూ నా మీదొక్క వ్యంగ్య బాణాన్ని విసిరాడు... నేనో చిరునవ్వునవ్వాను... నిజానికి నా ఫోను తీసికెళ్ళినమ్మాయి ముఖం నాకు సరిగ్గా గుర్తులేదు.. ఎవరయివుంటారా అని అందరినీ పరిశీలిస్తుండగానే ఆ అమ్మాయి ఫోను మాట్లాడుతూ నా దగ్గరగా వచ్చింది.

"ఫిజిక్స్ సారు చాలా ఫాస్ట్‌గా వెళ్ళిపోతున్నారు డాడీ... పట్టుకోలేకపోతున్నాను. ఈ సిబిఎస్సీ వాళ్ళు సార్ ప్రోబ్లమ్ మొదలుపెట్టగానే ఆన్సర్ చెప్పేస్తున్నారు. నాకసలేమీ అర్థం కావడం లేదు. ప్రోబ్లమ్స్ కూడ కంఠతంతా పట్టలేం కద డాడీ ... ఎన్నిగంటలు చదివినా పోర్షన్ కావడం లేదు" అంటూ కళ్ళ నీళ్ళు పెట్టేసుకుంటోంది.

అటువైపు నుండి వాళ్ళ నాన్న ఏం చెప్పాడో గానీ ఆపివుంచిన కన్నీటిబొట్లు రాలుతూండగా "ఓ.కె డాడీ.. సీయు" అంటూ ఫోన్ కట్ చేసి నాకందిస్తోన్న ఆ పిల్లని చూసి కలగుండు పడ్డట్టయింది నాకు.

చిన్నప్పుడు మా అమ్మ పిండి రుబ్బుతూంటే పక్కన కూర్చుని నలుగుతూన్న పిండిని తదేకంగా చూసేదాన్ని.. ఆ దృశ్యమెందుకో గానీ పదే పదే నా కళ్ళ ముందు నిలిచి మాయమవుతోంది...

కఠినమైన చదువుల వల్ల ఏర్పడిన అసహాయంతో యింటి మీద దిగులో తెలీదుగానీ ఆపిల్ల ముఖమంతా పీల్చేసినట్లుగా వుంది...

"ఏవూరమ్మా?" ప్రశ్నించాన్నేను.

"కడప" చెప్పిందామ్మాయి. "ప్చ్ఁ అక్కడెక్కడా కాలేజీలే లేనట్లు ఇంతదూరం ఏం బావుకుందామని వచ్చిందో "అనుకుంటూ కనీసం థ్యాంక్స్ చెప్పాలన్న స్పృహ కూడ లేకుండా కదిలి వెళ్తోన్న ఆపిల్ల కేసి చూస్తుండిపోయాను...

"క్యాంటీన్ కెళ్ళి కాఫీ తాగొద్దామా?" తనకేమీ తోచనట్లుగా వున్నాడు.. "వద్దు ఁ కడుపులో దేవినట్టుంది" చెప్పాన్నేను.

అదేమీ పట్టనట్లుగా లేచివెళ్ళాడు తను.

"ప్రియంకా ఁ టూఫోర్ ఎయిట్.. రామ్మా పేరెంట్స్ వెయిట్ చేస్తున్నారు.." గదుల్లో వున్న అమ్మాయిలకు విన్పించేలా మైకుల్లో అనౌన్స్ చేస్తున్నారు వార్డెన్లు...

ఈరోజు ఆదివారం కాకపోవడంతో విజిటర్స్ పెద్దగా లేరు... నగరానికి పదిహేను కిలోమీటర్ల దూరంలో ఒంటి స్థంభం మేడలా వున్న ఈ భవనం వైపు అనుకున్నపుడల్లా విజిట్ చేయడం మామూలుగా

అయితే చిన్న విషయమేమీ లేదు. ఆవిడెవరో అన్నట్లు తల్లిదండ్రులిప్పుడు డబ్బుకోసం చూడ్డంలేదు. పిల్లల సౌకర్యాలు మాత్రమే చూస్తున్నారు. తమశక్తికి మించి వాళ్ళు అడిగినవీ, అడగనివీ కొనిపెడ్తూ దాన్నే ప్రేమగా సరిపెట్టుకుంటున్నారు...

అయితే ఈ మొత్తం సౌకర్యాల అంతిమ ధ్యేయం మాత్రం మార్కులే.

మార్కులు.. మార్కులు.. ర్యాంకులు ఐసి సెక్షన్లు, స్పార్కేలు అంతా ఒక మేనియాలా ఆవహించేసి వుంది అందర్నీ.

మా బాబు యు.కె.జి లో ఫస్టొచ్చాడంటే,

మా పాప సెవెంత్‌లో స్కూలు ఫస్టంటారు.

టెన్త్‌లో టౌన్ ఫస్టే... స్టేట్ ర్యాంకులయితే సరేసరి...

మార్కులు మాత్రమే పిల్లల ప్రతిభకీ, సృజనకీ గీటురాళ్ళయిపోయాయి.

"ఏంటి ఆలోచనలో పడ్డావ్?" మేం యింటి నుండి మోసుకొచ్చినవన్నీ చాలక యశస్వి కోసం క్యాంటీన్‌లో ఏవేవో ప్యాక్ చేయించి తెచ్చి... బుట్టలో సర్దుతూ ప్రశ్నించాడాయన.

నేనేమీ మాట్లాడకుండా అభావంగా అతడి కళ్ళల్లోకి చూశాను.



"చదువంటే జ్ఞానం కోసం చేసే అన్వేషణ అనీ, చదువంటే పిల్లల్లోని సృజన శక్తుల్ని వెలికి తీసి పదునుపెట్టే ప్రక్రియ అనీ మనమెప్పుడో మర్చిపోయాం ప్రభా...చదువు...చదువు, పరిగెత్తు పరిగెత్తు వెనకబడి పోతావ్ అంటూ పిల్లల్ని రేసుకుక్కల్లా పరిగెత్తించడమే యివ్వాళ చదువులు, మనలా అంకిత భావంతో చదువులు చెప్పే టీచర్లు, మనకెక్కడా కన్పించరీ రోజున" కాలర్ వెనకేసుకుంటూ రిలాక్స్‌డ్‌గా కుర్చీలో కూర్చుంటూ నా ఆలోచనలని గమనించినట్టుగా అన్నాడు.

నా కళ్ళల్లో పల్చటి నీటిపొర ఆయన్ని స్పష్టం కానీకుండా అడ్డుపడుతోంది.

నిజమేం చిన్నప్పుడు మా అయ్యవార్లు చదువుతో పాటు ఎన్నెన్నో మంచి మంచి విశేషాలు చెప్పేవారు. విలువలు నేర్పేవారు. ప్రత్యేకంగా వ్యక్తిత్వ వికాసపు క్లాసులుండేవి కావు... మా టీచర్లూ యింట్లో తల్లిదండ్రులూ మా వ్యక్తిత్వాలను తీర్చి దిద్దేవాళ్ళు... బడి నుండి రాగానే పుస్తకాలు విసిరికొట్టి ఆడుకోడానికి పరిగెత్తే వాళ్ళం.. ఉదయాన్నే లేచి ఒక గంటో రెండు గంటలో చదువుకుని బడికెళ్ళే వాళ్ళం అక్కడ్నుండీ అలసిపోయి స్నానం చేసి మంచానికడ్డం పడేవాళ్ళం... బళ్ళో కూడ కలెక్టరు గారబ్బాయి, బడిపంతులు కూతురు, యింకా రిక్షా అతని కొడుకు అంతా ఒకే తరగతి గదిలో కూర్చునే వాళ్ళం తప్ప.. యీ డబ్బుని బట్టి చదువుల స్థాయి వుండేది కాదు.

"విద్య కార్పొరేటీకరణ చెందని కాలంలో మన బాల్యం గడవడం నిజంగా మన అదృష్టం కదా "పైకే అన్నానీయనతో...."

చిరునవ్వు నవ్వుతూ పక్కవాళ్ళ మాటల్ని వింటున్నారాయన శ్రద్ధగా.

"మాపాప చాల చక్కగా పెయింటింగ్ చేసేది... పుస్తకాలు మంచి మంచివి చదివేది.. అప్పుడప్పుడూ చిన్ని కవితలు కూడా రాసేది. తొమ్మిదో క్లాసు కొచ్చింది. అన్నీ మానేసింది. చదువులకే సమయం చాలకపాయ ప్ ం" వాళ్ళ పాపకోసం ఎదురు చూస్తూ ఎవరో ఒకావిడ చెప్తోంది పక్కవాళ్ళతో.

అవునవును ఆటలు, పాటలు, డ్యాన్సులు, పెయింటింగులూ వంటి సృజనాత్మక కళలన్నింటినీ వదిలివేయాలి... స్వంత ఆసక్తులకి తావే వుండకూడదు ఇవన్నీ కెరీర్‌కి పనికి రావు మరి.

నా లోపలి నుండి ఏదో వేడి గాలి చెవుల్లో నుండి తీవ్రమైన వేగంతో బయటికొస్తోంది... కాంపౌండ్ లోపల పేర్చడానికి తెచ్చివుంచిన తోక బండలు కొన్ని పగిలి చట్టుబండలయివున్నాయి... వాటి మీద పడుతోన్న ఎండ అక్కడ తిరుగులాడుతోన్న మనుషుల మీదికి పరావర్తనం చెందుతోంది....

దీర్ఘంగా నిట్టూర్చి మోచేతిని టేబిల్ మీదాన్చి అరచేతిలో చెంప వుంచి కళ్ళు మూసుకున్నాను...

"తప్పదండీః కష్టపడకపోతే ఎట్లా?... డాక్టరు సీటంటే మాటలా మరి... చదివిందే చదవాలి. రాసిందే రాయాలి. ఒక్క బిట్టంటే ఒక్క బిట్టు కూడ వదలడానికి లేదు. కొన్ని పదుల ర్యాంకులు వెనకబడి పోతారట..."తత్వాన్ని బోధిస్తున్నట్టుగా చెప్తూ మా ఆయన పక్కనే కుర్చీ లాక్కుని కూర్చున్నాడు నంద్యాలమ్మాయి వాళ్ళ నాన్న.. ఇతడు యిదివరకే పరిచయం మాకు.

నేను చప్పున సర్దుకుని కూర్చుంటూ అటు ఇటు తిరుగుతోన్న అమ్మాయిల కేసి చూడసాగాను.

గదిలో నుండి సంహిత తిరిగి క్లాస్ రూమ్‌లోకి వెళ్తూ ఒక పరిచిత చిరునవ్వు విసిరి వెళ్ళింది.. పేరు తెలుసుకున్నదయితే ఈరోజే గానీ ఈ అమ్మాయిని గతంలో నాలుగయిదు సార్లు చూసి వున్నాను. ఎప్పుడూ అదే లేత చిరునవ్వు ఏమాత్రం బెంగలేనిదానిలా, నిరంతరం నింపాదిగా నిశితమైన కల ఏదో వెంటాడుతున్న దానిలా అంతర్ముఖిలా వుంటుంది... ఆ ఆలోచనంతా చదువే అనుకుంటే గుండె నీరయిపోతుంది.

ఇంకా పూర్తిగా గోడలు కట్టని మెస్సులో ఒక పక్కగా కూర్చుని వున్న నన్ను వేసవికాలపు చివరి రోజుల ఎండ చురుక్కుమని తాకడంతో "యశస్వి యింకా రాలేదేమిటా' అనుకుంట టైమ్ చూసుకున్నాను.

"ఒంటి గంటన్నరయిందే యింకా లంచ్‌కి రాలేదేమిటి పిల్ల?" అన్నాను.

మా ఆయన అదేమీ పట్టనట్టుగా నంద్యాలమ్మాయి నాన్నతో కాలేజీ గురించిన కబుర్లలో మునిగిపోయాడు.

మెల్లిగా లేచి హాస్టల్ మెట్లు దిగి కాలేజీ వైపుగా నడిచి ప్రిన్సిపల్ రూమ్ముందున్న లాంజ్‌లో కూర్చున్నాను... లాంజ్‌లో ఆర్భాటంగా అమర్చబడ్డ స్టీలు సోఫాలలో అక్కడక్కడా తల్లిదండ్రులూ, వారితో పాటు అమ్మాయిలూ కూర్చుని వున్నారు...

"ఆంటీ ప్లీజ్ ఒన్ మిస్సడ్ కాల్" అంటూ కాలేజీ నుండి హాస్టల్‌కి వెళ్ళబోతూ ఒకమ్మాయి ఆగి రిక్వెస్ట్ చేసింది... నవ్వుతూ ఫోనందించి చుట్టూ చూశాను పరికిస్తున్నట్లుగా.

నా పక్కన కూర్చుని వున్నమ్మాయి దిగులుగా తలవంచుకుని నేలచూపులు చూస్తోంది.. మెల్లిగా మాటలు కలిపాను" ఇవ్వాళే జాయినవుతున్నావా?" అంటూ...

"లేదాంటీ టి.సి తీసుకుని వెళ్ళిపోతున్నాను" అన్నదామ్మాయి గిల్టీగా

అదేమిటన్నట్లుగా చూశాన్నేను... అమ్మాయికి అటువైపుగా కూర్చున్న వాళ్ళ నాన్న కాబోలు అందుకున్నాడు.

"గదిలో బాత్‌రూమ్ కోసం గొడవండీ... ఆరింటకే కాలేజీ మొదలవుతుంది. నాలుగింటికే లేచి పోటీ పడ్డా బాత్‌రూమందదు.. విపరీతమైన అలసట.. రూమ్మేట్స్‌తో స్పర్థలు... ఇవన్నీ మేనేజ్ చేసుకుంటూ చదువు మీద ధ్యాస పెట్టాలి.. ప్రెజరయి పోతోందండీ.. సిటీలో వున్న వీళ్ళదే 'డేకాలేజీకి" మారుస్తున్నందుకు పదిహేనువేలు కట్ చేసుకుంటున్నారు..." అతడి ముఖంలో కూడ అలసట, తీవ్రమైన ఒత్తిడి...

నిర్ఘాంతపోయి చూస్తోన్న నన్నే గమనిస్తూ మళ్ళీ అతడే

"మాది బెజవాడే లెండి యింటి నుండి మంచి ఆటో మాట్లాడి పంపిస్తాను. డబ్బుకంటే, చదువుకంటే కూడ పాప ముఖ్యం కదండీ మనకి అయినా అన్నీ తెలిసీ ఈ బందిఖానాలకి మన పిల్లల్ని పంపడం, ఈపోటీ బరిలోకి దించడం తల్లిదండ్రులుగా మన తప్పుకూడ కదా" చాలా లో గొంతుకతో చెప్పాడతడు.



తండ్రి తనను అర్థం చేసుకున్నందుక్కాబోలు అమ్మాయి కళ్ళల్లో గొప్ప రిలీఫ్.

"నిజమేనండీ... పిల్లలూ, వాళ్ళ ఆలోచనలూ, వాళ్ళ ఆసక్తులూ, ఆకాంక్షలూ ఇవే మనకి ముఖ్యం.. జ్ఞానానికీ, సృజనకీ ఏమాత్రం సంబంధంలేని చదువులే యివ్వాళ చదువులుగా చెలామణీ అవుతున్నాయి... మొత్తంగా మన విద్యారంగంలోనే సమూలమైన మార్పులు తెచ్చి పిల్లల మీద ఒత్తిడి లేకుండా చూడాలి" అలా అంటుంటే నా గొంతు పీలగా అయింది.

"మీరు టీచరా?" అన్నాడతడు కనిపెట్టేశాను చూశారా అన్నట్టు "అవును ఇక్కడికి దగ్గరిలో కంకిపాడులో వుంటున్నాం... ఇద్దరం రిటైర్డ్ టీచర్స్ మే..." అన్నాను నవ్వుతూ...

జీవితకాలం ఉద్యోగాలు చేసి మేము పెద్దగా వెనకేసిందేమీ లేదు. కంకిపాడులో మా అత్తగారిచ్చిన పాత ఇంటిని కొత్తసౌకర్యాలన మర్చి అక్కడే స్థిరపడ్డాం... మాకున్న ఒకే ఒక కొడుకుని ఈ ఒత్తిడి చదువుల వెంట తరమ కుండా వాడికి నచ్చినట్లుగా కామర్స్‌లో చేర్చానని అంతా నన్ను వెర్రిదాన్ని చూసినట్లు చూశారు.

ఇక్కడే వుంటున్నాం కదా యశస్విని మనింట్లో వుంచుకుని డేస్కాలర్‌గా పంపుదామని నేనన్నపుడు మా ఆడపడుచూ, మా ఆయనా కూడా నా మీద గయ్యిమంటూ లేచారు. "నీ కొడుకుని చేసినట్టే దాన్ని కూడా డిగ్రీలో చేరుస్తావా' అంటూ కొట్టిపడేశారు. రోజూ వెళ్ళిరావడం వల్ల పిల్లకి చాల టైం వేస్టయిపోతుందట, అలసి పోతుందట, హాస్టల్లో అయితే పక్క పిల్లల్ని చూస్తూ తెగ చదివేస్తుందట.. ఆపోటీ వుంటేనే తప్ప నీట్లో సీటురాదంట....

"అసలు నీట్ అంటే ఏముందీ?" పక్కనతనెవరో ఇతడ్నడిగితే ఇతడు నాకేసి చూశాడు...

"నేషనల్ ఎలిజిబిలిటీ ఎంట్రెన్స్ టెస్టండీ.. అసలిది ఎలా వుండబోతోందో ఎవరికీ స్పష్టత లేదు... ఇంటర్ మార్కులకు వెయిటేజీ వుంటుందని కొందరూ, వుండదనీ కొందరూ అంటున్నారు..." చెప్పాన్నేను. మరింత లోతుల్లో కెళ్ళకుండా...

"వెళ్ళొస్తామండీ... పదమ్మా.." అంటూ వైతరణీ వాళ్ళ నాన్న నా వద్ద వీడ్కోలు తీసుకుంటూ ముందుకు నడిచాడు కూతురితో కలిసి...

"ప్చ్ ఈ వైతరణిని దాటడం ఆ పిల్లకసాధ్యమైపోయింది"

"ఆంటీ మీకు ఫోనొస్తోంది" నా ఫోను పట్టుకెళ్ళినమ్మాయి ఎట్టకేలకు నా మీద దయదలచింది... ఆపిల్ల బుగ్గల మీద ఆరి చారకట్టిన నీటిచుక్క మళ్ళీ నన్ను కుదిపింది...

ఇంతలో మా ఆయన ఎప్పుడక్కడికి వచ్చాడో, ఎప్పుడు యశస్వి కిందికి దిగిందో తెలీదు గానీ యశస్వి ఆయన్ని చుట్టుకుని ఏడుస్తుండడం, మా ఆయన కళ్ళనీళ్ళు పెట్టడం యిదంతా నన్ను మరింత కలిచివేసింది.

ఏమైందీ పిల్లకి? ఎంతో ధైర్యంగా వుండేది అనుకుంటూ ఆదారిని వెళ్తూన్న వాళ్ళంతా వీళ్ళిద్దరినీ వింతగా చూడ్డం గమనించి యశస్విని పొదివి పట్టుకుని లాంజ్‌లోకి చేర్చి ఒక పక్కగా కుర్చీలో కూర్చోబెట్టాను.. మా ఆయన మౌనంగా మమ్మల్ని అనుసరించాడు...

పూర్తిగా ఏడవనిచ్చి యశస్విని ఏమైందన్నట్లు కళ్ళతోనే ప్రశ్నించాను.

"అత్తా నాకు ఇరవై నాలుగు మార్కులే వచ్చాయి. మాక్లాస్ ఫస్ట్ ముప్ఫయి" అంది వెక్కుతూ...

నా గొంతులో పడ్డ గుండు గుండెల్లోకి జారింది.

"ముప్ఫయికి ముప్ఫయి?... అంటే నీకు ముప్ఫయికి ఇరవై నాలుగా? మంచి మార్కులే కదా" అనబోయి నోరు మూసుకున్నాను.

ఆ పిల్ల వాళ్ళ వూర్లో ఎప్పుడూ స్కూలు ఫస్ట్.. మొన్న టెన్త్‌లో అయితే టౌన్ ఫస్ట్... అందుకే ఫస్టు రానందుకు తట్టుకోలేకపోతూంది.

"ఇక్కడ అంతా నీలాంటి టాపర్సే కదమ్మా.. ఆవూళ్ళో నుండొచ్చి ఈ నగరాల్లో కార్పొరేట్ స్కూళ్ళల్లో చదివి వచ్చిన పిల్లల్తో కోపప్ చేయడం కష్టమే తల్లీ.. ఇది మొదటి పరీక్షే కదా... క్రమంగా పికప్పవుదువు గాన్లే... అంత మరీ బెంబేలు పడకు.. మార్కులు మాత్రమే కొలమానం కాదు గదా" తనకి తోచిన మాటల్తో మేనకోడల్ని ఓదారుస్తున్నాడు మా ఆయన.

"మావయ్యా" మొన్న నీట్ ఎగ్జామ్ కూడ జరిగింది. అందులో

అయితే నాకు టూ హండ్రడ్‌కి ఒన్ థర్టీయేం అంటూ" మళ్ళీ వెక్కసాగింది.

ఏమాత్రం విచక్షణ లేకుండా ఈ పిల్లల్ని మార్కుల కత్తుల బోను లోకి నెడుతున్న వాళ్ళెవరు?... వాళ్ళతో ఎట్లా పోరాడాలి?

"యశస్వీ" పిల్చాన్నేను.

"వెక్కిళ్ళు ఆపకుండానే ఏమిటన్నట్లుగా నాకేసి చూసింది.

"పదం భోజనం చేయి... పర్మిషన్ తీసుకుని యింటికెళ్దాం.. రిలాక్సయి రేపు మళ్ళీ వద్దువుగాన్లే...

"అహహం వద్దత్తా రేపు మళ్ళీ టెస్ట్ వుంది" ఖంగారుపడిపోయింది.

హతోస్మి... స్లిప్‌టెస్ట్, వీక్లీటెస్ట్, యూనిట్ టెస్ట్

పరీక్షలు, పరీక్షలు... నిరంతరం పరీక్షలు. చదువునిమించిన పరీక్షలు.

ఇదేం విషమ పరీక్షరా దేవుడా? అనుకుంటూ మెల్లిగా యశస్విని తీసుకుని మెస్ కేసి నడవసాగాం యిద్దరమూ... అతి బలవంతం మీద యశస్వి ఒకముద్ద పెరుగన్నం తిని స్టడీ అవరుందంటూ కాలేజీ వైపుగా సాగిపోయింది గమ్యం తోచని పథికురాలిలా...

ఎందుకో అన్నం తినాలన్పించలేదు... అలాగని యింటికెళ్ళాలనీ లేదు.

"సాయంత్రం అయిదింటికి యశస్వి స్టడీ అవర్నుండి వచ్చేదాకా వుండి చూసిపోదాం..." అన్నాన్నేను.



తన ఉద్దేశం కూడా అదేనన్నట్లుగా తలూపాడాయన.

మెల్లిగా కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళి లాంజిలో స్థిరపడ్డాం...

కుర్చీలోనే వెనక్కివాలి కళ్ళు మూసుకున్నాన్నేను.. అలా ఎంతసేపు గడిచిందో తెలీదు గానీ... అమ్మాయిలంతా హడావిడిగా మెట్లు దిగి పరిగెడుతున్నట్లు, యశస్వి కేదో అయినట్లు, దిగులు దిగులుగా.. చప్పున తల విదిలించి స్పృహలో కొచ్చి నిటారుగా కూర్చున్నాను.

"సునీల్ ఎంకాంలో చేరాడని అంతా జాలిపడతారు గానీ నిజానికి ఈ పిల్లలంతా అసూయ పడేట్టు ఏమాత్రం ఒత్తిడిలేని చదువు చదువుకున్నాడు వాడు" అన్నాన్నేను...

మా ఆయన నాకేసి జాలిగానే చూశాడు. పొద్దుట్నుంచీ ఈ పిల్లలందరినీ చూసి నేను పడుతోన్న ఒత్తిడి ఆయనకర్థమయినట్టే వుంది...

ఎండ యింకా చల్లారలేదు... ప్రిన్సిపల్ ఎవరితోనో ఫోన్లో మాట్లాడుతూ మా ముందు నుండే కారిడార్లోకి వెళ్ళాడు... కాసేపు మౌనాన్ని సంతరించుక్ను లాంజ్ మళ్ళీ మాటల్లో పడింది.

"వెయ్యి రూపాయలు పెట్టి ఏనాడయినా ఒకచీర కొనుక్కుని ఎరుగుదుమా? ఒక తెంపుగా ఖర్చుపెట్టుకున్నామా? ఒక్కసారిగా లక్షరూపాయలు కట్టడమంటే మాటలా?...'

మాకు వెనక పక్క కుర్చీల్లో కూర్చుని యిద్దరు ఆడవాళ్ళు ఎవరికోసమో ఎదురుచూస్తూ వాళ్ళల్లో వాళ్ళే మాట్లాడుకుంటున్నారు.

"ఏం చేస్తాం చెప్పు పొలం అమ్మయినా సరే పిల్లల్ని చదివించాలని పట్టుబట్టేసి నాడీయన... ఎట్ల చేస్తాడో ఏమోమరి? ప్చ్"

"పొలం అమ్ముకుంటే మళ్ళీ కొనగలమా? ఈ కాలేజీలొచ్చేసి, కంపెనీలొచ్చి ఎక్కడయినా జానెడు స్థలం దొరుకుతోందా? దొరికినా మనబోటోళ్ళకి అందుబాటులో వుంటుందా?"

నా గుండెని తరగడం కోసమే నేనివ్వాళ, ఇక్కడి కొచ్చినట్లుంది. ఏమిటీ పిచ్చి? ఏమిటీ వేలం వెర్రి ఎందుకింత తపన?

"ఇంటరంటే జీవితం మొత్తంలో ఒక కీలకమైన మలుపు. ఈ రెండేళ్ళు కష్టపడితే జీవితమంతా సుఖపడిపోవచ్చునంటూ ఇటు కార్పొరేట్ అయ్యవార్లూ, అటు తల్లి దండ్రులూ పదే పదే వల్లె వేసే వాక్యం నన్ను తొలిచి పారేస్తోంది.

"హాయ్ అంకుల్" మయూరి అటుగా వెళ్తూ పలకరించిందీయన్ని జేబులో నుండీ ఫోను తీసి అందిస్తూ "ఎలా వున్నావమ్మా" అన్నారీయన

"ఏదోలెండి... భయం భయంగా వుందంకుల్... రోజుకి పన్నెండు గంటలు చదివినా పోర్షన్ కావడంలేదు... మార్క్లాస్ ఫస్ట్ ఒన్ నైన్టీ ఫైవంకుల్... ఆ పిల్లలు చిన్నప్పట్నుండే కాన్సెప్ట్ స్కూళ్ళలో.. ఈ కాలేజీకీ సంబంధించిన స్కూళ్ళో మెరికాన్, ఐ.ఐ.టి కోచింగులతో చదివారు., వాళ్ళతో పరిగెత్తడం చాలా కష్టంగా వుంది... మెల్లిగా రీచవుతాం..

పాపం యశస్వి భయపడిపోయి ఏడ్చేస్తోంది... ధైర్యం చెప్పండంకుల్" అంటూ మిస్స్‌డ్ కాల్ నొక్కి పక్కకి వెళ్ళింది...

ఈ ఆలోచనలతోనే మరో అరగంట కాలం మా మీది నుండి పాక్కుంటూ వెళ్ళింది.... సంహిత క్లాస్ నుండి హాస్టల్ వైపుగా వెళ్తూ అదే విడివడని పెదాల తో "ఆంటీ ప్లీజ్.." అంటూ నా ముందు చేయి చాపింది.

ఫోనందిస్తూ" యశస్వి ఎక్కడమ్మా?'' ప్రశ్నించాడీయన.

"వస్తోందంకుల్ం నేను వేరే సెక్షన్... అదిగో" అంటూ పైన వరండాలోకి చూపించింది... యశస్వి కనపడగానే కొంచె కుదుటబడ్డాం యిద్దరం.

సంహిత వంక తిరిగి

"నీ పేరుకి అర్థమేమిటో తెలుసా?" ప్రశ్నించాన్నేను అయాచితంగా

అడుగు ముందుకు వేయబోయి అదే నవ్వుతో నాకళ్ళల్లోకి సాలోచనగా చూసిందా పిల్ల... ఒక్క క్షణం మౌనం తరువాత

"కలెక్షనాఫ్ కలర్స్ ఆంటీ... ఇంద్రచాపం" అంది. "థ్యాంక్యూ ఆంటీ మర్చిపోయిన నాపేరుకి అర్థాన్ని గుర్తుచేశారు.." మళ్ళీ తనే అంది అదే లో గొంతుకతో...

ఏమనుకుందో గానీ మాట్లాడకుండానే ఫోన్ నాచేతి కిచ్చి వెళ్ళిపోయింది.

ఇదే మొదటిసారి నేనా పిల్ల కళ్ళల్లో నీళ్ళు చూడ్డం.

దీర్ఘంగా నిట్టూర్చాన్నేను... పిల్లల మనసుల్ని వికసింప చేయాల్సిన చదువులు యిలా అస్థిత్వాలను కోల్పోయేలా చేయడం ఎంత దారుణం...

ఇంతలో మరో అమ్మాయి అదే బెరుకుతో, అదే ఆదుర్దాతో మా ఆయన ముందు నిలబడి చాపి చాపని చేతితో

"అంకుల్ ప్లీజ్.." అంది. ♦

# నవంబర్ నెల పురస్కారాలు



| బొడ్రాయి | పోరాటమంటే... |
|---|---|
| కథకు........రూ.700/- | కవితకు.......రూ.500/- |
| రచయిత : మేరెడ్డి యాదగిరిరెడ్డి | రచయిత : సిరిసిల్లా గఫూర్‌శిక్షక్ |

**సినీ రచయిత జనార్ధన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.**
మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

- ఎడిటర్

## వెళ్లిపో...కోయిలా...

ఉదయమిత్ర
© 9985203376



ఎక్కడెక్కడ తిరిగిందో
ఎన్నికలల పొదిగిందో
చుక్కదెగిపడ్డట్టు
పొద్దునే ఒంటరి కోయిలొకటి
గొంతు సవరించుకుంటోంది

అది... వెన్నెల జలపాతమో
భరించలేని బాధలపల్లవో తెలీదు
తోడుకోసం ఆరాటమో
జాడకోసం వెతుకులాటో తెలీదు గాని
దాని రాగాల సవ్వడులూ
కిరణాల సందడులూ కలగల్సి
మాగుండె వాకిట్లో
గొప్ప ఉదయాన్నే ఆవిష్కరిస్తున్నాయ్
చెట్లు తమ కొమ్మల చేతులు జాచి
స్వాగతాలు పల్కుతున్నాయ్

*   *   *

మాకైతే రోజూ తెల్లారుతోంది గాని
దాని గుండెల్లోనే
చీకట్లేవో కొట్లాడుతున్నట్టున్నాయ్
దాని రెక్కలల్లార్చడంలో
కుదురులేని గెంతుల్లో
శూన్యాలకేసి చూస్తోన్న చూపుల్లో
తోడుకోసం పిచ్చితండ్లాట
ముల్లులా గుచ్చుకుంటోంది
వలసబోయిన కొడుక్కోసం
వాకిలికి అతుక్కుపోయిన
ముసలితల్లిలాగ
కోయిల ఎదురుచూపులు
వేదనలై, ప్రశ్నలై, వెంటాడే నీడలై
చుట్టు ముడుతున్నవి...
ఇంతకూ... దానితోడెక్కడో
ప్రేయసిమృదుస్పర్శ కోసం
ఏఏ విషాదవనాల తిరుగాడుతున్నదో
ఏసెల్‌టవర్ల మాయాజాలంలోజిక్కి
ఏసెజ్‌ల బీభత్సానికోభీతిల్లి
ఎంతగా గిలగిలకొట్టు కుంటున్నదో...
తోడుకోసం వేసిన పెనుకేక
ఏఫ్యాక్టరీ శబ్ద బీభత్సంలో కనుమరుగైందో...
అభివృద్ధి విధ్వంసంలో
విరిగిపడ్తోన్న జీవనశకలాలెన్నెన్నో...

*   *   *

వెళ్లిపో.... కోయిలా...
తొడెలాగులేదు...
మనిషి యంత్రంగా మారుతోన్న
మరుభూమిలో
నీగోడు వినేవారెవ్వరూ లేరు
పోపో... వెళ్ళిపో..

## దహిస్తూ...

కె. విల్సన్ రావు
© : 8985435515



ఎడతెగని నడక
ఎప్పటికీ ముగియని ప్రయాణం
ఎన్నిదారుల్లో తిరుగాడినా
ఎవరితోనూ నిమిత్తం లేని కాలం ఆగదు.

ఎదురు చూపుల్లో ప్రేమ పక్షులకు
కాలం తెలియదంటారు గానీ
నన్ను నేను వెదుక్కుంటూనే
కాలమంతా కరిగిపోయింది.

ఒక్కమాట కూడ మాట్లాడలేదు
నన్ను సంజ్ఞారేఖపై నిలబెట్టి
శబ్దిస్తూ... నృత్యిస్తూ... క్రీడిస్తూ
మెలమెల్లగా... మెల్లగా
నిలువెల్లా దహిస్తూ సాగుతుందీకాలం
నన్ను శాసిస్తూ... శపిస్తూ... మనోహరంగా....

# సాహితీ విమర్శపై "మరోచర్చ"

దేశాయ్ అనిత
9519986833




సాహిత్యంలో ఆరోగ్యకరమైన విమర్శ దారి తప్పకూడదన్నది ప్రాతిపదికగా చేసుకొని విమర్శించిన వ్యాసాలివి. ఆధునిక విమర్శకులకు గట్టి భరోసానిస్తూ దారి తప్పుతున్న 'నవరసాల' వంటి విమర్శకులను సున్నితంగా హెచ్చరించిన వ్యాసాలు ఇందులో ఉన్నాయి.

సాహిత్యానికి విమర్శ కావలి కుక్కలా పనిచేయాలని కొడవటిగంటి కుటుంబరావు అంటారు. అలాగే సాహిత్య విమర్శకు కూడా విమర్శ లేకపోతే సాహిత్యాన్నే తప్పుడు మార్గం పట్టించే అవకాశాలుంటాయి. రాచపాళెం చంద్రశేఖరరెడ్డి గత రెండు దశాబ్దాలుగా సాహిత్య విమర్శపై విమర్శలు రాస్తూ సాహిత్య విమర్శ గతి తప్పకుండా ప్రజాస్వామిక స్వేచ్ఛకు అవకాశం కల్పిస్తున్నారు. ఈ క్రమంలోనే 'మరోచర్చ' తెలుగు సాహిత్యంపై విశ్లేషణ అన్న గ్రంథాన్ని వెలువరించారు. 2006వ సంవత్సరంలో 'చర్చ' పేరుతో ఒక గ్రంథాన్ని ప్రచురించారు. ఆ చర్చకు కొనసాగింపే 'మరోచర్చ' కానీ తద్భిన్నమైన చర్చకాదు.

మరోచర్చలో ఇరవై ఆరు వ్యాసాలున్నాయి. 2006 నుంచి 2010 దాకా నాలుగు సంవత్సరాల కాలంలో రాసిన వ్యాసాలివి. ఇందులో సాంప్రదాయ సాహితీ తిమ్మావజ్ఝల కోదండ రామయ్య నుండి నేటి యువ విమర్శకులు జూలూరి గౌరిశంకర్ దాకా రాసిన విమర్శ వ్యాసాలపై విమర్శించిన వ్యాసాలు వున్నాయి. ఇందులో చాలావరకు ఆయా విమర్శకులు వెలువరించిన విమర్శ గ్రంథాలపై పూర్వాపరాలను విమర్శించిన వ్యాసాలే అధికంగా ఉన్నాయి. అలాగే 1996 నుంచి 2008 వరకు వివిధ దినపత్రికలు, సాహితీ మాసపత్రికల్లో వచ్చిన కవిత్వం, కథ, నవల, నాటకం, విమర్శ వ్యాసాలు వాటిపై ప్రతి విమర్శ వ్యాసాల వంటి వాటిపై రాసిన వ్యాసాలు కూడా మరో చర్చలో ఉన్నాయి.

సాహిత్యంలో ఆరోగ్యకరమైన విమర్శ దారితప్ప కూడదన్నది ప్రాతిపదికగా చేసుకొని విమర్శించిన వ్యాసాలివి. ఆధునిక విమర్శకులకు గట్టి భరోసానిస్తూ దారి తప్పుతున్న 'నవరసాల' వంటి విమర్శకులను సున్నితంగా హెచ్చరించిన వ్యాసాలు ఇందులో ఉన్నాయి. జూలూరి గౌరిశంకర్‌ను 'ఆధునిక కవిత్వం' అనే విమర్శనా వ్యాస సంపుటికి రాసిన ముందు మాటలో భుజం తట్టి ప్రోత్సహించారు. గౌరిశంకర్ నిర్మాణ పద్ధతిని, దృష్టిని వివరించారు.

వల్లంపాటి వెంకటసుబ్బయ్య సాహిత్య విమర్శలో తనకంటూ ఒక స్థానం ఏర్పరచుకొన్నారు. ఆయన కృషిని రాచపాళెం మూడు భాగాలుగా విభజించారు. సాహిత్యాన్ని గురించి వల్లంపాటి అభిప్రాయాలు, దీని వెలుగులో విభిన్న రచయితల గురించి చెప్పిన అభిప్రాయాలు, సాహిత్య విమర్శను గురించి చెప్పిన అభిప్రాయాలు అని మూడు భాగాలుగా విభజించుకొని, మూడో అంశాన్ని మాత్రమే రాచపాళెం వివరించారు. సాహిత్య విమర్శ కళనా? లేదా శాస్త్రమా? అనేది విశ్వ విద్యాలయాల్లో ఒక చర్చ కొనసాగుతూంది. కళగా ప్రారంభమై శాస్త్ర లక్షణాల్ని విమర్శ రూపొందించుకుంటుంది అన్న వల్లంపాటి అభిప్రాయాన్ని చర్చించాల్సిన అంశం అని రాచపాళెం పాఠకులకు సూచిస్తారు.

సాహిత్య విమర్శ కొన్ని సందర్భాలలో అపార్థాలకు వైమనస్యాలకు దారి తీసిన సందర్భాలున్నాయి. విమర్శకుని అభిప్రాయాల్ని చక్కగా అర్థం చేసుకోకపోతే ఏర్పడే దౌర్బల్యస్థితి ఇది. సర్దేశాయి తిరుమలరావు సాంకేతిక విజ్ఞాన రంగంలో గొప్ప కృషి చేశారు. అలాగే 'కన్యాశుల్కం – నాటక కళ' 'శివభారత దర్శనం' అన్న రెండు గ్రంథాల్ని వెలువరించారు. సాహితీ విమర్శ కృతజ్ఞతా రహిత ప్రక్రియ అని తెలిసి కూడా రచయితల పట్ల కృతజ్ఞతతో సాహిత్య విమర్శ రాశారని సర్దేశాయి తిరుమలరావు విమర్శనా పద్ధతిని రాచపాళెం వివరిస్తారు. సాహితీ విమర్శకులకు ఇతర భాషా సాహిత్యాల పట్ల అభినివేశం ఎలా ఉండాలో వివరిస్తారు. గురజాడ అప్పారావును గురించి తిరుమలరావు పులిచర్ల సాంబశివరావుతో తలబడే విధానాన్ని చూస్తే పాఠకులకు ఆశ్చర్యం వేస్తుంది. ఇంతటి ప్రజాస్వామిక వాతావరణంలో సాహితీ విమర్శ చర్చ జరిగిందా అనిపిస్తుంది. సాహితీవేత్తకు విమర్శకునికి ఉండవలసిన ఏలకడ స్థితిని ఈ చర్చ అన్వేషణా దృక్పథానికన్నా విశాల స్వభావం కలిగి ఉండాలని ఈ వ్యాసాల వల్ల తెలుస్తుంది.

ఉద్యమాల నేపథ్యంలో సాహితీ విమర్శకు సంబంధించి కొత్త

భావనలు పుట్టుకొస్తుంటాయి. సామాజిక రాజకీయ ఉద్యమాల నేపథ్యంలో పుట్టుకొచ్చే భావనల్ని తగిన స్థాయిలో వివరించుకోవాల్సిన అగత్యం ఏర్పడుతుంది. నిబద్ధత, నిమగ్నత అన్న భావనలు నక్సలైట్ల సాయుధ పోరాట కాలంలో వచ్చిన భావన ఉద్యమానికి నిబద్ధుడై రాసేవారు నిబద్ధత గల వారు గానూ ఉద్యమంలో ఉండి ఉద్యమాన్ని గురించి రాసేవారు నిమగ్నులుగానూ, డెబ్భైయ్యవ దశకంలో పేర్కొనేవారు. ఈ భావనల్ని పొడిగిస్తూ నిబిడత అన్న కొత్త భావనను ఆచార్య కొలకలూరి ఇనాక్ 'ఆధునిక సాహిత్య విమర్శ' గ్రంథంలో ప్రతిపాదించారు. ఇదో కొత్త ప్రతిపాదన. ఈ భావనలు సాహిత్యానికే కాదు విమర్శకు కూడా ఉండాలని రాచపాళెం విమర్శను కొనసాగించిన తీరు ఈ గ్రంథంలో ప్రత్యేకంగా కనిపించే వ్యాసం. సీరియస్‌గానే చర్చించాల్సిన గ్రంథమిది.

"విప్లవోద్యమం సకల మానవ జాతి విముక్తి ఉద్యమం. అయినా కొలకలూరి కొండజాతి జనం జీవితాన్ని మాత్రమే స్వీకరించి, కొండజాతి ప్రజల మీద సానుభూతితో విరసం దృక్పథంతో రాస్తే నిబద్ధతా సాహిత్యమని ఊరికే రాయడమేగాక వాళ్ళ బాధలలో భాగం పంచుకుంటూ, వాళ్ళ విముక్తి కోసం పోరాటం చేస్తూ రాస్తే నిమగ్నతా సాహిత్యమని, వాళ్ళే తమను తాము బాధల నుంచి విముక్తం చేసుకోవడానికి ఉద్యమించి కలం పట్టి రాస్తే... నిబిడతా సాహిత్యమనీ నిర్వచించారు. అంటే విప్లవ దృక్పథంతో రాసే రచయిత లందరూ విప్లవ రచయితలైన వాళ్ళు అందరూ నిబిడ రచయితలు కారు, కొందరే. మరికొందరు నిమగ్నులు, ఇంకొందరు నిబద్ధులు" అని కొలకలూరి నిబిడతను గురించి ఇచ్చిన నిర్వచనాన్ని వివరించారు. అలాగే దళిత సాహిత్యం, విప్లవ దృష్టి, నిరసన, ఆర్థికకోణం, చైతన్యం, సంస్కరణలోని శిథిలతా నిర్మూలనం అన్నీ ఉన్నాయని దళిత సాహిత్యంలో అన్ని ఉద్యమాల జీవశక్తి ఉందని కొలకలూరి వివరించిన తీరును రాచపాళెం పరిచయం చేస్తారు. కొలకలూరి సూత్రీకరణలు, చర్చనీయాంశాలు సందేహాంశాలుగా ఉన్నాయని చెబుతూ 20వ దశాబ్దంలో ఈ గ్రంథం నిస్సందేహంగా ఒకటని వివరిస్తారు. అదేవిధంగా ఎ.బి.కె. ప్రసాద్ సాహిత్యకీయాలు, చేరాతలు, కత్తి పద్మారావు, యు.ఎ. నరసింహమూర్తి హరిపురుషోత్తమరావు, సింగమనేని, ఎన్.గోపి, సి.వి. పాపినేని శివశంకర్ వంటి ప్రముఖుల విమర్శనా సూత్రాలను శైలిని అవగాహనను పరిచయం చేసే వ్యాసాలున్నాయి. ఈ గ్రంథంలో వీరిని గురించేగాక పరిశోధనాత్మక విమర్శా విమర్శనా వ్యాసాలు కూడా ఉన్నాయి.

ఈ గ్రంథంలో మనకు ప్రత్యేకంగా కనిపించే 2006, 2007, 2008 సంవత్సరాలలో వివిధ దినపత్రికలు, సాహితీ పత్రికల్లో వచ్చిన విమర్శా వ్యాసాలపై రాసిన విమర్శలున్నాయి. ఇందులో ప్రణాళికా బద్ధంగా కవిత్వం, నవల, కథ విమర్శ ప్రతివిమర్శలపై రాసిన వ్యాసాలు గ్రంథకర్తలకు ఉండే నిశిత పరిశోధనా దృష్టికి తార్కాణాలు. ప్రతివారం అన్ని దినపత్రికల్లో వచ్చే సాహితీ వ్యాసాల్ని క్రమం తప్పకుండా చదివి అక్షరబద్ధ చేయటం గొప్ప పరిశోధకులకు మాత్రమే సాధ్యమౌతుంది. ఇంతటి శ్రమతో ఆంధ్రదేశంలో జరుగుతున్న సాహిత్య చర్చను గురించి వివరించటం అపూర్వం.

మరో విధంగా చెప్పాలంటే ఒక సంవత్సర కాలంలో వచ్చిన విమర్శను సమీక్షించిన వ్యాసాలివి. విభిన్న దృక్పథం కలిగిన రచయితలు, విమర్శకుల ప్రమాణాలు, పాఠకులకు తెలుస్తాయి. రాష్ట్ర మొత్తంగా సాహితీవేత్తల అభిప్రాయాల్ని ఒకచోట సమీక్షించడం పరిశోధకులకు అనుకూలించే అంశం. ముఖ్యంగా విశ్వవిద్యాలయాల్లో తెలుగు సాహిత్య పరిశోధక విద్యార్థులకు కరదీపికలాగా ఈ వ్యాసాలు పనికొస్తాయి. తమ పరిశోధనాంశానికి కావలసిన సాధన సంపత్తి ఆచూకి ఈ వ్యాసాల్లో లభిస్తుంది.

***

**ఒక సంవత్సర కాలంలో వచ్చిన విమర్శను సమీక్షించిన వ్యాసాలివి. విభిన్న దృక్పథం కలిగిన రచయితలు, విమర్శకుల ప్రమాణాలు, పాఠకులకు తెలుస్తాయి. రాష్ట్ర మొత్తంగా సాహితీవేత్తల అభిప్రాయాల్ని ఒకచోట సమీక్షించడం పరిశోధకులకు అనుకూలించే అంశం. ముఖ్యంగా విశ్వవిద్యాలయాల్లో తెలుగు సాహిత్య పరిశోధక విద్యార్థులకు కరదీపికలాగా ఈ వ్యాసాలు పనికొస్తాయి.**

***

ఈ వ్యాస సంకలనంలో సాహిత్య పరిశోధనలో సామాజిక శాస్త్ర దృష్టి అన్నవ్యాసం మరో ప్రత్యేకమైన వ్యాసం. సామాజిక శాస్త్ర దృష్టితో వచ్చిన పరిశోధనా గ్రంథాల్ని సంకలన గ్రంథాల్ని పరిచయం చేస్తూ కేతు విశ్వనాథరెడ్డి 'దృష్టి' అనే విమర్శా గ్రంథం ఆధారంగా సాహిత్య పరిశోధనలో సామాజిక శాస్త్రాల ఆవశ్యకతను గురించి వివరిస్తారు. సాహిత్య గమనాన్ని ప్రభావితం చేసేది సమాజమే. ఒక్కొసారి సాహిత్యం కూడా సమాజాన్ని ప్రభావితం చేయవచ్చును. ఈ గతితర్కాన్ని దృష్టిలో ఉంచుకొని సాహిత్య పరిశోధనకు సామాజిక శాస్త్రాల అవసరం ఎటువంటిదో ఈ వ్యాసంలో రాచపాళెం వివరిస్తారు. రాచపాలెం పరిశోధనా గ్రంథం 'శిల్ప ప్రభావతి' నుండి ఈ వ్యాస సంకలనం దాకా వచ్చిన పరిణామాన్ని విశ్లేషిస్తూ ఒక వ్యాసం వస్తే బాగుంటుంది కేవలం అలంకారిక పరిశోధనతో ప్రారంభమై సామాజిక శాస్త్రాల ప్రాముఖ్యతను గుర్తించేంత వరకు ఒక విమర్శకునిలో జరిగిన పరిణామాన్ని విశ్లేషించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఆ మాటకొస్తే రాచపాళెం సాహితీ వ్యవసాయం విమర్శనా రంగంలోనే ఎక్కువగా కొనసాగిందని చెప్పాలి. మూడు కవితా సంకలనాలు, నాలుగు అనువాదాలు తప్ప పదిహేను పరిశోధనా గ్రంథాలే వెలువడ్డాయి. పదుల కొద్దీ విమర్శా గ్రంథాలు, వందల కొద్దీ విమర్శా వ్యాసాలు సమీక్షించిన సమీక్షకుడిలో జరిగిన పరిణామాల్ని విశ్లేషిస్తే సమాజ సాహిత్య సంబంధాల విశ్లేషణకు రాచపాళెం మరో ఉదాహరణౌతారు. మొత్తానికి మరోచర్చ తెలుగు సాహితీ విమర్శ గమ్యం గమనాన్ని నిర్దేశించింది.

# మాదిగల సంస్కృతి, సంప్రదాయాలు - కుల ఆవిర్భావము

ఎన్. వసంత
✆ 9705596853



**కులం అనేది ఒక సంక్లిష్టమైన సాంఘిక పరిణామం. పురాతన వేదకాలం నాటికి కుల వ్యవస్థ లేదని వేదాల అధ్యయనం వల్ల తెలుస్తుంది. స్థానికులపై ఆర్యులు దండయాత్ర చేసి విజయం సాధించడం వల్ల వేదసంస్కృతి క్షీణతవల్ల కులం, వెలికివచ్చిందని భారతీయ ఇతిహాసాలు తెలియజేస్తున్నాయి. కులం శతాబ్దాల తరబడి కఠినమైన నిబంధనలు విధించకుండా అన్నివర్గాలవారికి మత సాంఘిక స్వేచ్ఛనిచ్చింది. కాని తరువాత క్రమంగా కఠినత్వాన్ని తనకంటూ ఒక ప్రత్యేకతను సంతరించుకుంటూ ప్రత్యేకమైన కులసమూహాలుగా రూపొందుతూ వేలకాలది కులాలుగా ఉపకులాలుగా భారత ఖండంలో విస్తరిల్లింది. కులవ్యవస్థ కేవలం హిందువులనే కాకుండా భారతదేశంలోని క్రైస్తవులను కూడా ప్రభావితం చేస్తూ ఒక అఖిల భారత సంస్థగా రూపొందిందని సామాజిక శాస్త్రజ్ఞులు అభిప్రాయపడ్డారు.**

మాదిగల కులపురాణం జాంబపురాణం, జాంబవంతుడు మాదిగలకు మూలపురుషుడు, జాంబవంతుడిని గూర్చి చెప్పే జాంబపురాణం కులానికి దైవత్వంలోని పవిత్రతను అందిస్తుంది. తెలుగులో కనిపించే వృత్తి పురాణాలన్నింటికి ఆదర్శమైన పురాణం జాంబపురాణం. దీనికి ఎంత ప్రాచీనత వుందో అంత ఆదరణ ఉంది. మాదిగకుల ఉన్నతిని, వృత్తి గౌరవాన్ని వివరించే ఆదిపురాణమిది. మాదిగల చరిత్ర సంస్కృతులని రక్షించేందుకే దీనిని సృజించుకున్నప్పటికి అది శిష్ట పురాణాలకు దీటుగానే నిలిచింది.

జాంబవంతుడు దేవతలకు ఆదిపురుషుడుగా, పెద్దవాడుగా వున్నాడు. శివుని దగ్గర కామధేనువు అనే గొప్ప మహత్యంగల ఆవు వుంది. అది అడిగిన ప్రతి కోరిక తీరుస్తుంది. పార్వతి మైలగా వున్నప్పుడు ఆమె మైల వస్త్రాల నుండి చిన్నయ్య అనేవాడు పుట్టాడు. చిన్నయ్యకు కామధేనువును సంరక్షించే బాధ్యత అప్పజెప్పబడింది. ఒకసారి దేవతలందరికి పార్వతి ఆవుపాలు ఇచ్చింది. ఆ ఆవును కాయటానికి పార్వతి ఏర్పాటు చేసిన చిన్నయ్య అనే కుర్రాడు ఎప్పటి నుండో దాని పాలు తాగుతానని అంటూ ఉంటాడు. వాడి కోరికతో విసిగిపోయిన పార్వతి ఆ రోజు వాడికి కూడా కొన్ని పాలు తాగడానికి ఇస్తుంది. పాలు తాగిన చిన్నయ్య పాలే ఇంత మధురంగా వున్నాయి. దాని మాంసం ఇంకెంత మధురంగా వుంటుందోనని మనస్సులో అనుకోగానే ఆ కామధేనువు విరుచుకుపడిపోయి అక్కడే చనిపోయింది. పార్వతీ పరమేశ్వరుడు దేవతలందరిని పిలిచారు. అది పవిత్రమైన ఆవు కాబట్టి, దాని భాగాలు ఏమికాకుండా భోజనం చేయాలని దేవతలు నిశ్చయించుకొన్నారు.

దేవతలందరికి తొలివాడు కాబట్టి ఈ పనిని తొలిగా ఆయన చేతి మీదుగానే జరిపిద్దామని, తపస్సు చేసుకుంటున్న జాంబవంతుని తాతా మహదిగారా అని పిలువగా, జాంబవంతుడు కిందికి దిగివచ్చి కామధేనువు కళేబరాన్ని తొలగించి, దాన్ని ముక్కలు ముక్కలుగా నరికి వండి విందుచేశాడు. జాంబవంతుడు వండే సమయంలో ఒకముక్క తెడ్డువెంట కిందికి దిగి వచ్చి మట్టిలో పడింది. ఆశుచిగా ఉన్నదాన్నే చిన్నయ్య తిన్నాడు.

జాంబవంతుడు కూడా మొత్తం మాంసాన్ని వండకుండా ఆవును మళ్ళీ బతికిద్దామని దాని వెన్నుపూసను, మెదడును వాటి చుట్టూ వున్న కొద్ది మాంసాన్ని దాచిపెట్టాడు. మాంసం దేవతలందరికి పెట్టి తానేమి తినడు. దేవతలు ఈ విషయాన్ని గమనించి యదార్థం తెలుసుకోకుండా మాంసం మాకు అంతా పెట్టకుండా కక్కుర్తిపడి దాచి పెట్టావు కాబట్టి వచ్చే కలియుగంలో నువ్వు గొడ్డు మాంసం తిని, దాని చర్మంతోనే పని చేసుకొని బ్రతకమని జాంబవంతున్ని, మట్టిలో పడిన దాన్నే తీసితిన్న చిన్నయ్యను మట్టి పూడ్చుకు బ్రతకమని శపించారు. అప్పటి నుంచి జాంబవంతుని బిడ్డలు మాదిగ వారు అయ్యారు. చిన్నయ్య సంతతి వారు మాల వారు అయ్యారు. అని జాంబపురాణం వివరిస్తుంది.

కులం అనేది ఒక సంక్లిష్టమైన సాంఘిక పరిణామం. పురాతన వేదకాలం నాటికి కుల వ్యవస్థ లేదని వేదాల అధ్యయనం వల్ల తెలుస్తుంది. స్థానికులపై ఆర్యులు దండయాత్ర చేసి విజయం సాధించడం వల్ల వేదసంస్కృతి క్షీణతవల్ల కులం, వెలికివచ్చిందని భారతీయ ఇతిహాసాలు తెలియజేస్తున్నాయి. కులం శతాబ్దాల తరబడి కఠినమైన నిబంధనలు విధించకుండా అన్ని వర్గాలవారికి మత సాంఘిక స్వేచ్ఛనిచ్చింది. కాని తరువాత క్రమంగా కఠినత్వాన్ని తనకంటూ ఒక ప్రత్యేకతను సంతరించుకుంటూ ప్రత్యేకమైన కులసమూహాలుగా రూపొందుతూ వేలకొలది కులాలుగా ఉపకులాలుగా భారత ఖండంలో విస్తరిల్లింది. కులవ్యవస్థ కేవలం హిందువులనే కాకుండా భారతదేశంలోని క్రైస్తవులను కూడా ప్రభావితం చేస్తూ ఒక అఖిల భారత సంస్థగా రూపొందిందని సామాజిక శాస్త్రజ్ఞులు అభిప్రాయపడ్డారు.

**కులం గురించి నిర్వచనాలు :**

1. సమాజంలోని ఇతర వర్గాలలో దేనితోను ఏరకమైన సంబంధమూ పెట్టుకోకుండా ముఖ్యంగా వివాహభోజన సంబంధాలు పెట్టుకోకుండా ఉండే ఒక వర్గమే కులం అంటారు సెస్‌ఫీల్డ్.

2. సర్. హెచ్.రైస్లి. అభిప్రాయం ప్రకారం 'ఒక నిర్దిష్టమైన వృత్తితో ముడిపడి ఉండి. మానవ లేదా దైవ సంబంధమైన ఒక రాజపురుషునికి వారసులమని చెప్పుకుంటూ, ఒకే వృత్తిని అవలంభించేకుటుంబాల సముదాయాన్ని గాని, ఒకే ఇంటిపేరు కలిగి వుండి ఒకే ఒక సంఘంగా ఏర్పడినారనే అభిప్రాయానికి అవకాశం ఇవ్వగలిగే కొన్ని కుటుంబాల లేదా కుటుంబాల బృందాల సముదాయాన్ని గాని కులంగా నిర్వచించవచ్చు.



3. కులం అనేది తమకు తాము మూసుకొని వున్న ఒక వ్యవస్థ అని, ఇది నైతికంగా ఖచ్చితంగా వంశం పారంపర్యమైనదని, ఒక కులం వారు ఒకే వృత్తిలో ముడిపడి వుంటారని ముఖ్యంగా వివాహానికి, ఆహారానికి కర్మకాండలకు, మైలకు సంబంధించిన విషయాలు ఒకే విధంగా వుంటాయని స్పష్టమవుతుంది. కులానికి ఒక నిర్దిష్టమైన సాంప్రదాయక స్వతంత్ర్య సంస్థ సాధనంగా వుండి అధికారాలను చెలాయిస్తుంది. శిక్షలు విధిస్తుంది. ఈ శిక్షలో అన్నిటికన్న మించిన శిక్ష గుంపు నుండి శాశ్వతంగా వెలివేయడం అని ఫ్రెంచి పండితుడు స్టెనారి అభిప్రాయపడ్డాడు.

4. డాక్టర్ కొట్కరి ప్రకారం కులం రెండు లక్షణాలు కలిగివున్న సామాజిక బృందం. ఒకటి ఆ బృందంలోని సభ్యులుగా పుట్టిన వారికి మాత్రమే సభ్యత్వం వుంటుంది. రెండు, వెలుపరి వారిని పెళ్ళి చేసుకోకుండా ఒక సామాజిక శాసనం ద్వారా సభ్యులకు నిషేధించటం వుంటుంది. కొట్కర్, భారతదేశంలో కులం వున్నంతకాలం హిందువులు, కులాంతర వివాహాలు చేసుకోరు, బయటి వారితో అలాంటి సామాజిక సంబంధాలు పెట్టుకోరు, ప్రపంచంలో వేరే ప్రాంతాలలోకి హిందువులు వలసపోతే భారతీయ కులం ప్రపంచ సమస్య అవుతుంది 'అని కులం అనే పుస్తకంలో రాశాడు.

5. అంబేద్కర్ ప్రకారం భారతదేశంలో కులం అనేది అతి ప్రాచీనమైన వ్యవస్థ, ఈ కులం సమస్య సిద్ధాంతపరంగాను, ఆచరణ రూపంలోను ఎంతో విస్తృతమైనట్టిది ఆచరణరీత్యా అతి భయంకరమైన సూచించే వ్యవస్థ. ఇది ఒక స్థానిక సమస్యగానే కనిపించినా పరిధికి మించి నష్టం చేయగలసత్తా దీనికి వుంది. భారతదేశంలో కులం అంటే జనాభాను ఒక స్థిరమైన,నిర్దిష్టమైన విభాగాలుగా, కృత్రిమంగా వేరుచేసి పెట్టి అవి మళ్ళీ ఒకదానిలో ఒకటి కలువకుండా అంతర్వివాహ ఆచారం ప్రకారం నిరోధించటమే. అంటే హిందూ సమాజం అన్ని సమాజాల మాదిరిగానే ఏర్పడింది. ఇది ప్రధానంగా వర్గవ్యవస్థ.

హిందువుల చరిత్రలో ఒక సమాజంలో పురోహిత వర్గం, మిగతా ప్రజా సముదాయం నుంచి సామాజికంగా విడిపోయి తనకు తాను దడికట్టుకోవడం ద్వారా తనంతతాను ఒకకులంగా తయారయింది. అంతర్వివాహ పద్ధతి అనేది హిందూ సమాజంలో ఒక వైఖరి. ఇది బ్రాహ్మణ కులంలో పుట్టింది కాబట్టి బ్రహ్మణేతర కులాలు, వర్గాలు మనస్ఫూర్తిగా దానిని అనుకరించి, అంతర్వివాహ పద్ధతిని ఆచరించే కులాలుగా మారిపోయారు. చీలిక వైపు సాగుతున్న దశలో ఉప విభాగాలకు కూడా ఈ అనుకరణ అంటు వ్యాధి సోకింది. వాటిని కూడా కులాలుగా మార్చివేసిందని అంబేద్కర్ అభిప్రాయం. అలా ఏర్పడిన కులాలు భారతదేశంలో సుమారుగా 6000 ఉన్నాయి. ఇలా పుట్టినకులాలలో కొన్ని కులాలు అంటరానివిగా అస్పృశ్య కులాలుగా చూడబడటం జరిగింది.

**మాదిగల సంస్కృతి :**

మాదిగల నివాసం, ఆహారపు అలవాట్లు ఎలా ఉంటాయి? వీరి వస్త్రధారణ ఎలా వుంటుంది. మాదిగల ఆర్థిక విధానం, విద్యా విషయాలు ఎలా ఉంటాయి? మాదిగల మతం హిందూ మతమా లేక ఇంకేమైనా మతాలు వీరు ఆచరిస్తారా! అనే విషయాలను చెప్పడం జరిగింది.

**1. నివాసం :**

మాదిగల ఇండ్లు ఊరికి దూరంగా ఉంటాయి. సాధారణంగా మాదిగలు వారి ఉపకులాల నివాస గృహాలు గ్రామానికి దాదాపు 0.4 కి.మి దూరంగా ఉంటాయి. ఈ గృహాలను కొట్టాలు లేదా గుడిసెలుగా పిలుస్తారు. నివాస గృహాన్ని నిర్మించబోయే ముందు ఇంటిపెద్ద గ్రామంలోని పెద్దలను గాని, బ్రాహ్మణుని గాని సంప్రదించి స్థలం మంచి చెడులను విచారించి అది మంచిదైతేనే వారు గృహాన్ని నిర్మిస్తారు. మంచిరోజున స్థలాన్ని శుభ్రపరిచి నీళ్ళు చల్లి, స్థలంలో ఒక మూల కొంచెం గోడకట్టి దేవునికి పూజ చేసి తర్వాత కొబ్బరికాయ కొడ్తారు. ఆ కార్యక్రమానికి హాజరైన వారందరికి కొబ్బరికాయ ముక్కలను ఫలహారంగా పంచుతారు.

కొట్టం లేదా గుడిసె చతురస్రాకారంగా పొడవు 18 అడుగులు, వెడల్పు 9 అడుగులు ఉంటుంది. గోడలు రాళ్ళు, మట్టితో

నిర్మించబడ్డాయి. చుట్టూతా రెండు ప్రక్కలా 8 అడుగుల ఎత్తుగోడలు, ముందు వెనక 5 అడుగులు ఎత్తు గోడలు నిర్మించి మధ్యలో ఒక బలమైనటువంటి కొయ్యను నిలబెట్టి, ఆ కొయ్యకు ప్రక్క ఉన్న గోడలను మరో కొయ్యతో కలిపి, ఆ తరువాత ముందు వెనక గోడలను కలుపుతూ కొయ్యలతో లేదా వెదురు కర్రలతో గోడలను కలుపుతూ పైకప్పు నిర్మిస్తారు.

ఇంటికి ముందు ఉన్న గోడకు తలుపుపెడతారు. సాధారణంగా తలుపు తూర్పు వైపు ఉంటుంది. తూర్పు ముఖం ఇంటికి మంచిదని వీరి భావన. ఈత ఆకులతో లేదా తాటి ఆకులతో, ఎండు గడ్డితో ఇంటి కప్పును నిర్మిస్తారు. కిటికీలు ఉండవు. ఇంటి ద్వారం ఎత్తు 5 అడుగులు, వెడల్పు 3 అడుగులు ఉంటుంది. ద్వారం కలపతోగాని, వెదురుతోగాని ఈత ఆకులతో గాని తయారుచేస్తారు. ఇంటిలోని నేలను పశువుల పేడతో అలుకుతారు. ఇంటి నిర్మాణానికి మొత్తం ఖర్చు సుమారుగా 20,000 రూపాయలు ఉంటుంది. ఇంటి నిర్మాణంలో కుటుంబ సభ్యులే పాల్గొంటారు. మంచిరోజున గృహ ప్రవేశం చేస్తారు. ఆరోజు కుటుంబ సభ్యులందరు తలస్నానం చేసి కొత్త బట్టలు ధరించి కులదేవతకు పూజచేసి కొబ్బరికాయ కొట్టి పాలుపొంగిస్తారు. బంధువులకు భోజనం పెడ్తారు. మంగళవారం, శుక్రవారాలలో ఇంటిని పేడతో అలుకుతారు. సంవత్సరానికి ఒక్కసారి ఇంటి బయట గోడలను ఎర్రమట్టితో, లోపలి గోడలను సున్నంతో శుభ్రం చేస్తారు.

**2. ఆహారపు అలవాట్లు :**

మాదిగల ముఖ్య ఆహారంగా జొన్న, బియ్యం, గోధుమలు ఉపయోగిస్తారు. మాదిగలు రాగి, సజ్జ, అంకెలు, నూకలు కూడా వాడతారు. మూడు పూటలా అన్నం తింటారు. ఉదయాన్నే చద్ది అన్నం తింటారు.

మాదిగల సమాజానికంటే భిన్నమైన రుచి, ఆరుచి వారికి అలవాటైన ఎర్రకారం పచ్చడి, గొడ్డుకారం, పచ్చిపులుసు, గొడ్డుమాసం, తినేటి సంగటి అయినా సద్ది అయినా మాదిగల రుచులే వేరు, మెత్తళ్ళకూర, ఎద్దు మాంసంమే కాదు, పంది మాంసం కూడా మాదిగలకు ప్రీతి. గొడ్డుమాంసం తినడం మాదిగలకు బాగా ఇష్టం. గొడ్డును కోసిర్రంటే గూడెలకి గోపు కుశాలగుంది. ఎవురి మొగంలో జూసినా మాంసం కళ ఆడుతావుంటుంది. బండల మీద కారం నూరేవోళ్ళు, మంటబెట్టి కాళ్ళు కాల్చేవాళ్ళు, నెత్తురు మాడ్చుకుని తినేవాళ్ళు, చీయల్ని ఎండబెట్టే వాళ్ళు, మాదిగ పల్లెంటేనే ఈ మాంసం.

**3. వంట చెఱకు :**

మాదిగలు వంటకోసం కట్టెలు, పిడకలు, తాటి ఆకులు, వాడతారు. కొద్దిమంది గ్యాస్ కిరోసిన్ వాడుతున్నారు. కిరోసిన్ దీపాలను వెలుగుకోసం వాడతారు. పొలాలలో పెరిగే తుమ్మచెట్లను నరికి వంటకు ఉపయోగిస్తారు. కట్టెల కోసం వారానికి ఒకరోజు కేటాయిస్తారు. ముఖ్యంగా పనిలేని రోజులలో వంట చెరకు సమకూర్చుకుంటారు.

**4. వస్త్రధారణ :**

పూర్వం మాదిగలు చవకరకం వస్త్రాలు ధరించేవారు. రాయలసీమలో మగవాళ్ళు, అంగి, జుబ్బా మరియు పంచ ధరిస్తారు. కొంతమంది నిక్కర్లు ధరిస్తారు. తలకు కట్టుకోవడానికి తవ్వాలు వాడతారు. కోస్తాలో మగవాళ్ళు చొక్క, పంచె, కండువా తెలంగాణాలో మగవాళ్ళు కమీజ్, ధోవతి, తలకు రుమాల్ వాడతారు. ఆడవాళ్ళు చీర, రవికె లేదా జాకెట్టు ధరిస్తారు. మాదిగలు విశ్రాంతి తీసుకోవడానికి నులకమంచాలు, ఈతచాపలు, గొంగళ్ళు, దుప్పట్లు డబుల్‌కాట్ మంచాలు వాడతారు. ప్రస్తుతం వారి ఆర్థిక పరిస్థితిని బట్టి అన్ని రకాలైన వస్త్రాలను ధరిస్తారు. చదువుకున్నవారు ప్యాంటు షర్టులను ధరిస్తున్నారు.

**5. ఆభరణాలు :**

మాదిగ స్త్రీలు పెళ్ళికి గుర్తుగా మంగళసూత్రాలు, కాళ్ళకు మెట్టెలు ధరిస్తారు. కాళ్ళకు గజ్జెలు, చెవులకు కమ్మలు, ముక్కుకు ముక్కుపుడక లేదా మక్కెర, వంకీలు, వడ్డాణాలు అన్ని రకాలైన ఆభరణాలు ధరిస్తారు. ప్రస్తుతం అన్ని రకాల ఆభరణాలను మాదిగ పురుషులు, స్త్రీలు ధరిస్తున్నారు.

**6. పచ్చబొట్లు :**

మాదిగలు పచ్చబొట్లు పొడిపించుకుంటారు. వీరు వేయించుకునే పచ్చబొట్లు పేర్లు శివుని పాదాలు, చందమామ చుక్కలు పొడిపించుకుంటారు, బంతి చెట్టు, ముత్యాల ముక్కుపోగు దేవుళ్ళ, దేవతల పేర్లను పచ్చబొట్లుగా పొడిపించుకుంటారు.

**7. మాదిగల విద్యార్జన :**

మాదిగలు వారి ఉపకులాల వారిలో అక్షరాస్యత చాలాతక్కువ మాదిగలు చర్మకార వృత్తి వలన పల్లెకి అంకితమైపోయి దానినే ఆధారంగా జీవిస్తు విద్య ప్రాధాన్యతను గుర్తించలేక విద్యపరంగా ఎంతో వెనకబడి ఉన్నారు.

**8. ఆర్థిక జీవన విధానం :**

మాదిగల ముఖ్య ఆదాయ మార్గం వ్యవసాయ కూలీలుగా పనిచేయటం మాదిగల సాంప్రదాయక వృత్తి తోళ్ళను శుభ్రం చేయడం, చెప్పులు కుట్టడం, ప్రతి గ్రామంలో కొన్ని మాదిగ కుటుంబాలు కొన్ని రైతుకుటుంబాలపై ఆధారపడి వ్యవసాయానికి అవసరమైన వస్తువులు, పట్టెడలు తోలు బొక్కెనలు చేయడంతో పాటు, చెప్పులు కుట్టి జీవిస్తారు. ప్రతిఫలంగా సంవత్సరానికి కొంత మొత్తం రైతులు మాదిగలకు చెల్లిస్తారు.

పెళ్ళి సందర్భంలో వీరు మేళాలు వాయిస్తారు. మాదిగలు మునసబు క్రింద గ్రామ సేవకులుగా పనిచేస్తారు. వీరిని రాయలసీమలో

వెట్టివాడు, కోస్తాలో బురికి, తెలంగాణలో సత్‌సింది లేదా మస్కూరి అంటారు. గ్రామసేవకులు గ్రామంలో భూమిపై పన్నులు వసూలు చేయడంలో సహాయపడతారు. గ్రామ సేవకుడు పని వారసత్వంగా పొందుతాడు. గ్రామాలలోని రెడ్డి, కమ్మ, కాపు, వెలమ లాంటి వారు వీరిలో కొంతమందిని పాలేర్లుగా ఒకటి, రెండు సంవత్సరాలకు ఏర్పాటు చేసుకుంటారు. మాదిగలు తప్పెటలు లేదా డప్పులు వాయించటంలో సిద్ధహస్తులు. వీరు బ్రహ్మణ, వైశ్య కులాలకు తప్ప మిగతా అన్ని కులాల పెళ్ళిళ్ళకు, చావులకు డప్పులు వాయిస్తారు. ఏదైనా ముఖ్య సమాచారం గ్రామ ప్రజలకు చేరవేయాలంటే వీరు డప్పు వాయిస్తూ ఆ సమాచారాన్ని తెలియజేస్తారు. దీనికి ప్రతిఫలంగా కొంతధనం తీసుకుంటారు. ఇవన్నీ జీవనాధార ఆదాయ మార్గాలుగా చెప్పవచ్చు.

**9. మాదిగల మతం :**

మాదిగలది ఫలానా మతం అని ఖచ్చితంగా చెప్పలేము. మాదిగలు హిందుమతం, క్రైస్తవమతం, బౌద్ధమతం, ఇస్లాం మతం, బ్రహ్మంగారి మతం పూర్వం పాటించారు. ప్రస్తుతం పాటిస్తున్నారు. వీరు ఆచరించే మతాల గురించి గమనిస్తే వైవిధ్యం తెలుస్తుంది.

**కుల సమస్యకు పరిష్కార కేంద్రాలు :**

**కుల పంచాయితీ, కట్టుబాట్లు :**

ప్రతి మాదిగపల్లెలో కుల పంచాయితీ ఉంటుంది. ఈ కుల పంచాయితీ స్వతంత్రమైనవి. కుల పంచాయితీలు చేసే నిర్ణయాలు తిరుగులేనివి. మాదిగలు పెళ్ళిళ్ళు చావులు, కుల కట్టుబాట్లు. కుల పద్ధతులు, ఆచారాలు సక్రమంగా కొనసాగేటట్లు, వివాహేతర సంబంధాలు, గొడవలు, విడాకులు వితంతు వివాహాలు, కుటుంబ కలహాలు వంటివి కుల పంచాయితీ చూస్తుంది. అక్రమ సంబంధాలు తీవ్రమైనవిగా ఈ పంచాయితీలు భావిస్తాయి. నిర్దోషిత్వం నిరూపణకు ఎన్నో కఠిన పరీక్షలకు గురిచేస్తాయి. కుల పంచాయితీ కులంలో సామాజిక నియంత్రణకు ఉన్న ఏకైక మార్గం. మాదిగలకు పంచాయితీ పెద్దగా వ్యవహరించే మనిషిని పెద్ద మాదిగ అంటారు. కుల తగాదాలు, సమస్యలు పరిష్కరించే పెద్ద మాదిగతనం కొన్నిసార్లు వంశపారం పర్యంగా వస్తుంది. పెద్దమాదిగను ఎన్నుకోవటం జరుగుతుంది. పెద్దమాదిగకు కొన్నిచోట్ల కొంతమంది పెద్దలు సహాయకులుగా ఉంటారు. కొన్నిచోట్ల ఇద్దరు సహాయకులు వుంటారు. వారిలో ఒకరు ధర్మకర్త, రెండవవాడు కులం బంట్రోతు, శుభకార్యాలకు ముత్తైదువలు ఉంటారు. కట్టుబాటు దాటితే అనేక శిక్షలుంటాయి. తీవ్రమైన శిక్ష కులాన్నించి వెలివేయడం.

చిందువాళ్ళు మాదిగలను ఆశ్రయించాలని మూడు లేదా రెండు భాగోతాలను ప్రదర్శించిన తరువాత జాంబపురాణం చెప్పి తీరాలన్నది కుల కట్టడి. జాంబ పురాణాన్ని సజీవంగా వుంచుకోవాలన్న మాదిగ కులాల ఆశే చిందు కళారూపం. శతాబ్ధాలుగా సమాజంలో మనగలిగింది. మాదిగలు తమ కులభావజాలాన్ని నిరంతరం ప్రసారం చేయటానికి ఏర్పాటు చేసుకున్న వాహికే చిందు. ఇలా తమను తాము వ్యవస్థీకరించుకున్నారు. చిందు కళాకారుల పోషణ బాధ్యత మాదిగలదే అది కుల కట్టుబాటు.

**కులంపై మేధావుల, పరిశోధకుల, సాంఘిక విప్లవకవుల అభిప్రాయం :**

**1. మేధావులు**

మాదిగలు ఎవరు? మాదిగల పుట్టు పూర్వోత్తరాలు ఏమిటి? మాదిగ శబ్ద ఆవిర్భావానికి మూలాదులు ఏమిటి? లాంటి ప్రశ్నలకు సమాధానాలుగా అనేకుల అభిప్రాయాలను గమనిస్తే ఇలా ఉన్నాయి.

**2. స్టువర్ట్ ఓపెర్ట్ :**

మాదిగ, మాంగ్ అనే పదాలు మాతంగ శబ్దా భ్రష్టరూపాలు మాతంగ శబ్ధం నుండి మాదిగ శబ్ధం వచ్చిందనీ, వీరు భారతదేశపు మూలవాసులు అని ఒపెర్ట్ అభిప్రాయం

**3. ఎడ్గర్ థ్రస్టన్ :**

మాదిగలు తమ పేరును ఆటవిక దేవత మాతంగి నుంచి తీసుకున్నారని చెప్పటం జరిగింది. మాదిగలు మేము మాతంగి లేదా కాళి / దుర్గ యొక్క పిల్లలుగా చెప్పుకుంటారు అని వివరిస్తారు థ్రస్టన్.

**2. పరిశోధకులు :**

**1. మంగిపూడి వెంకటశర్మ :** మతంగ మహర్షి సంతానమే మాదిగలు అని, మతంగుడు ముక్కోపి అవటం వల్ల చండాలుడు అయ్యాడని, అందువల్లనే మాదిగలు చండాలు తీరుగా వ్యవహరించబడుతున్నారని నిరుద్ధ భారతంలో వివరించాడు.

**2. త్రిపురనేని వెంకటేశ్వరరావు :** మతంగ మహర్షి సహజంగా కోపిష్టి కావడంచే ఆర్యులాతనిని చండాలునిగా పరిగణించి, సంఘ దూరునిగావించారు. అతడు దక్షిణా పదము ప్రవేశించి కిష్కింధ సమిపాన ఒక కొండపై ఆశ్రయం నిర్మించుకొని ఉండేవాడు. అందువలన ఆ కొండకు మాతంగ గిరి అనే పేరు వచ్చింది. అనంతర మాతని సంతతివారిని మాతంగగిరి నివాసులని, మాతంగులని పిలిచేవారు. మాతంగ శబ్దభవమే మాదిగ అని ఒక్క అభిప్రాయ మాతంగి శబ్ధం తత్సమం మాదిగ తద్భవం. అలాగే 'మతంగాత్ ఔతాఃమాతంగా ః అంటే మాతంగుడి సంతానమే మాతంగులు, మాదిగలు అని వివరిస్తాడు.

**3. విప్లవ సాంఘిక కవులు :**

**1. పిల్ల శాంసన్ :** పర్వత సూచకమైన మాతంగ శబ్ధం నుండి మాదిగ పదం వచ్చిందని, మాతంగులు అంటే పర్వత ప్రాంతవాసులైన గిరిజనులని చెప్పవచ్చు అంటారు.

**2. తాళ్ళూరి లాబన్‌బాబు :** మాదిగ అనే పదం మాతంగి అను సంస్కృత పదం నుండి కానీ లేక మాదీయ అనే పదం నుండి కానీ రూపుదాల్చటానికి మిక్కిలి అవకాశం ఉందని వివరించాడు.

**3. చింతాడ గౌరివర ప్రసాద్ :** మాదిగ అంటే మహా ఆదిగా ఉన్నావాడని, మొదటివాడు, ఆదివాసి అని అర్థం చెపుతూ మహా ఆదిగా మహదిగ మాదిగ అయ్యిందంటాడు. ♦

## నన్ను దఫన్ చెయ్యరూ....

సాయి పద్మ



అనాదిగా నేనొక ఒంటరి పహరాని
ఆడపిల్లల దేహాలు దాచే పరదాని
వేలాడుతుంటా ఎవరూ చూడని రూపు
రేఖలపై..
వయ్యారంగా ఒకింత విసుగ్గాకూడా
ఒక్క కళ్ళని మాత్రం చూపిస్తేనేం..
కల కందని కవిత్వాలల్లేవారున్నారు
బహు పరాక్ మీరంతా..
యమ హుషార్ నేను..
ఆ నల్ల గీతల వెనకాల ఏముందో..
ఎవరికీ అక్కర్లేదు..
చూసినా వాళ్ళకి పట్టింపూ లేదు..
బెహెన్ నుండి బేగం వరకూ
నేనెప్పుడూ ఆమెకు తోడే.
నన్ను మానేసిందా, నామర్దా..
రంగు రంగుల వలువలెన్నో
ఎవరి కళ్ళ బడకుండా
కప్పేస్తా నిర్దాక్షిణ్యంగా..
నా వెనుక కళ్ళకీ...
ఆవల ప్రపంచానికీ నేనే కాపలా తెర..

నేనొక నిరంతర పహరాని
ఎన్నెన్నో దాచా నాలో..
ప్రేమలు, మోహాలు, దాహాలు
తన్హాయిలు.. జుదాయిలు,
ఇజాజత్ లేని మొహబ్బత్తులు...
ఎన్నని చెప్పను..??
నన్ను తొడుక్కున్న
ఆమె దిల్‌కీ ధడకన్ వింటాను
జాలిగా... "సహేలి"లా
అందుకేనేమో మరి..
మూడు సార్లంటే.. ముప్పిరికొనే బాధ
అది కుబూల్ అన్నా
తలాక్ తలాక్ తలాక్ అన్నా..
మరదే నా తక్దీర్ కదా
అమ్మీ జాన్తెనా.. అబ్బాజాన్ లైనా..
వారి బచ్చీ బచావత్ కోసమే కదా వారి
ఆత్రం
స్వేచ్ఛా రోజ్జ గాలి తగలనీయను ఇజ్జత్
కి..!!
నన్ను మోస్తున్న నా బెహెన్ల
కన్నీళ్లు నన్నూ ఏడిపిస్తాయి
వారికి జాని దుష్మన్ కాకుండా
నన్ను నేనే ఖతం చేసుకోవాలని
వారితో బాటే నేనూ ఏడుస్తా

నేనొక ఖాందాన్ కాపలాని
ఇంట్లో నా వాసం చిలక్కొయ్యే అయినా
ఇలాకా అంతా ఆమె నాతో తిరగాల్సిందే..
ఖాందాన్ పరువు..
దాని బరువు..
నా నల్లటి కౌగిలిలోనే కదా..
నేనూ దాచుకున్నా చాలానే..
గోరి చమడీ మీద సిగరెట్ల మచ్చలు..
అప్పులోళ్ళ కేకల్లా.. బెల్టు వాతలు..
కదిలే శవానికన్నా కావలసిందే పర్దా
ఎంతో మంది.." నమర్ద్"ల కోపానికి
బలయ్యిన ఎందరో నా బెహన్ల
ప్రాణాలు వేలాడే ఉరికొయ్యా నా పతా !!!

నేనొక కఫన్‌ని వారి పాలిట
దేహంపై గీతల్లా..
సాగలేని తేమలేని పర్దాని..
నా వెనకాల కళ్ళేనాడో ఎండిపోయాయి
ముందున్న దునియా
ముసాఫిర్ల లోకాలు దాటి ముందుకెల్తానే ఉంది..
అప్పుడప్పుడు ఉతికి.. ముతక వాసనేసే
నా మరణం నాకు తెలుస్తోంది..
షహీద్ అవటంలో స్వేచ్ఛా అర్థమవుతోంది..
దయచేసి మీ దునియాదారీ లో నన్ను లాక్కండి..
పీలికలై పలుచటి వస్త్రం..
మోసే అవసరం లేని బరువుని..
దాచే అర్థం లేని పరువుని..
ఖననం చేయండి..
గట్టి గోరీ కట్టండి నాకు..
మళ్ళా 'జిందా' చేసేందుకు 'ఫర్యాద్' చేయకుండా...!!

## ధ్వంస రచన

డా. సంగనభట్ల నరసయ్య
✆: 9440073124

చేపలు
మానవుడు చేసే
ప్రకృతి విధ్వంసానికేడ్చాయి
వాటి కన్నీళ్లతో నదులకు వరదలూ
సముద్రాలకు సైక్లోన్లూ వచ్చాయి
*

డ్యాములు కడ్తున్నారని
ఉరవళ్ల నదికి
ఒళ్లు మండి
స్టిల్ట్ స్టూల్ వేసుకుని
డ్యామెక్కి దూకింది
*

చెట్లు,
మనిషి నరికేస్తున్నాడని దుఃఖంతో
ఎండుటాకుల్ని రాల్చుకొని
ఎలుగడి చితి మంటల్లో
కొండను కొలిమిలా మండించి
ఆత్మాహుతి చేసికొంటున్నాయి.



కథ



మలయాళం : ఎం.కె.చాంద్‌రాజ్
ఆంగ్లం : సుధీర్
తెలుగు : కొల్లూరి సోమశంకర్
✆ : 9948464365

# అమ్మా, వస్తావు కదూ....

సాజన్ పురి
రాజస్థాన్
25 ఫిబ్రవరి 2012

అమ్మా !

బావున్నావా?

నిన్ననే నేను నా పదమూడో పుట్టినరోజు జరుపుకున్నాను, ఓ చవకబారు బబుల్‌గమ్ నములుతూ. దాన్ని గోవిందసింగ్ ఇచ్చాడు. గోవిందసింగ్ ఓ లారీ డ్రైవర్. ఆ లారీకి నేషనల్ పర్మిట్ ఉందట. ఉబ్బి ఉండే అతనికళ్ళు, స్ఫోటకపు మచ్చలతో నిండిన అతని ముఖం ఎంతో భయపెడతాయి. అతనెంత కోపంగా ఉన్నా కానీ పళ్ళికిలిస్తునే ఉంటాడు. ఇక్కడి పెద్ద అక్కలకి అతనస్సలు నచ్చడు. ఇక్కడ అందరికంటే పెద్దావిడ అమ్మాజీకి నేనెంటే ఎంతో ఇష్టం. అమ్మా, నీకు గుర్తుందా? క్రితం ఏడాది నా పుట్టినరోజుకి రవ్వ హల్వా చేసావు. దాని రుచి ఇంకా నా నాలుకపై ఉంది. నిన్ననే జరిగినట్లనిపిస్తోంది. హల్వా తక్కువ ఇచ్చావని తమ్ముడు ఏడ్చాడు. నాన్న బెత్తం పట్టుకుని కొట్టాడు కదూ, అమ్మా. ఈ ఏడాది కొత్త సంవత్సరం వేడుకలు ఎంత దారుణంగా ఉన్నయో తెలుసా? వాటిని తలచుకుంటే ఇప్పటికీ నాకు ఒణుకొస్తోంది. చాలా రోజులపాటు నిద్రపోలేకపోయాను. ఇంటి దగ్గర ఉన్నప్పుడు నాకేదైనా పీడకల వస్తే, పక్కన నువ్వు ఉండేదానివి, నిన్ను హత్తుకుంటే ఎలాంటి భయమూ ఉండేది కాదు. నిన్ను తలచుకుని ఎంతగా ఏడ్చానో తెలుసా?

ఆరోజు మాములు రోజుల్లో వచ్చేవాళ్ళకంటే చాలా ఎక్కువమంది వచ్చారు. ఒక్కోసారి అలానే జరుగుతూంటూందని సునీతక్క చెప్పింది. ఆరాత్రి నలుగురు మగాళ్ళు నా గదిలోకి వచ్చారు. ఒకరి తర్వాత ఒకరిని లోపలికి పంపడానికి అమ్మాజీ ఎంతగానో ప్రయత్నించింది. కానీ వాళ్ళు పట్టుబట్టారు. చివరికి అమ్మాజీకి ఒప్పుకోక తప్పలేదు. వాళ్ళంతా పెద్దమనుషులట! వాళ్ళకి ఎదురు చెబితే ఎన్నో కష్టాలు ఎదురవుతాయట.

అమ్మాజీ వాళ్ళతో అంది "నీరూ ఇంకా చిన్నపిల్ల. ఆమెతో దురుసుగా ఉండద్దు". వాళ్ళు మాటిచ్చారు.

అయితే తలుపు గడియ వేయగానే, వాళ్ళు మృగాల్లా మారిపోయారు. వాళ్ళు చేయమన్నవి ఏవీ నేను చేయలేదు. నాకు భయం వేసింది. వాళ్ళ మాట వినకపోయే సరికి వాళ్ళకి కోపం వచ్చింది, నన్ను కింద పడేసి కొట్టారు, నా జుట్టు పట్టుకుని గట్టిగా గుంజారు. వాళ్ళల్లో ఒకడు నన్ను ఓ దిండులా నలిపేసి మూలకి విసిరేసాడు. నా ఒళ్ళంతా దెబ్బలే. ఒకడు సిగరెట్ వెలిగించి నా గుండెల మీద, బొడ్డు దగ్గర, తొడల మధ్య వాతలు పెట్టాడు. బాధతో నేను అరిస్తే, నా నోట్లో గుడ్డలు కుక్కి, నేను స్పృహ కోల్పోయేదాక, నా శరీరంతో ఆడుకున్నారు. ఇదంతా జరుగుతుంటే నామనసులో ఒకే ఒక ఆలోచన దొర దగ్గర మనం తీసుకున్న అప్పు తీర్చడం ఎలా అని!

అది ఎప్పటికి సాధ్యమవుతుంది? ఆ అప్పు మనం ఎప్పటికి తీర్చగలుగుతాం?

మర్నాడు పొద్దున్న అమ్మాజీ నా గదికి వచ్చింది. నా గతి చూసి ఏడ్చింది. నన్ను దగ్గరకు తీసుకుని చాలాసేపు నా తలనిమురుతూ ఉండిపోయింది. ఆ వెధవల్ని తిట్టుకుంటూ, వాళ్ళనింకెన్నడూ రానివ్వనని ఒట్టు పెట్టుకుంది. నన్ను డాక్టరు దగ్గరకి తీసుకెళ్ళి దెబ్బలకు

మందులిప్పించింది. సంధ్య వచ్చి, నన్ను ఓదార్చింది.

సంధ్య ఇక్కడికి నాలాగా రాలేదు. వాళ్ళ కుటుంబం వాళ్ళెవరూ ఆమెని ఇక్కడకి తీసుకురాలేదు. తనది పశ్చిమ బెంగాల్‌లో ఏదో చిన్న పల్లెటూరు. తనది నా వయసే, నా మీద కొంచెం పెద్దదేమో. కొలకతా నగరాన్ని శాంతినికేతన్ చూడాలని ఆమె కోరిక. రవీంద్రనాథ టాగోర్ కవితలెన్నో తనకి నోటికొచ్చు. ఆమె తల్లిదండ్రులు పేదవాళ్ళు. కాబట్టి వాళ్ళు ఆమె కోరిక తీర్చలేకపోయారు. ఆ సమయంలోనే ఓ దూరపు బంధువు ఒకతను వాళ్ళింటికి వచ్చాడట. సంధ్య ఆసక్తి తెలుసుకుని ఆ ఊర్లన్నీ తిప్పి చూపిస్తానని చెప్పాడట. తనెంతో సంబరపడిందట.

ఒకరోజు బడికి వెళ్ళకుండా, ఆ బంధువుతో కలిసి ఊరు వదిలి వచ్చేసిందట. అతను సంధ్యని శాంతినికేతన్ కాకుండా, సోనాగచ్చి తీసుకుపోయాడట. అక్కడి నుంచి ఇక్కడికి వచ్చింది సంధ్య. ఇక్కడి నుంచి బయటపడే ఆశలన్నీ వదిలేసుకుంది తను. రెండేళ్ళ పాటు నరకం చూసిందట. దాని గురించి చెప్పడానికి మాటలు రావు. ఆమె బాధనిచూసినప్పుడల్లా, నేను అదృష్టవంతురాలినేనని పిస్తుంది. నువ్వు నన్ను వదిలేయలేదు, అమ్మాజీకి అప్పజెప్పావు. మన అప్పు తీరిపోతే, నన్ను తప్పకుండా ఇంటికి తీసుకువెడతావు.



అయితే సునీతక్క ఆలోచనలు మరోలా ఉన్నాయి. ఒకసారి ఒక అమ్మాయి ఇక్కడ చిక్కుకుపోయిందంటే, వాళ్ళ కుటుంబం ఎన్నడూ ఆమెని తిరిగి ఇంటికి తీసుకువెళ్లదని అంటుంది. సునీతక్కని కూడా వాళ్ళ అప్పులు తీర్చడానికి వాళ్ళ అమ్మానాన్నలే ఇక్కడికి తెచ్చారట. సునీతక్క వాళ్ళది యమునా పుశ్తా మురికివాడ. అక్క దగ్గరి నుంచి డబ్బులు తీసుకెళ్ళడానికి వాళ్ళ ఇంట్లో వాళ్ళు ఇప్పటికీ వస్తుంటారు. ఇంటికి తీసుకెళ్ళమంటే ఏవేవో సాకులు చెబుతారట. తను ఇంటికి వెడతానన్న ఆశ ఏ మాత్రం లేదు అక్కకి. అక్క సంపాదించిన డబ్బులతో చదువుకున్నాడట వాళ్ళ అన్నయ్య. అతనికి ఇప్పుడు ఓ చిన్న ప్రభుత్వ ఉద్యోగం కూడా దొరికిందట.

నాకు మా అమ్మానాన్నల మీద పూర్తి నమ్మకం ఉంది. అమ్మా! డబ్బుల కోసం ప్రతీ ఆదివారం రావద్దని, పదిహేను రోజులకొకసారే రమ్మని అన్నయ్యకి చెప్పవా? తమ్ముడికి నా ముద్దులు. ఈసారి పాసయితే, అయిదో క్లాసుకి వెడతాడు కదూ. తమ్ముడిని బాగా చదివించాలి. వాడు గొప్పవాడవ్వాలి. వాడు నన్ను చూడడానికి తరచూ వచ్చే గడ్డం అంకులంతటి వాడు కావాలి.

ఈ అంకుల్‌కి నా గురించి ఎన్నో వివరాలు కావాలి. అతనికి మరేమీ అక్కర్లేదు.

ఒకరోజు నేనతని దగ్గరికి వెడితే, కుడిచేయి చాపి వారించాడు.

"నీగురించి పూర్తిగా తెలుసుకోవాలనుకుంటున్నాను" అన్నాడు.

"దేనికి?"

"నీ గురించి ఓ నవల రాస్తాను"

"నవలలో నా పేరు రాస్తారా?

"రాయమంటావా?"

"తప్పకుండా రాయండి. అయితే, అంకుల్ మీరెప్పుడూ మీ పేరు చెప్పలేదే"? అని అడిగాను.

"పేరులో ఏముంది?" అంటూ అంకుల్ నవ్వాడు.

అంత చక్కగా నవ్విన వ్యక్తిని నా జీవితంలో చూడలేదిప్పటి దాక.

ఒకరోజు నాకో కల వచ్చింది. కలలో నేను గడ్డం అంకుల్‌తో కలిసి ఓ ఎడారిలో ప్రయాణిస్తున్నాను. అంకుల్ నేను చివరిసారిగా చదివిన బడిలో మాస్టారిలా ఉన్నారు. నేనప్పుడు ఆరో క్లాసు. ఎడారిలో మేము చాలా వేగంగా నడుస్తున్నాం. అంత వేడి కూడా వెన్నెలలా తోచింది. నేను అంకుల్ భుజాల మీద ఎక్కి కూర్చున్నాను. వెన్నెల్లో తేలిపోయాను.

ఈకల గురించి అంకుల్‌కి చెప్పినప్పుడు ఆయన కాసేపు ఏం మాట్లాడకుండా ఉండిపోయాడు. కాసేపయ్యాక, "ఒకప్పుడు నాకో చిన్న చెల్లెలు ఉండేది. ఇప్పుడు లేదు. చచ్చిపోయింది. టైఫాయిడ్‌తో" అని చెప్పాడు. ఆరోజు ఇంకేమీ మాట్లాడకుండానే అంకుల్ వెళ్ళిపోయాడు.

ఇవన్నీ రాసి నిన్ను విసిగిస్తున్నానా అమ్మా? ఏం చేయను? నేను ఉత్తరం రాయగలిగేది ఎప్పుడో ఒకసారే గదా. మిమ్మల్నందరిని చూడాలని ఉందమ్మా.

అమ్మా, నేను పంపిన డబ్బులు అందాకా, వాటిల్లోంచి కొంత డబ్బు నాన్నకి ఇవ్వు. నాన్నని అప్పుడప్పుడు తాగనీ. ఎక్కువ డబ్బుల కోసం నిన్ను కొట్టొద్దని నేను చెప్పానని నాన్నకి చెప్పు.

అమ్మా, దొరగారి బాకీ మనం పూర్తిగా ఎప్పటికి తీర్చగలమని అనుకుంటున్నావు? ఒక సంవత్సరం లేదా రెండేళ్ళలో తీర్చేయగలమా? మన ఇల్లు, మన పొలం మనం తిరిగి పొందగలమా?

అమ్మాజీ నన్ను ఇక్కడ నుంచి వెళ్ళనివ్వదు. నేను డబ్బులు కాసే చెట్టునట. నేను వచ్చిన తర్వాత వ్యాపారం ఆమెకి కలిసొచ్చిందని ఆమె నమ్మకం. కానీ, అమ్మా నేను విసిగిపోయాను. దీన్ని ఇక ఏ మాత్రం భరించలేను. ఒక్కోసారి మెడకో తాడు తగిలించుకుని చచ్చిపోదామా అనిపిస్తుంది. కానీ మన ఇంటి పరిస్థితి గుర్తొచ్చి...

అమ్మా, అప్పుతీరిపోగానే, నువ్వూ నాన్నా వచ్చి నన్ను ఇంటికి తీసుకువెళ్ళాలి.

మీరు ఎప్పుడు వచ్చేది నాకు కాస్త ముందుగానే తెలియజేస్తే, ఇక్కడి వాళ్ళందరికి నేను వీడ్కోలు చెప్పి సిద్ధంగా ఉంటాను. అమ్మా, నువ్వు వస్తేనే అమ్మాజీ నన్ను పంపిస్తుంది.

నువ్వు **తప్పనిసరిగా రావాలి.**

**మరచిపోవద్దు.**

**నేను** ఎదురుచూస్తూంటాను.

అమ్మా, వస్తావు కదూ...!

**ఇట్లు**

**నీ ముద్దుల కూతురు**

**నీరూ.**

♦

## "వెళ్ళి - రాకండి"

కందిపాటి గోపాలరావు

✆ : 9652174640



కుర్చీకి మిమ్మల్ని దిగ్గొట్టిన అరవై మేకులు
సడలిపోయినై
కట్టి పడేసిన ఎనిమిది బార్లతాడు
ఊడిపోయింది.
అధికారం ఇంకు ఇంకిపోయి
కలం ఇంకచాలు పొమ్మంది.
కదలని ఫైళ్ళు
కొత్త చేవ్రాళ్ళ కోసం
దుమ్ము కళ్ళతో చూస్తుండిపోయినై

ఉబుసుపోని కాలం
ఊబకాయమై
మిమ్మల్ని స్వాగతిస్తూ నిల్చుంది
పెన్షన్ పుస్తకం
మరో పేజీని కలుపుకొని
మీ సంతకాన్ని అడిగింది.
రేపట్నుంచి మీరు
పనికి రానివారేకాని
పనికిరాని వారు కాదు.

---

## ఇంతేనా ?...

పి.యస్. శ్రీనివాసరావు



మరల్లో మనుషుల్ని మొలిపించిన కవి జీవికని
ఒక ముద్రాపక ధరకుంటు పరుస్తోంది
రక్తంలో రాగాలద్దాల్సిన ప్రేమ
కామోద్దీపనల పబ్బుల్లో వికృత కావ్యమవుతోంది
వివృత సేద్యమవుతోంది
వేయి జీవితాల కలల శ్యామలాలను
ఒక కొనుక్కున్న ఓటు దొరకబుచ్చుకొంటోంది
అనంత ప్రాపంచిక మేథస్సు
అధికారపు బండతనాన్ని భరించవలసివస్తోంది
ఆనందాతిశయంలో విరిసిన కళలన్నీ

అచ్చు గుద్దిన రూపాయి చూపులకే
అలమటించవలసి వస్తోంది
సరుకు సీసా వొంపుల్లోనే
వొయ్యారాల్ని కుదించవలసి వొస్తోంది
హద్దుల్ని గుద్దుకుంటూనే
ఓటి బ్రతుకు చతికిల పడవలసి వస్తోంది
పెంకు పెళ్ళగించుకొని ప్రాణి బయటకు రాదా
శవంలోని లాభ(భే) తాళం చెట్టెక్కే వరకూ
(అ)క్రమాల చిట్టాలొంచే బతుకంతా, బరువంతా

---

## నానీలు

డా. పోరెడ్డి రంగయ్య

✆ : 9948049864



పిల్లోడికి
వీరరసం పట్టిస్తున్నారు
రేపు
చదువు యుద్ధం గెలవాలి కదా !

విద్య
నలిగిపోతుందా ?
కేంద్రరాష్ట్ర జాబితాలో
ఉమ్మడి కాపురం

అక్కడ
అక్షరాలు దిద్దించరు
ఫీజు బోలేడు
అది టెక్నో స్కూల్

ఇద్దరూ
కార్మికులే
అక్కడ బస్తాలు
ఇక్కడ పుస్తకాల బ్యాగులు

కులం పోవాలి
మతం పోవాలి
రికార్డుల్లో మాత్రం
కచ్చితంగా ఉండాలి

బ్యానర్లు, ర్యాలీలు
పత్రికల్లో ఫొటోలు
గ్రాండ్ సక్సెస్
విద్యా పక్షోత్సవాలు

వాళ్ళూ చిచ్చర పిడుగులే
మండుతున్నారు
శివకాశిలో
చిచ్చుబుడ్లై

# తెలుగు కథా సాహిత్యం - వరకట్నం

ఓ. సరస్వతి
✆ : 9704482892



**తెలుగు కథా సాహిత్యంలో వివిధ కథారచయితలు వరకట్న దురాచారంతో సతమతమవుతున్న స్త్రీల సమస్యలను, వరునికి కట్నాన్ని ముట్టచెప్పే ఆడపిల్లలు గల తల్లిదండ్రుల బాధలను వారి కథలలో తెలియజేశారు.**

అనాదికాలం నుండి స్త్రీలు అనేక రకాలుగా వివక్షతకు గురవుతూనే ఉన్నారు. ఆధునికయుగంలో స్త్రీలు అన్నిరంగాల్లో ముందంజలో ఉన్నప్పటికీ మహిళలపై హింస రోజు రోజుకి పెరుగుతుంది. అసమానతలు, అత్యాచారాలు, అవమానాలు రకరకాల కొత్త రూపాలలో స్త్రీలను హింసకు గురిచేస్తూనే ఉన్నారు. ముఖ్యంగా స్త్రీలు వరకట్న మహమ్మారికి నేటికీ బలవుతూనే ఉన్నారు. ప్రతినిత్యం వార్తల్లో, న్యూస్ పేపర్‌లోనూ వరకట్న చావులను చూస్తూనే ఉన్నాం. వరకట్న మహమ్మారి అన్నికులాల్లోకి, మతాల్లోకి విస్తరించి ఆడపిల్లల భవితవ్యానికి చరమగీతం పాడుతుంది. 1961లో వరకట్న నిషేధశాసనం వచ్చింది. కానీ కట్నం ఇచ్చుకోవడం, పుచ్చుకోవడం బహిరంగరహస్యమే. పెళ్ళి చెయ్యాలంటే డబ్బుండాలి. లేకపోతే ఆడపిల్లకు పెళ్ళిచేయలేని పరిస్థితి. "కట్నంకొద్దివరుడు" కాకుండా "వరుడికొద్దికట్నం" అనే దుస్థితి రావడం శోచనీయం. పురుషుడితో పాటు స్త్రీ అన్ని రంగాల్లోనూ ఆర్థికంగా సమానస్థాయిలో ఉన్నప్పటికీ కూడా వరకట్న పిశాచానికి బలవుతూనే ఉన్నారు.

ఇండియన్ స్కూల్ ఆఫ్ ఉమెన్స్ స్టడీస్ అండ్ డెవలప్‌మెంట్ ఐద్వాల ఆధ్వర్యాన ఢిల్లీలో నిర్వహించిన వర్క్‌షాపు సందర్భంగా "అత్యవసర పరిస్థితిని కాకుండా దాని దురాగతాల పైన మనం పోరాడుతున్నట్లుగా వుంది" అని ఒక సామాజిక శాస్త్రవేత్త వ్యాఖ్యానించారు. వరకట్న మనేది కుటుంబాల్ని నాశనం చేసే జాడ్యం. విభిన్న వర్గాలు, కులాలు సముదాయాలకు చెందిన పదివేల కుటుంబాల్ని ఈ సందర్భంగా కార్యకర్తలు ఇంటర్వ్యూ చేయగా అత్యధిక శాతం మంది "వరకట్నమనేది తప్పనిసరిగా ఇవ్వాల్సిన ఆచారమని" మొగ్గుచూపడం ఆశ్చర్యం కల్గించక మానదు.

తెలుగు కథా సాహిత్యంలో వివిధ కథారచయితలు వరకట్నం దురాచారంతో సతమతమవుతున్న స్త్రీల సమస్యలను, వరునికి కట్నాన్ని ముట్టచెప్పే ఆడపిల్లలు గల తల్లిదండ్రుల బాధలను వారి కథలలో తెలియజేశారు.

తక్కువ కట్నం ఇచ్చి పెళ్ళిచేస్తే సమాజంలో చిన్నచూపు ఉంటుందని తమకు జీవనాధారాన్నిచ్చే షాపుని కూడా అమ్మడానికి ముందుకు వచ్చి, తమస్థాయికి మించి కట్నాన్ని ఒప్పుకొన్న తల్లిదండ్రుల తీరును, చివరకు ఆ కట్నం ఇవ్వలేకపోయిన స్థితిని ఎం.ఫిరోజీమా గారి "కట్నంకొద్దివరుడు" కథలో గమనించవచ్చు.

ఆచారి, కాంతమ్మ భార్యభర్తలు. ఇంట్లోనే దుకాణం పెట్టుకొనేవారు. వారి ఒక్కగానొక్క కూతురు సరళ. సంగీతం నేర్చుకుంటుంది. సరళకు పెళ్ళి చేయాలనుకుంటారు. వెంకట్రావు కొడుకుకి ఉద్యోగం ఉందని, పదివేలకు తక్కువ కాకుండా కట్నం ఇవ్వాలంటాడు. దుకాణం అమ్మైనా ఆ సంబంధం ఒప్పుకోవాలనుకుంటారు. ఆ సమయంలోనే ఇంకో సంబంధం వస్తుంది. తక్కువ కట్నం అడిగారని, ఎక్కువ కట్నం ఇచ్చి పెళ్ళిచేస్తేనే తమకు పేరుంటుందని సరళ తల్లిదండ్రులు అనుకుంటారు. "పదివేలకు వచ్చే వరుడి కంటే రెండువేలకు వచ్చే వరుడు హీనం కదండి, ఈ సంబంధం ఒప్పుకోవద్దు మా పెద్దన్నయ్య ఆడపిల్లలకు పదిహేనేసి వేలు ఇచ్చి పెళ్ళిళ్ల చేశాడు. అంతెందుకు మనింటి ముందు బట్టల దుకాణం ఆసామి పదకొండువేలిచ్చాడు. మనం కేవలం రెండువేలు కట్నం ఇచ్చి పెళ్ళిచేస్తే ఇక మా బంధువర్గంలో తలెత్తి తిరగక్కర్లేదు. డబ్బుకి ఆశపడి బంగారంలాంటి సరళ బ్రతుకు పాడుచేస్తామటండి" అని భర్తతో కాంతమ్మ అనే మాటలను బట్టి తమ కూతురికి తాహతుకి మించైనా

కట్నం ఇవ్వాలన్న పరిస్థితిని చూస్తాం. చివరికి శంకర్రావు కొడుక్కి పెద్దఉద్యోగం అని అతనికి ఇవ్వాలనుకుంటారు. కానీ శంకర్రావు కట్నాన్ని పెంచుతాడు. తన తాహతుకి మించినా, తన స్నేహితుడైన రామయ్యను అప్పు అడుగుతాడు. కానీ రామయ్య అందుకు ఒప్పుకోకపోగా, ఆచారిని తిడ్తాడు. "ఆడపిల్ల జీవితం బాగుపడాలి, మంచిభర్త లభించడమే ఏకైక మార్గమని తలంచే నీలాంటి అమాయకులు ఉన్నంతకాలం మన సమాజానికి వరకట్న దురాచారం నుండి విముక్తి లేదు. నీలాంటి వాడు పోటీపడి వరకట్న మొత్తాన్ని గౌరవకొలమానంగా భావించి అధికం చేస్తున్నాడు. తండ్రి తన ఆడపిల్ల బ్రతుకు బాగుచేయాలనే ఆరాటం కట్నం డబ్బులు కూడబెట్టడానికి కాక ఆడపిల్లకు విద్యా బుద్ధులు, ఏవైనా కళలు నేర్పడానికి, తమ జీవనోపాధి వారే చూసుకొనె తాహతు కల్పించాలి. స్త్రీ పురుషునిపై ఆధారపడి జీవించే వరాన్నభుక్కు కాకుండేందుకు ప్రతితండ్రి ప్రయత్నించనంతకాలం మన సమాజం రక్తాన్ని పీల్చిపిప్పి చేస్తున్న వరకట్న పిశాచం సమూలంగా నిర్మూలించబడదు" అని రామయ్య ఆచారిని తిడ్తాడు. ఆచారికి కనువిప్పు కలిగి, రామయ్య మాట ప్రకారం తన భార్యను, కూతురిని రామయ్య వద్దకే పంపించి, సంగీతంలో శిక్షణనిప్పిస్తాడు. సరళ తనస్వరంతో మంచి అవకాశాలు పొందుతుంది. లక్షధికారిణి అవుతుంది. మొదట కట్నం తక్కువైందన్న శంకర్రావు తిరిగి సరళను తన కొడుక్కి చేసుకుంటానంటాడు. సరళ తనకు ఇష్టంలేదని స్వేచ్ఛగా చెప్తుంది.



కట్నం ఇచ్చి ఆడపిల్లకు పెళ్ళిచేయాలంటే తల్లిదండ్రులకు ఒక జన్మ ఎత్తినంత పని అవుతుంది. తాహతుకి మించి కట్నం ఒప్పుకొన్నప్పటికీ, ఇంకా ఇంకా కావలన్న వారి కోర్కెలకు విసుగు చెందిన తండ్రి కూతుర్ని చంపుకుంటాడు. అలా వరకట్న పిశాచానికి బలైపోయిన అమ్మాయి సీతమ్మ కథయే గన్ను కృష్ణమూర్తి "కట్నం" కథ.

శరభయ్య కూతురు సీతమ్మ. తల్లి చనిపోవడంతో స్కూల్ చదువువరకే సాగి ఆగిపోతుంది. చెల్లెళ్ళకోసం, తండ్రికోసం ఇంటికే అంకితమైపోతుంది. సీతమ్మ అందంగా ఉండదు. నల్లగా ఉంటుంది. ఐనా తాను అందరితో మసలుకునే అభిమానానికి ప్రేమగా చూసుకుంటాడు. తండ్రి కాలికి బట్టకట్టకుండా అడిగినంత కట్నం ఇచ్చుకోలేక సంబంధాల కోసం వెతుకుతాడు. ఒక సంబంధం కుదురుతుంది. అబ్బాయికి ఫ్యాక్టరీలో ఉద్యోగం, ఎడంచేతికి వ్రేళ్లుండవు. అయినా ఏదో ఒక సంబంధం అని శరభయ్య ఒప్పుకుంటాడు. లగ్నం పెట్టుకుంటారు. ఎకరం పొలం కట్నంగా ఒప్పుకుంటారు. తర్వాత పదివేల కట్నం అదనంగా ఇస్తేనే ఒప్పుకుంటా మంటారు యెన్నాళ్ళకో కుదిరిన సంబంధం అని అప్పోసప్పో చేసి ఇవ్వడానికి ఒప్పుకుంటాడు. ఆ తర్వాత కొద్దిరోజులకే అబ్బాయి చెల్లెలు ఆడపడుచు కట్నం కింద ఐదువేలు ఇవ్వమని అడుగుతుంది. ఇల్లు కుదువబెట్టి రెండు వేలిస్తాడు. తర్వాత అబ్బాయి తల్లిదండ్రులు వచ్చి ఎక్కువ కట్నం ఇస్తామని సంబంధాలు వస్తున్నాయని, కనీసం ఇంకా ఐదువేలైనా ఇవ్వాలంటారు. ఇంకా కట్నం ఇవ్వడం తన వల్లకాదని, ఉన్న రెండు బర్రెలను ఇస్తానని శరభయ్య బ్రతిమలాడుకుంటాడు. వాటితో పాటు వెయ్యిరూపాయలుకూడా ఇమ్మంటారు. శరభయ్యకి విసుగొచ్చి ఇంట్లోకి వెళ్ళి తెస్తానని చెప్పి, విరక్తి చెంది సీతమ్మ తలను పళ్ళెంలో పెట్టి, గుడ్డకప్పి తీసుకువస్తాడు. అబ్బాయి తల్లిదండ్రులు గుడ్డతీసి చూడగా సీతమ్మ తలకాయ. "కాలరుద్రుడిలా ఉన్న శరభయ్య చేతిలో సీతమ్మ తల!... శరభయ్య కళ్లనుంచి, సీతమ్మ తల నుంచీ రక్తాశ్రువులు రాలుతుంటాయి. పోలీసులొచ్చి శరభయ్యను, అబ్బాయి తల్లిదండ్రుల్ని పట్టుకెళ్తారు.

ఆడపిల్లకు పెళ్ళిపేరుతో కట్నం ఇవ్వటాన్ని వ్యతిరేకించి, తల్లిదండ్రులను అప్పుల ఊబిలో దించకుండా, ఆత్మస్థైర్యంతో కాబోయే భర్తకే లేఖరాసిన లీల కథ పోల్కంపల్లి శాంతాదేవి "బకాసురుడి విందు".

లీల తల్లిదండ్రుల ఎలాగో తంటాలుపడి పదివేల కట్నంతో పెళ్ళి కుదరిస్తారు. పెళ్ళి చూపుల్లో పెళ్ళికొడుకు లీలకు ఎత్తుపళ్ళు ఉన్నాయని, అయినా పర్వాలేదంటాడు. అతని స్వభావం లీలకు నచ్చదు. కట్నం పేరుతో ఒక్కపైసా ఇచ్చినా ఒప్పుకోనని ఖచ్చితంగా చెప్తుంది. ఈ మాటలకు తల్లి కోప్పడి "పెళ్ళిపెటాకులు లేకుండా మా గుండెల మీద కుంపటిలా ఉండిపోతానంటావా" అని అంటుంది. దీనికి బదులుగా "అన్నయ్య నాకంటే పెద్దవాడే కదా వాడు గుండెలపై కుంపటి కాదా" అన్న లీల ప్రశ్నకు "వాడికీ నీకూ పోలికేమిటే వాడు మగాడు, ఏనుగు చచ్చినా వేయ్యే, బతికినా వేయ్యే, అన్నట్టు మగాడు పెళ్ళి చేసుకున్నా సరే, చేసుకోకపోయినా సరే" అన్న లీల తల్లి మాటలను బట్టి కుటుంబంలో ఆడపిల్లలపై ఎంతటి వివక్షతను చూపిస్తున్నారో తెలుస్తుంది. చివరికి ఒకరోజు లీల ధైర్యంతో కాబోయే భర్తకి ఒక ఉత్తరం రాస్తుంది. ఆ ఉత్తరంలో తన కుటుంబ పరిస్థితిని వివరిస్తుంది. అంతకట్నం ఇచ్చుకోలేమని, తన తర్వాత ఆడపిల్లలున్నారని, చదువులకు మగపిల్లలున్నారని, తిండికి ఆధారమైన పొలం అమ్మితే వారి పరిస్థితి ఏమిటని, ప్రతి ఆడపిల్ల తండ్రి వరకట్నమనే బకాసురుడికి ఆహారమవుతున్నారని రాస్తుంది.

"స్త్రీకి పురుషుడి అండ ఎంత అవసరమో, అతడికీ ఆమె అండ, తోడు అంతే అవసరం. అని తన భావాలు నచ్చితే కట్నం లేకుండా పెళ్ళిచేసుకోమని చెప్తుంది". ఈ విధంగా రాసిన ఉత్తరం విషయం తెలిసి లీల తండ్రి ఉద్యోగం చేసి జీవితం గడుపుకోవడంతోనే సమస్యలు తీరవని, ఆడపిల్లకు పెళ్ళితోనే సమస్యలు తీరుతాయని అంటాడు. తనొక్కతే అలా చేయడం వలన పెళ్ళికొడుకులకు ప్రాయశ్చిత్తం జరగదని అంటాడు. "నా ఒక్కదాని వల్ల ఏ ఉపకారం జరుగుతుందంటున్నారు, ప్రతి వర్షబిందువూ కురవడం ఆగిపోతే ప్రపంచం గతి ఎలా మారుతుందో ఊహించలేవా నాన్న?" అని అడుగుతుంది. "బలవంతంగా పెళ్ళి చేయకుండా ఆడపిల్లకు ఒకమనిషిగా వ్యక్తిత్వంతో బ్రతికే ఆత్మస్థైర్యాన్ని ఇవ్వండని" లీల తండ్రితో అంటుంది.

ఉన్నత చదువులుచదివి, ఉన్నత శిఖరాలను అధిరోహించే స్త్రీలు

కూడా వరకట్న విషవలయంలో చిక్కుకుంటున్నారన్నది సత్యం. పురుషునితో పాటు సమానంగా చదివి, సంపాదించే వ్యక్తిత్వమున్న ఆడపిల్ల చివరకు తను కష్టపడి సంపాదించిన డబ్బును కూడా కన్న తల్లిదండ్రులకు పంపించలేని దుస్థితిని భర్త కల్పించినప్పుడు, అలాంటివాడితో ఇక జీవితం వద్దని, ధైర్యంగా భర్తను ఎదిరించి, ఆత్మస్థైర్యంతో విడిపోయి బ్రతకాలని నిర్ణయించుకున్న సంధ్య కథయే ముదిగంటి సుజాతారెడ్డి "పోరు తప్పదా" కథ.

సంధ్య తల్లిదండ్రులు సంధ్యను, సందీప్‌ను సమానంగా చదివిస్తారు. సంధ్యా ఎమ్.యస్ సి పూర్తి చేసి అమెరికాలో ఉద్యోగం సంపాదించుకుంటుంది. తల్లిదండ్రులు సంధ్యకోసం సంబంధాలు వెతికి తగిన సంబంధం దొరకకపోవడంతో బాధపడ్తారు. చివరకు రావుగారి కొడుకు రోషన్‌తో పెళ్ళికి ఒప్పుకుంటారు. అబ్బాయికి అమెరికాలో ఉద్యోగం. పదిలక్షల కట్నం, బంగారంతో పెళ్ళికి ఒప్పుకుంటారు. అప్పుచేసి తన పెళ్ళికి అంతకట్నం ఇచ్చినందుకు సంధ్య బాధపడ్తుంది. పెళ్ళైన వారం రోజులకు నూతన దంపతులు అమెరికా వెళ్తారు. అమెరికా నుండి తండ్రి అకౌంట్‌కి డబ్బు పంపిస్తుంది. ఆ విషయం ఊరిలో రోషన్ తండ్రి రావు ద్వారా రోషన్‌కి తెలిసి, సంధ్యపై చిందులు వేస్తాడు. ఇద్దరి పేరుతో జాయింట్ అకౌంట్ తీయాల్సిందేనంటాడు. సంధ్య అందుకు ఒప్పుకోదు. తండ్రికి డబ్బు పంపించొద్దని ఆజ్ఞాపిస్తాడు. సంధ్య అతని అహంకారాన్ని, ఆధిపత్యాన్ని, పెత్తనాన్ని సహించలేక ఇంట్లోంచి వదిలి వెళ్ళిపోవడానికి సిద్ధపడుతుంది. ''నేను పోతున్నాను. నా సంపాదనంతా నీ చేతుల్లో పోసి బానిస బ్రతుకు బతకడం నాకిష్టంలేదు. అమెరికాలో వుండి సంపాదిస్తున్న నీకు కట్నం మీద ఆశపోలేదు. మగవాళ్ళతో సమానంగా చదివి, ఉద్యోగాలు చేస్తున్న ఆడపిల్లలకు కట్నం బాధలు తప్పటం లేదు. ఎక్కడున్నా ఇండియన్ మగవాళ్ళు మారరు. కట్నం వేధింపులతో కాల్చిచంపుతారు, ఉరిబిగిస్తారు. మగవాళ్ళ డబ్బుదాహం కట్నం మీద ఆశలు చావనంత వరకు, ఆడపిల్లలు పెండ్లి చేసుకోమని ఏకైక నిర్ణయం తీసుకోవాలని" సంధ్య ధైర్యంగా భర్తతో చెప్తుంది. "ఎన్నివాదాలు వచ్చినా మగవాళ్ళ అత్యాశకు హద్దులేకుండా పోతుంది. ఎక్కడో అక్కడ ఈ కీలుకు వాతపెట్టాలె! ఆడపిల్లలకు తల్లిదండ్రులు ఆస్తిలో హక్కు అంటు ఇస్తే తీసుకోవాలి గాని, పెండ్లినాడు కట్నం అంటూ వేదించడం ఎందుకు?" అని భర్త రోషన్‌ని ప్రశ్నించి, పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళి అతనిపై పిర్యాదు చేసి, విడాకులు తీసుకుంటానని ధైర్యంగా చెప్పివెళ్తుంది.



తల్లిదండ్రులు కట్నం ఇవ్వలేని నిస్సహాయతకు, తగిన వరుణ్ణి పొందలేక, తాముకోరుకున్న వాడితో ప్రేమను పొందలేక, మగదిక్కు ఉండాలనే తలంపులో బయటికి వచ్చి, సరియైన జోడు కాకపోయినా, తప్పని పరిస్థితుల్లో కలిసి ఉండి, చివరకు ఆర్థిక పరిస్థితి బాగాలేక తమ ఒళ్ళును అమ్ముకోవాల్సిన దుస్థితికి రావడం శోచనీయం. అలాంటి దుస్థితిని అనుభవించే సువర్ణ, భాగ్యరేఖల కథయే బి.యస్.రాములు "ప్రేమధార" కథ.

ఆర్థిక పరిస్థితి బాగాలేని సువర్ణ భాగ్యరేఖల్లాంటి స్త్రీలు శరీర కష్టంతో బ్రతకాలనుకున్నా కూలీలు పనిచేసే ప్రదేశంలో మేస్త్రీల బెదదలు, వేధింపులు వారి పేదరికాన్ని ఆసరా చేసుకుని వారిపట్ల అసభ్యంగా ప్రవర్తించే నీచపు నైజాన్ని ఈ కథలో గమనిస్తాం. "పశువుల్లా అమ్ముడుపోయే మగాళ్లను మగళ్ళుగా కొనుక్కోలేని దుస్థితికి ఆడపిల్లల జీవితాలు ఇలా తెగిన గాలిపటంలా ఉండాల్సిందేనా?" అన్న ప్రశ్న ఈ కథ ద్వారా ఉదయించకమానదు.

అమ్మాయి ఎంత చదువు చదువుకొన్న కట్నం ఇచ్చి పెళ్ళిచేయాలనే తల్లిదండ్రుల ఆలోచనలను, సమాజధోరణిని తట్టుకోలేక ఓ యువతి తనకు నచ్చిన సిద్ధాంతాల్ని, కట్నం ఇచ్చి పెళ్ళిచేసుకోవాలనే అనైతికతను ధైర్యంగా ఎదుర్కొని, కాబోయే వరుణ్ణి, కన్నతండ్రిని పోలీసులకు పట్టించిన ప్రవీణ కథయే డా. నూరంపూడి సుధ రాసిన "రేపటిపువ్వు".

ఈ కథలో ప్రవీణ తను నమ్మిన ఆదర్శానికి కట్టుబడి ధైర్యంతో ముందుకు వస్తుంది. ప్రతిఒక్కరూ ప్రవీణలా ధైర్యంగా ముందుకు వస్తే కట్నం ఇవ్వాలన్న, తీసుకోవాలన్న వారి ఆశలను భూస్థాపితం చేయవచ్చు. కట్నం మహమ్మారిని తరిమేయవచ్చు.

వరకట్న వేధింపులను తట్టుకోలేక చివరికి చనిపోవాలనుకున్న శ్యామలకు, మహిళా మండలికి చెందిన ఇందిర ధైర్యాన్నిచ్చి, బ్రతికి సాధించాలన్న తపనను కలిగించిన వైనాన్ని పోల్కంపల్లి శాంతాదేవి ''ముగింపు మీరే చెప్పండి'' కథలో గమనించవచ్చును.

శ్యామలకు తల్లిదండ్రులు అందినచోట్లల్లా అప్పులు చేసి వేణుకిచ్చి పెళ్ళిచేస్తారు. కానీ పెళ్ళైనప్పట్నుంచి అత్త, భర్త కట్నం తెమ్మని ఒక్కటే సూటిపోటి మాటలు. మొదటి పండక్కి నెలరోజుల ముందు తీసుకెళ్ళలేదని, వారిని తీసుకెళ్ళడానికి వచ్చిన శ్యామల తమ్ముడి ముందు సూటిపోటిమాటలంటుంది. పండగకు వెళ్ళిన వేణు అత్తగారింట్లో ఇష్టంగా ఉండడు. పండుగకు పెట్టిన బట్టలు చాలా తక్కువరేటని తీసుకోడు. శ్యామల తీసుకుంటుంది. శ్యామల మిషన్ నేర్చుకోవాలనుకుంటుంది. అందుకు భర్త ఒప్పుకోడు. కోడలు బట్టలు కుట్టి డబ్బులు బాగా సంపాదిస్తుందని తాళి చేయించుకోవచ్చని అత్త ఆశపడి ఒప్పుకుంటుంది. శ్యామలకు మహిళా మండలి ప్రెసిడెంట్ వరలక్ష్మి, సెక్రటరీ ఇందిరతో పరిచయం ఏర్పడుతుంది. తన పరిస్థితినంతా వారికి చెప్తుంది. ఒకవేళ భర్త, అత్త చేతుల్లో చనిపోతే, తనది ఆత్మహత్య కాదు హత్య అని నిరూపించాలని వేడుకుంటుంది. అలాగే నిరూపిస్తానని చెప్పిన వరలక్ష్మితో చనిపోయాక నిరూపించడం కాదు, చనిపోకుండా ఉండే ఆత్మస్థైర్యాన్నివ్వాలని చెప్తుంది. హత్యను ఆత్మహత్యగా చిత్రించిన ఊర్మిళ అనే యువతి సంఘటనను చెప్తుంది. ఆస్తికోసం అత్త, భర్త వేధించేవారని, తన పేరుతో ఉన్న ఆస్తితో పాటు, తమ్ముని పేరుతో ఉన్న మిగతా సగం ఆస్తిని కూడా తీసుకురమ్మని

## తప్పనిసరిగా వెళ్ళాలి

పాయల మురళీకృష్ణ
✆ : 9441026977



తుళ్ళిపడే వయసులో
ఆమెకు పెళ్ళి కుదిరింది
కార్డు పంపింది
వెళ్ళలేక పోయాను
పెళ్ళికొడుకు ఆమెకు తగ్గ అందగాడని
పెళ్ళికెళ్ళిన వారు చెబితే తెలిసింది

పెళ్ళయిన ఆర్నెలలకు
ఆమె మూడు నెలల గర్భవతట...
సన్నగా నాజుగ్గా మల్లెతీగలా ఉండే ఆమె
గర్భవతిగా ఎలా ఉందో
ఒక్కసారి చూసొద్దామని అనుకుంటూనే
అశ్రద్ధ చేశాను...

మొదటి పెళ్ళిరోజుకు
ఆమె ఒక మగబిడ్డకు తల్లి
తల్లిదండ్రుల కలగలిపిన పోలికలతో
పిల్లాడు చాలా ముద్దుగా ఉన్నాడట...
ఇది కూడా ఎవరో అనుకుంటూ ఉంటేనే తెలిసింది

రెండో పురిటిలో ఆడపిల్లట
అదృష్టవంతురాలు
ఏ కొరతాలేనట్లు
ఆడపిల్ల కూడా ఆమె అందాల్ని
మూట గట్టుకొని పుట్టివుంటుందని
నా నమ్మకం

పిల్లలు
చాలా బాగుంటారని
ముద్దు ముద్దుగా ఇద్దరినీ
ఆమె పెంచిందనీ
అందరూ అనుకోవడమే గాని
నేను వెళ్ళిందే లేదు
చూసిందీ లేదు...
ఖాళీ లేని బ్రతుకుతో ముడివడ్డ
ఒంటరి జీవితం
చాలా సమయాన్ని మింగేసింది

ఆమె ఇద్దరు పిల్లలకూ
ఒకేసారి పెళ్ళిచేసి పంపిందట
అమ్మాయిని అత్తవారింటికి
అబ్బాయిని అదేదో నగరానికి...
నాగైర్హాజరీని ముందే
ఊహించిందో
లేక మరచిపోయిందో గాని
నాకాహ్వానమందలేదు...
అయినా వెళ్దామనకున్నాను...
వివరాలు తెలియక వెళ్ళలేకపోయాను

పిల్లల పెళ్ళి తర్వాత కొన్నాళ్ళకు
గుండెపోటుతో ఆమె భర్త మరణించాడట
ప్చ్...!?
చాలా బాధ కలిగింది
ఈసారి ఖాళీగా ఉన్నా
ఆమె దుఃఖాన్ని కళ్ళతో చూడలేనని
వెళ్ళలేదు...

ఇప్పుడామె
నాలాగే ఒంటరి
అందుకే ఆమెను చూడడానికి
తప్పనిసరిగా వెళ్ళాలని
బయలుదేరాను....

---

వేధించేవారు. ఆ తెల్లవారే ఊర్మిళ చనిపోయిందని, ఆమె ఉరివేసుకున్నట్లుగా సృష్టించారని, కాని తల్లిదండ్రులు తమ కూతురిది హత్య అని ఎంత పోరాడినా, వారు లంచాలిచ్చిన అధికారుల ముందు గెలవలేకపోయారని చెప్తుంది.

వరకట్న వేధింపులకు ముగింపు పలకాలంటే ఆ బారిన పడుతున్న వారికి రక్షణ కల్పించాలని, ధైర్యాన్నివ్వాలని, డబ్బుకు గడ్డితిని పనిచేసే అధికారుల వైఖరి మారాలని తల్లిదండ్రులు కూడా తాహతుకి మించి కట్నాలు ఇవ్వడం చేయకూడదని, ముఖ్యంగా ఆడపిల్ల తనకుతాను రక్షించుకునే ఆత్మస్థైర్యంతో ముందుకు నడవాలని ఇందిర అంటుంది. ఈ మాటలు విన్న శ్యామలలో ధైర్యం వచ్చి తాను వాళ్ళ చేతిలో చచ్చిపోవడానికి సిద్ధంగాలేనని చెప్తుంది. సర్దిచెప్పి మళ్ళీ ఆ నరకంలోకే పంపే తల్లిదండ్రులు, సమాజం ఆలోచనల్లో మార్పు వస్తేనే ఆడపిల్లలపై వరకట్న వేధింపుల తాలూకు చావులుండవని చెప్తుంది.

పై కథల ద్వారా వరకట్నం మహమ్మారికి గురైన స్త్రీల స్థితిగతులను, వరకట్నం ఇవ్వలేని స్థితిలో ఉన్న తల్లితండ్రుల పరిస్థితులను, వరకట్నానికి వ్యతిరేకంగా పోరాడాల్సిన ఆవశ్యకతను చైతన్యాన్ని పొందాల్సిన తీరును రచయితలు తెలియజేశారు.

ఆకాశంలో సగం మేం, అవకాశాల్లో సగం మావే అని అన్ని రంగాల్లో స్త్రీలు తమ సత్తాను చూపిస్తున్నప్పటికీ కూడా వరకట్న పిశాచానికి బలవుతుండటం శోచనీయం. ఈదుస్థితిని పారద్రోలాల్సిన అవసరం ఎంతైనా ఉంది. కట్నం ఇవ్వడం, తీసుకోవడం ప్రోత్సహించవద్దు. వరకట్నం తీసుకొనేవారికి కఠినమైన శిక్షలు వెయ్యాలి. ఆడపిల్లలను కన్నతల్లిదండ్రులు కూడా కట్నాన్ని ఇవ్వడం హోదాగా భావించకూడదు. వరకట్న నిరోధక చట్టాన్ని సక్రమంగా అమలు చేయగలిగినప్పుడే వరకట్న వేధింపులు, చావులు తప్పించగలుగుతాం. వరకట్న వ్యతిరేకపోరాటాల్ని కేవలం మహిళా సంఘాలకే పరిమితం చేయకుండా విస్తృత ప్రజా ఉద్యమాల్లో ఆ సమస్యను మిళితం చేయాల్సిన కర్తవ్యం మనందరిముందున్నది. ప్రతిఒక్కరు వరకట్నం వంటి దుర్మార్గపు అనాచారాల పైన సమరాన్ని సాగించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఆ దిశగానే తెలుగు కథారచయితలు తమ కథల ద్వారా సమాజంలోని వరకట్న మహమ్మారిని భూస్థాపితం చేసే దిశగా, సాహిత్యం ద్వారా సమాజంలో స్పృహను కల్గిస్తున్నవారి సాహితీసేవను అభినందించక తప్పదు. ♦

## మనవడొచ్చిన వేళ

బొమ్మరాత యల్లయ్య
✆ 9502051996



ఉసిరి తిని ఉదకం తాగినంత
మధురంగా ఉంటుంది-
మా ఇంటికి మనవడొచ్చినప్పుడు
యాభై దాటిన నా వయసు కాస్తా
అయిదేళ్ళకు దిగజారుతుంది
అల్లరి వెల్లువయ్యే వాడి ఆటల్లోకి
అమాంతంగా నను లాగినపుడు
పసితనం పరిమళమై నన్నల్లుకుంటుంది
అంతరంగపు సొరంగాల్లో
అంతర్లీనంగా దాగిన ఉత్సాహ తరంగం
అమాంతం మనసును పట్టి కుదిపేస్తుంది
చెప్పకనే పారిపోతుంది ఆయాసం
తెలియకనే జరిగిపోతుంది వ్యాయామం
నాకపుడేమీ కన్పించదు వాడి రూపం తప్ప
మరేదీ విన్పించదు చిలిపి అల్లరి తప్ప
ఇష్టమున్నా లేకున్నా వాడి ఆటల్లో పావుగా మారాల్సిందే
చేతనైనా కాకున్నా వాడు చెప్పినట్టు చేయాల్సిందే
వారి సకల సందేహాలకు సమాధానాలిస్తూ-
నా అనుభవ గ్రంథాన్ని అరగ దీయాల్సిందే
పలురకాల పాత్రల్లో అలవోకగా
పరకాయ ప్రవేశం చేయాల్సిందే
వాడిని మోసేందుకు గుర్రాన్నౌతాను
అంబారీ లేని ఏనుగునౌతాను
భుజంపై కెక్కివాడు కూర్చునప్పుడు
ఎవరెస్టులా ఫీలౌతాను
వాడు పోలీసైతే - దొంగను నేను
బొమ్మ తుపాకీతో కాల్చినపుడు
'చచ్చినట్టు' పడిఉంటాను
దాగుడు మూతలాడే సమయంలో
వాడు కన్పిస్తున్నా కన్పించనట్టు 'నటిస్తూ'...
"నన్ను పట్టుకో తాతయ్యా!" అంటూ
లేడిపిల్లలా వాడు పరుగెత్తుతుంటే
దొరికినా దొరకనట్టు నటిస్తూ
వాడు గెలిచేందుకు నేనోడిపోతాను
వాడి నవ్వుల మువ్వల రవళిలో
ఓటమిలోనూ ఉన్న ఆనందాన్ని ఆస్వాదిస్తా...
వాడు వెళ్ళిపోతాడన్న విషయం గుండెను పిండుతున్నా
మరో మంచి స్వాగత గీతానికి పదాలు కూరుస్తా.

---

## కాళ్ళు

ఎస్.ఎస్.బి. గేరా
✆ : 9492922492

పచ్చిక పరచుకొన్న గట్లపై
అలవోకగా నడిచిన ఆ అడుగులే,
పశువులతో ధీటుగా
ముళ్ళనూ, బండరాళ్ళనూ దాటిన ఆ కాళ్ళే
మోపెడు కట్టెలతో
కొండల్లో, కోనల్లో పరిగెత్తిన ఆ పాదాలే
నగరం రద్దీ రోడ్డుగట్టున ఆగిపోయాయి-
పొగనురగలెత్తుతున్న వాహన ప్రవాహాన్ని దాటలేక!!
మారా నదిని దాటే,
సెరంగెటీ అడవి గొడ్లలాగా
ఒకదానిపై ఒకటి,
రయ్యి రయ్యిన దూసుకొస్తున్న
కార్లు, బస్సులు, లారీలు,
ఆటోలు, మోటారు సైకిళ్ళు!
ఎప్పుడు దాటాలో తెలియదు
ఎక్కడ దాటాలో తెలియదు
నగరంలో నడకను ప్రశ్నార్థకం చేస్తూ
చిరిగిన చీరో, గోచీనో చుట్టుకొని
రోడ్డుగట్లపై రోజురోజుకూ పెరిగిపోతున్న
పల్లెటూరి కాళ్ళు!
ఆ కాళ్ళను అక్కడికి లాక్కొచ్చింది,
కూలిన సేద్యమో....
అందని వైద్యమో
పిల్లల విద్యో...
వాళ్ళ ఉద్యోగమో...
ఏదైతేనేం
మట్టి కాళ్ళన్నీ ఇలాగే
కాంక్రీటు అడవిదార్లు పడితే,



తిండానికే గాదు
పిండాకూడు పెట్టుకోడానికైనా
పిడికెడు బియ్యం మిగలవు !!!

# ప్రజాగళం - 'ధూమిల్'

హిందీ మూలం : రాంజీ తివారి



ఆనాడు స్వాతంత్ర్యం గురించి దేశంలో ప్రతీపౌరుడి మనసులో ఎన్నో కలలు కదలాడాయి. మన దేశం స్వాతంత్ర్యం పొందితే మన అన్ని ఇబ్బందులు, కష్టాలు తీరిపోతాయని ప్రజలు అనుకున్నారు. అందరికి న్యాయం జరుగుతుందని, స్వాతంత్ర్యం లాభం అందరికి చేకూరుతుందని, అందరికి ఉపాధి లభిస్తుందని ఆశపడ్డారు. వారిని ఎవరూ సతాయించరని, వారి శ్రమను దోపిడి చేసి వేరే వాళ్ళు తన ఇనుప బీరువాల్లో నింపుకోరని అనుకున్నారు. స్వాతంత్ర్యం వచ్చాక ఈ కలలనే దృష్టిలో పెట్టుకుని దేశ నాయకులు మన రాజ్యాంగాన్ని కూడా రూపొందించారు. ఇహ త్వరలోనే మన దుః ఖాలకు అంతం ఉంటుందని అందరి మనసులో ఆశాకిరణాలు మెరిసాయి,

స్వాతంత్రం తరువాత ఒక దశాబ్దంపాటు ఈ ఆశాభావం కొనసాగింది. కాని కాలం గడుస్తున్న కొద్ది, కలలు మట్టి కొట్టుకుపోవటం మొదలయ్యేసరికి, ప్రజలకు మోహభంగం అవుతూ వచ్చింది. ఈ మోహభంగమే హింది కవితలో కూడా కనబడింది. దీనికి ప్రధాన వాహకుడిగా సుదామా పాండేయ్ 'ధూమిల్' నిలిచాడు. ప్రజలు చూసిన కలలను, స్వతంత్ర భారతదేశం సాధించిన దానితో పోలుస్తు తన కవిత్వానికి విషయ వస్తువుగా చేసుకున్నాడు. ఇందులో ఆయనకు ఎక్కడ నీరు గారుస్తున్నట్లు కనపడినా అక్కడే తన కవితల్లో దానికి అద్దం పట్టాడు. ఉదాహరణకి ఆయన స్వాతంత్ర్యాన్ని నిక్కచ్చిగా ఇలా ప్రశ్నిస్తాడు.

**'స్వాతంత్ర్యం అలసిపోయిన మూడు రంగుల పేరా**
(క్యా ఆజాది తీన్ థకే హువే రంగోc కా నామ్ హై)
**దేన్నైతే ఒక చక్రం మోస్తున్నదో**
(జిసే ఏక్ పహియా ఢోతా హై)
**లేక దీనికేదైనా ప్రత్యేకమైన అర్థం ఉందా?** (యా ఇస్కా కోయి ఖాస్ మతలబ్ హోతా హై)'

ఆ సమయంలో స్వాతంత్రం గురించి ఇంత స్పష్టమైన ప్రశ్నలు వేయటం రాజకీయాల్లో కాని, సమాజంలో కాని ఇంకా ప్రారంభం కాలేదు. తనదంతా ప్రజా ప్రతినిధులకి అప్పచెప్పి వారిపై ఇంకా నమ్మకం కోల్పోని కోట్లమంది ప్రజల భవిష్యత్‌ని 'ధూమిల్' మాత్రం చూడగలిగాడు. ఈ దేశ ప్రజల ముందు వ్యవస్థ నగ్న రూపాన్ని ఆవిష్కరించాల్సిందేనని ఆయనకు అనిపించింది. ఆ కారణం చేతే 'ధూమిల్' కవిత్వం దేని చాటునైతే వ్యవస్థ సగటు మనిషిని మోసం చేస్తున్నదో, ప్రతి అపవిత్ర వస్తువు వెనుక నున్న నిజాన్ని బయట పెట్టడం మొదలుబెట్టాడు. పార్లమెంటుని ఉద్దేశించి రాసిన ఆయన ఈ రెండు కవితలు అందరి నోట్లో నలగసాగాయి.

**'ఒకడు రొట్టెలొత్తుతాడు ఒక మనిషి రొట్టె తింటాడు**
(ఏక్ రోటి బేల్తాహై ఏక్ అద్మీరోటి ఖాతా హై)
**కాని వీళ్ళద్దరి మధ్య ఒక మూడో వ్యక్తి కూడా ఉన్నాడు** (మగర్ ఇన్ దోనోc కే బీచ్ ఏక్ తీసరా ఆద్మీ భీ హై)
**ఎవడైతే రొట్టెలు ఒత్తడో మరి రొట్టెలు తినడో** (జో న రోటీ బేల్తా హై ఔర్ రోటీ ఖాతా హై)
**పైపెచ్చు రొట్టెతో ఆడుకుంటాడో నేను అడుగుతున్నా** (వరన్ రోటీకే సాథ్ ఖెల్తా హై మై పూఛతా హూ c)
**ఈ మూడో వ్యక్తి ఎవడు నా దేశ పార్లమెంటు** (యహ్ తీసరా ఆద్మీ కౌన్ హై మేరే దేశ కా సంసద్)
**మౌనంగా ఉంది** (మౌన్ హై)'

ఆయన రెండో కవితలో రాసింది.

**'నా దేశ పార్లమెంటు నూనెవాడి గానుగ** (మేరే దేశ్‌కీ సంసద్ తేలీకి వహ్ ఘానీ హై)
**అందులో సగం నూనె సగం నీరు** (జిస్మే ఆధా తేల్ ఆధా పానీ హై )'

ఆయన వాడిన ఈ పదునైన రూపకాల అద్దంలో మన పార్లమెంటు నిజ స్వరూపం నేడు ఇంకా బాగా చూడగలం. అక్కడ సగటు మనిషి సమస్యలపై చర్చ జరగదు, అసలు అది సగటు మనిషిని ప్రతిబింబించదు. లేకుంటే ఏ దేశంలో ఐతే 80 శాతం మనుషుల రోజు వారి ఆదాయం 20 రూపాయల కంటే తక్కువో, 80 శాతం పార్లమెంటు సభ్యులు కోటీశ్వరులు, శత కోటీశ్వరులు ఎలా అవుతారు? ఈ విధంగానే 'ధూమిల్' ఈ బూటకపు ప్రజాస్వామ్యంపై దాడి చేస్తాడు.

**'ప్రజా' లేదు 'స్వామ్యం' లేదు** (న కోయీ 'లోక్' హై న కోయీ 'తంత్ర్' హై)
**ఇది మనిషికి వ్యతిరేకంగా మనిషి యొక్క బహిరంగ కుట్ర**
(యహ్ ఆద్మీకా ఆద్మీకే ఖిలాఫ్ ఖులాసా షడయంత్ర్ హై')
మరి ఈ సొంపు కూడా చూడండి–
**'ఇక్కడ ఎటువంటి ప్రజాస్వామ్యం ఉందంటే దానిలో బతికి**

ఉండటానికి

(యహా౯ ఐసా జన్‌తంత్ర్ హై జిస్మే జిందా రహ్నే కేలియే)

**గుఱ్ఱానికి, గడ్డికీ ఒకే విధమైన స్వాతంత్ర్యం** (ఘోడే ఔర్ ఘాస్‌కో ఏక్ జైసి ఛూట్ హై )

**ఏమి విచిత్రమో ఎలాంటి అబద్ధమో** ( కైసి విడంబనా హై కైసా ఝూట్ హై )

**మన దగ్గర ప్రజాస్వామ్యం ఎలాంటి ఒక తమాషా అంటే** (అప్నే యహా౯ జనతంత్ర ఏక్ ఐసా తమాశా హై )

**దాని ప్రాణం కోతులాడించేవాడి భాష** (జిస్మే జాన్ మదారీకీ భాషా హై)

నిజానికి 'ధూమిల్' ప్రజాస్వామ్యానికి వ్యతిరేకి కాదు. కాని ఆయన దాని నిజమైన ఆత్మని దానికి తిరిగి రప్పించాలని అనుకున్నాడు. ఏ ప్రజాస్వామ్యం గురించైతే ఈ దేశ ప్రజలు కలలు కన్నారో ఆ నిజమైన ప్రజాస్వామ్యాన్నే ఆయన తన కవితల ద్వారా వెతుకుతూ వచ్చాడు. ఆయనకు ఇటువంటి ఆపేక్షే సోషలిజం పట్ల కూడా ఉండింది. కాని ఆ పేరుతో ప్రజలను మోసం చేసినప్పుడు 'ధూమిల్' ఎలా ఊరుకోగల్గేవాడు.

**'నాదేశ సోషలిజం గిడ్డంగిలో వేలాడుతున్న** (మేరే దేశ్‌కా సమాజ్ వాద్ మాలగోదామ్ మే లటకతి హుయిా )

**ఆ బకెట్ల లాంటిది వేటిపైన ఐతే 'నిప్పు' అని రాసి ఉందో** (ఉన్ బాల్టియో౯కీ తరహ్ హై జిన్ పర్ 'ఆగ్' లిఖా హై)

**ఇంకా వాటిలో ఇసుక, నీరూ నిండి ఉన్నాయి** ( ఔర్ ఉన్మే బాలూ ఔర్ పానీ భరా హై)

నేడు ఈ సోషలిజం తాలుక నిజం ఇహ దాగి లేదు. దీనితో పాటు రాజ్యాంగంలో పొందు పరిచిన స్వాతంత్రం, సమానత్వం, న్యాయం, స్నేహం గురించి కలలు ఆ కాగితాల పైనే చెదిరి మదిరి ఉన్నాయి.

ఆయన ఇలా రాసాడు.

**'ఇక్కడ ప్రజలు ఒక బండి ఒకే రాజ్యాంగం కింద** (యహా౯ జనతా ఏక్ గాడీహై, ఏక్ హి సంవిధాన్‌కే నీచే)

**ఆకలితో అలమటిస్తున్న చాచబడిన చేయి పేరు దయ** (భూఖ్ సే రియాతి హుయిా, ఫైలీ హథేలీ కా నామ్ దయా హై)'

**మరి ఆకలిలో బిగుసుపోయిన పిడికిలి పేరు నక్సల్ బాడి** ( ఔర్ భూఖ మే తనీ హుయిా ముట్టీ కా నామ్ నక్సల్‌బాడి హై)

'ధూమిల్' కవితల్లో కనబడే, స్పష్టంగా ఘోషించే సాహసం ఇతరత్రా దుర్లభం. ఉపాధి కార్యాలయం చుట్టూ తిరుగుతున్న ఒక నిరుద్యోగి యువకుడి నోట విన్నది ఆయన కవిత్వంగా ఇలా రూపొందించాడు.

**ఈ దేశ మట్టిలో మన సుఖం వెతకటం** (ఇస్ దేశ్‌కీ మిట్టీ మే అప్నే జాంగర్ కా సుఖ్ తలాశనా)

**గుడ్డి అమ్మాయి కళ్ళలో ఆమెతో సహవాస సుఖం వెతకటం** (అంధీ లడ్కీ కీ ఆంఖో౯ మే ఉససే సహవాస్ కా సుఖ తలాశనా హై')

సాహిత్య పండితులు 'ధూమిల్' కవితలకు సామాన్యత్వం, అతిగా దాడి చేసే గుణం ఆపాదించి అతన్ని చాలా కాలం ఉపేక్షించారు. కాని ఈ ఉపేక్ష ఆయన ధైర్యాన్ని ఉత్సాహాన్ని దెబ్బ తీయలేకపోయింది. ఏ కావ్య భాషనైతే పండితులు సామాన్యమైనదన్నారో దాని వల్లే పాఠకులు అతన్ని దగ్గర చేర్చుకున్నారు. ఆయన కవిత ప్రభావవంతమైనదనే చెప్పాలి, ఎందుకంటే ఈ రోజు కూడా ఆయన కవితలతో ప్రభావితులై కవితలు రాసే ఒక పూర్తి తరం హిందీ సాహిత్యంలో నేడు ఉన్నది. వ్యవస్థని తేటతెల్లం చేసినట్లే మనిషిని కూడా నిర్వచించటం 'ధూమిల్'కే చెల్లింది.

**'నీ బతికి ఉండటం వెనక సరియైన తర్కం లేకపోతే** (తుమ్హారే జిందా రహ్నే కే పీఛే అగర్ సహీ తర్క్ నహీ హై)

**రామకోట అమ్ముకుని లేక పడతుల వర్తకం చేసి** (తో రామనామీ బెఛ్‌కర్ యా రండియో౯కీ దలాలి కర్కే)

**పొట్ట పోషించుకోవటంలో ఏమి తేదా లేదు** (రోజీ కమానే మే కోయిా ఫర్క్ నహీ హై')

'పార్లమెంటు నుండి వీధి వరకు' 'రేపు వినండి నన్ను', 'సుదామా పాండే ప్రజాస్వామ్యం' వంటి పుస్తకాల రచయిత 'ధూమిల్' యాభై ఏళ్ళ ఆయుష్షుకు కూడా నోచుకోలేదు. ఆఖరు సమయంలో ఆయన సంవేదనలు ఆయన్ను అవసాదగ్రస్తుడిని చేసాయి. కాని తన ప్రజా విప్లవకర కవితలతో అతను మన మధ్య ఎప్పుడూ జీవించే ఉంటాడు. మన పూర్వీకులు కన్న కలల్ని నిజం చేయటానికి మనం ప్రయత్నిస్తూనే ఉండాలని గుర్తుచేస్తూనే ఉంటాడు. అలా జరిగితేనే ఆయనకు మనం నిజమైన గౌరవం చూపించినట్టు అవుతుంది.

**(తెలుగు: వేదుల రామకృష్ణ)**

## "జీవన సౌరభం"

శ్రీ రంగనాయకి. వై
✆ : 9441095974



తమలపాకు మీద సున్నం రాస్తూ ఉంటాను
పండాలని కోరే నోరు
ప్రపంచంలో ఉన్నదనే నమ్ముతూ !
వేల వేల గాలన్ల
కన్నీరును పుష్పింపజేస్తూనే ఉంటాను
మనసనే మట్టిని సారవంతం చేస్తుందనే నమ్ముతూ !
గాయాలతో, గునపాలతో బద్దలు చేస్తున్నా
జీవితాన్ని రేపు వైపు కదలమనే చెబుతా
చలనం మానవజీవన పరిణామమని నమ్ముతూ !
నన్ను నేను కోల్పోతూ
నన్ను నేను కనుక్కుంటా
ఆ కనుగొన్నచోటే
ప్రేమ అని, శాంతమని
మౌనమని, కన్నీరు అని
యుద్ధమని, అంతిమ ప్రయాణమని !

కథ

# విరిగిన కల




## సిద్దెంకి యాదగిరి

✆: 9441244773


పనికిపోయి పోయి వచ్చిన ఊశయ్యకునీళ్లిచ్చి, భోజన మందించింది ముత్యాలు. తిండిమీద కూర్చుండంగనే

"ఇగో మిట్టపల్లి కాడ ఒకతల్లి సచ్చిపోయిన బిడ్డ ఉన్నదట. తెచ్చుకుందాం. సాదుకుందాం. నంగునూరుల తండ్రిసచ్చిన పోరగండ్లు నలుగురున్నరట. ఒక్కరిని యిస్తరట ఏమంటావు?"

ఏమంటనే యింక కొన్నిదినాలు చూద్దామే. సుగుణ దగ్గర చూపెట్టుకోవడ్తిమీ. చందులపురం చెట్ల మందులు తింటూ పత్యం చేయవడ్తిమి. పెద్దగుట్ట దేవునికి, మల్లన్నకు. ఆఖరికి యేసుదేవునికి మొక్కవడితిమి. ఇంకో యాడాది సూద్దాం" అని ఊశయ్యన్నడు.

నీ యాడాది పాడుపడ యింకెన్నొద్దులు ఆగుదాము? నల్లటి దాని మాట పెదవుల తీట చేయవడ్తివి. మందులు మత్తుగ తిన్నం. మంత్రగాల్లయిరి. యంత్రగాల్లయిరి. తీరొక్క దేవుని దగ్గరికి తిరిగితిమి. ఏంగాకనేపాయే. ఏడాది సూద్దామనవడ్తివి. నల్లాలేదాయే. తెల్లాలేదాయే..' దండకము అందుకున్నది ముత్యాలు.

"ఎద్దు ఎగురంగనే గంట ఎగురది అంటే ఆగవేందే? మనిషివా? పశురానివా? ఎపుడు తినంగనే ఒర్రతవు? నీయక్క నీళ్లియహ ఏం ఒర్రుతవు" కసిరిచ్చుకున్నడు ఊశయ్య.

"కుతికె పడ్డదా..? సరం పడ్డాదా? ఇగవటు నీళ్లు? ఒర్రినట్టు కనవడుతున్నదా? నన్ను ఒర్రుదు పేరు చేయందెన్నడు? అనవట్టి అనవట్టి నడేదు దాటే. నలపై ఏండ్లు దిరిగిపోయే.

మాచిన్నవ్వ బిడ్డను చేసుకొమ్మంటే... చేసుకోకపోతివి. చూసి చూసి మరి పడిగెకు నూరు మనం పాయే జాం జంపన్నోలే చెయ్యవడ్తివి నీ ముచ్చట మిడ్క" ముత్యాలు అన్నది

"సమితుల పోరు ఎట్లుంటది? నీకే నష్టం" ఎంత మంచిగ వున్న పంచాదు లైతయి"

"నేనే సమితుల పోరు పడుత. నాకేం నష్టం లేదు. పంచాదులు గాకుంట సూసుకుంట నేం జెప్పేది జెయ్యక" అని ముత్యాలమ్మా అన్నది.

"ఇగ నేను చెప్పెకాడ్కి చెప్పుతున్న నీకు తకలీఫ్ నాకు తక్‌లీపు. వచ్చేది ఒట్టి గొత్తదా? జాగ రాయించుకుంటది. యిల్లు రాయించుకుంటది. ముసలోనికి కుసును గుడాలు ఎందుకే ముత్తి పూనకం పూనిన శివసత్తి లెక్క చేత్తన్నవు. నీ ముక్కు చెక్కుత "గుటుక్కు తింటున్న అన్నం మింగుతూ ఉశయ్యన్నడు.

“ఇగ నీకు రాని మాటలేమున్నయి. నన్ను మావ్వగారిని తిట్టెతందుకు మాటలు మస్తుగ వస్తయి. గదంత గాదుగని ఇబ్రహింనగర్ కాడ ఇడుపుకాయిదమయి. యింటి మీదున్న దానికి ఊరు మీద కదుపయిందట. ఎవలకైన తోలుతరని మల్లదూరి మల్లయ్య సోత్తి తెచ్చిండు. నేను మొన్నటి నుంచే చెప్పుతున్న నా మాట యిను. నాక్కూడా శాతగాదు. రోగాల కుప్పనైతన్న రోజురోజుకీ నాకు నీకు మంచి గుంటది. చెప్పినట్టు యిను చేతులుండు. బాంచన్ కాల్మొక్త జర నా మాట జవదాటకు..”

“ఏమో పోయే అని నములుతూ మాట్లాడుతుండు. అంతల్లనే బాయికాడి రాజయ్య “ఓరి ఊశయ్య ఊషా... ఉన్నావురా...?” అని పిలుస్తండు “ఉన్న ఉన్న”..!!

“ఏం.రా ! నాలుగు పిలుపులకు కూడా యినొత్తలేదా?”

“నన్ను మా ముత్తి సంపుకు తింటది. గందుకె యినిరాలేదు యింట్లకు?” ఊశయ్య జవాబిచ్చిండు. ముత్యాలు యింట్లకేలి యినుపకుర్చి తెచ్చి అరుగుమీదేసి “రాజన్నాకూసో... మంచిగొచ్చినవు దేవుడాడిచ్చినట్టు. మాకేమో పిల్లలు లేకపోయిరి ఎవలనన్న సాదుకుందామంటే అట్లాయినడు. లగ్గం చేసుకొమ్మంటే యిట్లాయినడు. మారుమనం వద్దంటడు. నేనేం జేయ్యాల నేనేడ పోవాలె...” అని అంగలార్చుతుంది.



‘‘ఔరా ఊశయ్య ఒగ పోరన్ని సాదుకుంటేమైతదిరా?లగ్గమో, మారుమనమో చేసుకుంటే ఏమయితదిరా? చేసుకబతికేంత జాగున్నది. పనిచేసేతందుకు నువ్వున్నవు ముత్యాలుంది. మారుమనం తెచ్చుకుంటేందిరా...” రాజయ్య చెప్పిండు ఊశయ్యకు.

“అ.. నువ్వు బాగ చెప్పినవు? నీ అసొంటోడుంటే, మూడిండ్లకు ఆరిండ్లయితయి తగిలిత్తవు యిగిలిత్తవు నారదామునోలే..? కుక్కలకు తవుడువోసి కోట్లాట వెట్టినట్టే వుంది. యిద్దరు కొట్లాడితే మూడొగనికి సందయితదట. అంటే గిదే ఏంది?” రాజయ్య మొకమ్మీద గుద్దినట్లన్నడు ఊశయ్య.

“ఎవలు మాట్లాడితే వాల్లమీదికి గుద్లుదెరుస్తడు ఐరిని బైరి బైరిని ఐరిచేస్తడు గుడ్డేలుగు లెక్క చూస్తడు. కొమ్ముల బర్రె చెలిపినట్లు మాట్లాడుకుంట చెలుపుతడు. గిదే తరువాయి. తలుపుపెట్టి చెప్పితే కొలుపు పెట్టి యింటడు. ముందట్కిపోనియ్యడు యెనుకకు రానియ్యడు మూతిక్కల్లెం పెట్టేయి మాట్లాడుతడు.” ముత్యాలు.

“ఊశయ్యా ! కోపమా? కొట్లాటనా? ఎవలదేందో వాల్లకు ఎరుక ఒగొలు చెప్పే బుద్ధి అప్పట్ది. తన బుద్ధి ఎప్పట్ది. చెప్పంగనే గంతకోపమా? ఎక్కడికి పోయినా ఎంతధనం సంపాయించిన ముందుగా అడిగేది పిల్లలెంతమందీ అని అడుగుతరుగని ఇల్లు కట్టినవా? బాయితోడినవా? బంగారం కొన్నవా? యిట్లాంటివి ఎవ్వి అడగరు. తినరాని పండు తీపిలమెండు కదుపుపండు. అని అంటరు. అందుకోసము చెబుతున్న ఎవల యిష్టం వాళ్లు. ఎంటిరామారావు చేసుకోలేదా ముసలితనాన వయసు పెండ్లాన్ని ఏదైనా మనసుంటే మార్గముంటది. నీ బుద్ధి ఉన్నట్లు చేసుకో” అని రాజయ్యన్నడు.

“లోకమంత ముందట ముచ్చట వెట్టుకుంటనే ఎనుక ఎక్కిరియ్యపట్టిరి. పసుపులు ముట్టేకాడ పెండ్లిల్ల పేరంటాలల్ల యిలవలేకపాయే. ఏంజేస్తం. ఏమంటం భగవంతుడు అందరినీ ఒక్కతీరుగ్గ చూస్తే బాధలుండకపోవు. నిన్నెత అంటలేరా? గొడ్డు అపక్షణని. చెవులతోటి యింటే పాపం నోటితో అంటే పాపం ఏమోసో బతుకు అరమంద్రం కావట్టే. కాళ్లురెక్కలుండంగా కష్టపడినా కమ్మగ తియ్యగ తిన్నరని లోకము ఆడిపోసుకుంటరు. వయసుడిగినంక కుక్కకానది. నక్కకానది. సట్టు (డబ్బు) ఉంటనేసుట్టు దిరుగుతరు. నోట్లే ఈగలు కొట్టుకాదుతుంటే కసికెదు నీళ్లుపోసే మానవుదుండడు.

“ఓముత్తవ్వ. రంది ఎందుకు? జరుగవోయేది జరుగకమానది. రేపటిదానికి రూపముండదిగని అల్లరిపడకు, బూడిది కొట్టేది వున్నది కిరాయికి రాకపోతివి ఒక్కనాడు. ఒక నాలుగు మలక (ట్రిప్పు) లు అయితే అయిపోవు. ఏమంటవు ఊశయ్యా” అని రాజయ్య అడిగిండు.

అప్పట్దాక ఆలోచనల మునిగి అల్లరిపడుతున్న ఊశయ్య ఒక్కసారి ఉలిక్కిపడి “ఆఁరేపు వీలుగాదు. ఆవల ఎల్లుండి వత్త. నీకర్జంటు గుండె ఎవలతోటైన పోయించుకోపో...! ఎవలకు వీలుగాకపోతే నేనొస్త” ఊశయ్య జవాబు.

“సరే ! ఎవల్తోటి ఏంది. నువ్వేరా...” అంటు వెళ్లిపోయిండు బాయికాడి రాజయ్య. బాదుగకు పోవాలని తయారైతుంటే... ముత్యాలు సద్దివెట్టింది.

“నీళ్లక్యాను. సద్ది. పులుసుపోసిన, పెరుగుపెట్టిన, యాల్లకుదిను. పనిమీద పడి మరచిపోయేవు? నేనియ్యాల్ల మీచెల్లె నర్సవ్వకు మనవదుపుట్టి నాలుగురోజులాయె చూస్త చూస్త అనుకోవట్టి ఇయ్యాల చూసెతందుకు పోత. ఆమె ఎటో మాట్లాడుతది. మొకం చూసుకుంట పటాపట్ కట్టిరిసినట్టు మొగ మాటలు మాట్లాడుతది. నవ్వుకుంట నవ్వుకుంట గుండెల రాళ్లువెత్తేస్తది. ఏడికి పోతయి మీ బెయిమాన్ మాటలు. నాకు యియ్యాల్ల ఎడ్లకు పచ్చి గడ్డికోసుడు తీరది. నువ్వే యాల్ల పొద్దుగాల వచ్చి. గడ్డికోసుకో. జెమ్మటాలు కొట్టుకుంట బీటల పండకు యింటన్నవా ఇగ నేను బోతున్న. రోడ్డు పొంట జతనంగవో...” అని యింత ఆత్మ ధైర్యాన్ని కాసింత ప్రేమను కలపి సాగనంపుతూ పలికింది ముత్యాలు.

“యింటన్ననే పోయిరా! యాల్లపొద్దుగాల బయలుదేరు. ఇంత పొద్దుండంగ యిల్లుచేరరా” మీదికి చెప్పినా. రాజయ్య మాటలు

గుండెల కెలుకుతున్నయి. కొడుకుల లెక్క సూసుకునే రామలచ్చు మనులు కట్టుకొని బండి మీద గూసున్నడు. రోజు వుండాల్సినషల్తి. ఉషారును రామలచ్చుమలు గమనించునయి. ఏందో ఏమో అనుకొని బండియిడిసినంక ఇద్దరినడుమ వుండి గంగడోలు దువుకుంట చెపుతునేడులేన దీమాతో ముందుకు పోతన్నె. బురుదను తొలచే కుమ్మరి పురుగులా తొలుచుతున్నా. ఏమి బురద అంటుకోనట్లు, ఆలోచనలు తిరుగుతున్న ఏది ఆచరించాల్నో సమజయితలేదతనికి. భర్తదించిండు. ఎడ్లకు గడ్డిసదిరి నల్లకాడ్కి పోయితిందామంటే తిండి తినాలని అనిపించుట్లేదు. మనసు మనాదిగా మారింది. ఎడ్లకు గడ్డిసదిరి అర్తిలకిపోయి ఏది ఏం ధరపోతున్నదో తెలుసుకుందామని పోతుంటే కొమురెల్లి కొమురయ్య కొడుకు రమేష్ ఎదురయిండు.

"అల్లుడా నీ వంతులవడ్డది చీటి. మీయయ్య ఎటువోయిండు? మీయయ్యకు గింత కూడా అర్కకు (ముందుటికయ్యే బరువు) కానియ్యరు ల్యావ (వెనుకకు అయ్యే బరువు)కు గానియ్యరు..." అన్నమాటకు రమేష్

గుడ్లల్ల నీళ్లుదిరిగినయి. ''మామా మానాయనకు కదుపునొప్పిలేసింది. భాస్కరావు దావఖాన్ల చేరీక్ చేసినం. ఇయ్యాల్ల ఆపరేషన్ జేత్తరట. సూదీ అంటెనే భయపడేటోడు. ఎట్ల తట్టుకుంటాడో ఏమో మామా.." అని ఏడుస్తండు.

"ఊకో బిడ్డా ! ఊకో ధైర్యంగా ఉండాలే. నువ్వే ఏడిస్తే ఎట్లనయా? ఎంతమందికి అయితలేవు అపరేషన్లు. ఇంతచిన్న విషయానికి చిన్నపిల్లగాని తరీక ఏడుస్తన్నావు? ఏడవకు ఏడవకు'' అని ఓదార్చిండు. పొమ్మని దీరచెప్పిండు.

ఊశయ్య హృదయంలో దుఃఖం నిమిషానికి వంద కిలోమీటర్ల వేగంతో తన్నుకొస్తంది రేపటి గురించి నాకేమన్నా అయితే ఎవలు చూయించుతరు. ఎవలు తిరుగుతరు. పైసలు తాపి తినవెడుతయా? పైసలు చేయని పనులను మనుషలే చేస్తరు. మంది ఎందుకు చేస్తరు' ఊర్లోల్ల అలికిడి విని భుజమీ్మది తువ్వాలుతో కండ్లు తుడుసుకున్నడు. తెరలు తెరలుగా ఎగురుతున్న బాధలను మనసులోనే పూడుచుకున్నడు. గరళ కంఠుడై గాలిలో తేలిపోతున్నడు. తుంటరి ఆలోచనల ముందు తూలిపోతున్నాడు.

పంతుల్నడిగింద్రు, మంచిదినం జూసి సుక్కురారం నాడు ఇంట్ల తోలుకొమ్మన్నడు. ఊశయ్య ముత్యాలు దగ్గరి సుట్టాలకు చెప్పి పిలిపించుకున్నరు. అప్పటికే ఈరవ్వ తల్లిదండ్రులు కూడా "సరే" అని ఒప్పుకున్నరు. ముత్యాలు పొంగిపోతంది మురిసిపోతంది. నా కడుపున పుట్టకున్న నా సమితికి పుడుతరని సంబురపడుతుంది. ముత్యాలు సంతోషాన్ని జూసి ఊశయ్య ఉప్పొంగిపోతండు. మరోవైపు ఊశయ్యకు' ముత్యాలును, ముత్యాలు బతుకును ఆదరించే ఆప్యాయతలు, అనురాగాలు అంతకు దూరమయి పోతయనుకుంటండు. ఇగున్నారం కాడ ఊరంత తూతూ అని ఇజ్జతి పోయినకాడ ఈరవ్వకు యిపుడు రంగుల కల కనపడుతున్నది. అన్నీ మనమంచికే నని ఒకానొక దశలో నిందకు బొందల దూకాలని అనుకున్నపుడు ఎవరో చెప్పిన ఓదార్పు మాటలు యిపుడు నిజమే నని అనిపిస్తున్నయి. భయపడిన బతుకు నుంచి భయపడని బతుకు దొరికిందనీ, తల దించుకున్న జాగల తల ఎత్తుకున్నట్లుగా తోచింది. చీత్కార చీకట్ల నుంచి సత్కార వెలుగు రేఖలు వెదజల్లాయనీ, సంతోషముతో సంస్కారముతో సంసారం చేయాలని నిశ్చయించుకుంది. మెల్లగా వెళ్లి ఏర్పడకుంట ముత్యాలు కాళ్లమీదపడి పంతతో పాదాలు మొక్కింది. "కొత్త జన్మనిచ్చిన తల్లివి" అని అంటున్నపుడు, "ఛీఛీ ఎందుకే చెల్లే కాళ్లు మొక్కుతున్నావ్? లెవు లెవు ఒట్టి మనిషివన్న కాదు" అని ముత్యాలు చేయిపట్టి లేపింది. కన్నీళ్లను తన కొంగుతో తుడిచి "నీకు నేనున్న ఈయ్యాల్లటినుంచి ఏం ఫికర్ లేదు" అని భరోస మాటలు పలికింది. పెనిమిటి ఊశయ్య దగ్గరికి ఊరవ్వ పట్టుకుపోతుంది. ముత్యాలు. అప్పటికే తనూ పోవాలనుకుంది. కాళ్లు మొక్కేందుకు వంగుతుంటే వద్దని ముత్యాలే వారించింది.

ఊశయ్య ఒక చిరునవ్వును వదిలిండు. సిగ్గుతో ముడుచుకపోతూ పెదాలపై చిరునవ్వులని వినురుతూ చూపు వయ్యారాలతో సయ్యాటలాడుతుంది. అత్తింటి వారి మనసుల్లో, తన రూపును గుణగణాలను తర్ఫీదులాగా ముద్రించినది.

ఈరవ్వను ఈరమని చేసింది ముత్యాలు. బిడ్డలెక్క చూసుకుంటది. 'మనెవ్వ' అని పిలుస్తుంది. ముత్యాలు సంతోషం చూసి ఈ మాత్రం సంబూరం ఉంటే సాలనుకున్నడు ఊశయ్య.

మనెవ్వను చంటిపిల్లను పొదన చేసినట్టు చేస్తంది. యాల్ల తప్పుకుంటపాలు. బువ్వ అన్ని లెక్క తర్వాయి కొద్దీ చేస్తంది. "శావంగాలు దంటవా? చేస్తా. బెల్లం బువ్వ వండన్నా పూస వొత్తన్నా గారెలు చెయ్యన్నా? గర్జెల్ తినాలనిపిస్తుందా? ఏమనుకోకు. ఎడ్డిర్కం పెట్టుకోకు. యిది మనిల్లు. ఏది తినిలనిపిస్తే అది కావాలని అడుగు. అన్ని బావతెస్తడు. బావతోటి తెప్పిస్త. నేను చేసేటిని చేస్త. బాయికాడ కోతమావిడి, కలెమావిడిపండ్లు, జామపండ్లు ఏ పండ్లు తినాలని అనిపించినా? ప్రాణం కొట్టుకున్నా నాకు చెప్పు. బావ ఎట్లాగో అరటిపండ్లు, సేపులు సిద్దిపేట్ల దినము తప్పించి దినం తెస్తడు..." అని చిట్టా చదువుతుంది ముత్యాలు.

"సరే అక్కా ! యిపుడే అన్నం తిన్నకదా? తింట, తాగుత, తినబుద్ధి అయ్యే టివి చెప్పుత.." అని అన్నది. ముత్యాలసరే అన్నది.

రోజు రోజుకీ ముత్యాలు పనిమనిషి అవతారం ఎత్తుతుంది. ఈరమని గల్లరగల్లర మాట్లాడుతుంది. పకపకనవ్వుతుంది. వొచ్చిపోయేటోల్లతోటి ముచ్చట్లు వెడుతుంది. ఒక్కపిల్లను కనకముందే పదిమందిని కన్నోళ్లకు పోతపోత్తంది. వాళ్లమాటల మీద తనుపై పూతలు పూస్తంది. ఓపికతో భరిస్తుంది ముత్యాలు. తలుపు పెట్టి చెప్పితే కొలుపుపెట్టి యింటున్నట్లుగా వ్యవహరిస్తుంది.

ఊశయ్య బాయి నుంచి వచ్చినా, ఊళ్లె నెంచి వచ్చినా వయ్యారాలు ఒలకబోస్తంది. ముత్యాలను ఊశయ్యకు దూరం పెంచాలని చూస్తంది. "బావా ! నాతోటి బుద్ధితీర మాట్లాడరాదూ? ఏంజేస్తవ్‌పోయి. ఇంక జెర్రాగినంక పొదువుతియ్యి. దండం బెడత కాళ్లు మొక్కుత" అంటూ బూరెలా పొంగిస్తంది. మనెవ్వ మాటల సంకెల్లతో ఊశయ్య ఊరుతిరుగుతుండు. ముత్యాలును మనెవ్వను ఇద్దరినీ నొప్పించకుంట తప్పించుకుంటండు ముత్యాలు యింటిపనికి బాయిపనికి విరామంలేని మిషనైంది.

మనెవ్వకు కాలునొచ్చిన వేలునొచ్చిన జండూబాం బెట్టి, ఆప్యాయతలు చిలుకరిస్తూ బాదల్ని మాయంజేస్తండు. పండ్లు పలాల తోటి కడుపు నింపుతండు. ఇదంత గుర్తెరిగిన ముత్యాలు ముందే ఊహించింది. కాలం గడిచిపోతుంది. మనెవ్వకు ముత్యాలు సీమంతంజేసింది. కంటిపాపతరీక చేసుకుంటుంది. నెలలు నిండినయి. నొప్పులు వుడితే సిద్దిపేట నుగుణ దావఖాన్లకు యేనుకపోయింద్రు. డాక్టర్ నుగుణ అబ్జర్వేషన్లపెట్టింది. బాగా ఆలోచించింది. టైం మించిపోతున్నా పనిద్ద కాకపోవడంతో కంపోండర్‌తో చెప్పంపింది.



ముత్యాలు ఊశయ్య ఇద్దరు డాక్లర్ దగ్గరికిపోయింద్రు

"మనెమ్మ నీ భార్య నేనా?"

"అవునమ్మా..."

"నొప్పులు యిట్లనే వుంటే పెద్దాపరేషన్ జేయాల్సివస్తది, ఏమంటవ్? గాందికి పట్నం రాయల్నా"

"వొద్దొద్దు నాటి నుంచి మిమ్మల్నే నమ్ముకున్న మీరే ఎట్లయినా చేయింద్రి తల్లీ పిల్లా మంచిగుండాలె అమ్మా" అన్నడు ఊశయ్య

"ముత్యాలు ఇటు డాక్టర్ మొఖం అటు పెనిమిటి మొకం చూస్తంది"

"ఏ అమ్మా పెద్దాపరేషననంగనే బేరిపోతున్నవు నువ్వేంగావాలే మనెమ్మకు?"

"నేను అక్కను...." అని అంటున్నపుడు

"చేయింద్రమ్మా పెద్దాపరేషనే చేయింద్రి పాణాల్ మంచిగుండాలె గంతే..." అని ఊశయ్యన్నాడు.

"ఏయ్ సిస్టర్స్ థియేటర్ రడీ చేయంద్రి, కమాన్ క్విక్' అంటూ ఆర్డరిచ్చింది డాక్టరమ్మా. ఒకవైపు కంపోండర్లు ఆపరేషన్‌కు సిద్ధపడుతుంద్రు. ఒక ఆలోచన మెరుపులా మెరిసింది. ముత్యాలుకు పిడిసుట్టు కట్టుకొని దబాదబా మనెవ్వ దగ్గరకొచ్చింది. మనెవ్వ పిట్టోలే నోరు దెరుసుకుంట తండ్లాడుతుంది. మెరిసిన ఆలోచనను ఆచరణలో పెడుతంది.

"నొప్పులు దియ్యి దియ్యి..." అని సుట్టూ ఉన్న ఆడోళ్లు పురికొల్పుతున్నరు.

మనెవ్వ నెత్తి యెంట్రుకలు యిప్పి గొంతికలకు దోపి దిబిళ్లుమని గులుకోసుస్టాండ్ ఎత్తేసింది. భయానికి ఒక్కటే ఒక్క కేకేసింది మనెవ్వ. ఏందో సప్పుడయిందని కంపాండర్లు తలోదగ్గరున్నోళ్లు ఒక్క దగ్గరికి ఉరికి వస్తుంద్రు డాక్టర్ కూడా ఉలిక్కిపడి ఏందో తెలుసుకుందామని కాలింగ్ బెల్‌నొక్కింది.

క్యావ్, క్యావ్ క్యావని నవజాత శిశువు ఏడుపు.

ఒగనర్సు డోరు దీసుకుంట డాక్టర్ రూంలకు ఎగపోసుకుంట వచ్చి ఆదర్దాతోటి ఆగింది"

"ఏమయింది? ఏంటాసపుడు?" డాక్టర్ ప్రశ్నల వర్షం

"మేడమ్ మనెమ్మ పేషంట్ నార్మల్ డెలివరీ, మొగపిలగాడు పుట్టిండు"

''అయ్యో! మనం పెద్దాపరేషన్ జేద్దామనుకుంటిమి గదా"

"అవును మేడమ్ కానీ ఆలోపే ఇలా" అని క్వశ్చన్ మార్క్ పేసుతో నర్సు

"ఏది చూద్దాం పా..." ఇద్దరు నడిసింద్రు. స్టెత్‌తో పునికి తల్లీ పిల్లా ఆరోగ్యం బాగానే వుందని నిర్ధారణకొచ్చి "శబ్బాష్" అని మెచ్చుకొంది ఏమన్న జరుగరానిది జరిగితే ఎవల్నంటరు. యిలాంటి మోటు వైదుగాలు ఇంటికాడ చేయించుకోవాల? మనిషివా పశువా? ఆడిదాని రీతిలేదేమే నీకు? నువ్వుకనలేదా?" అని నానా బూతు మాటలు తిట్టింది. "చివర్లో మంచే జరిగిందిలే..." అంటూ క్లీన్ చేయమని చెప్పి కన్సల్టేన్సీ రూంలకు పోయింది.

ఊశయ్య ముత్యాలుకు మురిపెం కిరీటం పెట్టుకున్నట్లున్నది. అంతమంది దేవుళ్లకు మల్లొగసారి ఒగొలకు తెలువకుంట ఒగలు మొక్కుతంద్రు. మొక్కులన్ని చెల్లిస్తమని హామీలైతంద్రు. పెద్దసందడి చేసుకుంట ఇరువ యొక్కటోరోజు వొచ్చింది. చుట్టాలు బంధువులతో నిండిపోయింది. ఆయిల్లు. ముత్యాలుకు రికాంలేదు. శమధర్మంలేని మనెవ్వ ముత్యాలును, ముత్యాలు నుంచి అలుసుగా చేసుకొని సూటిపోటి మాటలతో గుంపిస్తుంది. తొక్కుడు బండకున్న ఓపికతో ముత్యాలు భరిస్తుంది.

కేవ్..కేవ్ అని ఒక్క తీరుగ ఏడుస్తున్న పిల్లోన్ని తెచ్చి పొదుగుకు అనిచ్చి పాలియ్యిమంటే బండెడుకోపమైతంది. తిట్టిన మాటలకు ముత్యాలు చెవిటైదైంది. అందరి సుట్టాలనడ్మ "రాజూ.." అని పిల్సిండు నాయిన. కట్నాలు వరదలా వచ్చినై. మూన్నెల్లలోపు. కొమ్రెల్లి, యాదగిరిగుట్ట, యెములాడ, మొక్కులు చెల్లించుకుంద్రు.

ఊశయ్య బరువు దిగింది. ఇంటికాడ బాడుగ బండి యిడువంగనే ఎడ్లు గడ్డివాము మీదికి గొలెంల సుబ్బురంగా కాల్రెక్కలు కడుక్కొని తినెందుకుపోవు. ఊశయ్య రాకడను చూసిన ముత్యాలు ఎస్సైముందు కానిస్టేబుల్ లాగా భయపడుతుండె. సీను రివర్సైంది. కొడుకు పుట్టిన కాన్నుంచి ఎంతన్నా ఆకలిగాని, పొద్దుటి నుంచి మెతుకు తినకపోని బండి యిడువంగన్ కొడుకు దగ్గరికి వస్తండు. కొడుకును సూడంగానే ఆకలి మరిసిపోతడు. తినమనంగ తినడు. రాజు తండ్రి మాటలకు నవ్వుతడు. నవ్విస్తడు. ఆడుతడు ఆడిస్తడు. ఊశయ్య యిపుడు కొడుకుతో బాలకుడు అయి ఆడుతడు. ఊశయ్య నోరుమూసి నాలుకను తీసి చూపుతడు రాజు అందుకోబోయె వరకు లోపలికి తీసుకుంటడు. పిల్లవాడితో పిల్లవాడి తరీక ఆడుకుంటడు. చేసే పనిని మరిచి వాయిదాలు ఏసుకుంటండు. "పనికి పొద్దుపోయింది" అని గుర్తు చేసే ముత్యాలు మీదికి ఉరుముతండు. నోరు తెరవనిస్తలేడు. రోజువారిగా చిన్నోనికి తినవెడుతడు. నీళ్లు తాగించుడు ఇట్లా ఆడవాళ్లను కాదని తను ఉన్నప్పుడు తనే చేస్తుండు. ఇట్లా రోజులు గడుస్తున్నై. సర్ది అయినా జరమొచ్చినా తల్లడిల్లిపోతడు ఏడిస్తే భరించడు. ఎవరినైనా సరే ఊరుకోడు. ఆరునెలల వయసు దాటింది. ఒకరోజున రాజు విపరీతంగా ఏడుస్తుండు. "అరే ఏమయిందిరా! అయ్యయ్యో! అగో కాకి రోకలి ఎత్తుకపోయిందిరా. ఎంతపనైపాయెరా! నిన్నెవలు సూత్తలేరా బిడ్డా, ఛోఛో..." అంటూ లాలించేసరికి అప్పట్దాక ఏడిసెటోడు ఊరుకున్నడు.



"అమ్మే వస్తుంది. వచ్చె వచ్చె..." బుజ్జగిస్తూ

"మనెవ్వా ! ఓ మనెవ్వా ఏం జెస్తన్నవు చంటోని ఏడుపు వినిపిస్తలేదా? ఇంట్ల ఏం జేస్తున్నవు?" అని ఊశయ అరచిండు.

"ఓ... వత్తున్న వద్దామనెవరకే నువ్వు అందినవు" అనుకుంటూ చేతులప్లేటు పట్టుకొని ఎంగిలి చేత పట్టుకొని వచ్చింది.

ఎత్తుకుని తినకపోయినవు. నీ తినుడు అమ్మగాను. పోరడు ఊపిరి వట్టిండు. ఎనుకసిరి తినకపయినవు. కడుపు పీక్కపోతుందా? పిడచకట్టుకపోతుందా?" ఏడవంగా ఎట్లపోతుందే తిండి మల్లగిట్ల జేసినవో మర్యాదదక్కది..." ముత్యాలు మీదికి కాలుదువ్వినట్లు తనకోపాన్ని మనెవ్వమీదికి చిత్తిండు.

గంతె కాలుకాలిన పిల్లిలా యిని రాకుంట లోపట లోపట్నే "మరెసరి బుద్ధి లెక్క మాట్లాడకు రానిపోని మాటలకేం మత్తుగున్నయి" అని అన్నది ఈరమని. ఇనిరాకుంట అన్నప్పటికీ ఊశయ్యకు యినవడింది. పంజీలల్లపంజి. ఆవలింపుదీస్తే పేగులు లెక్కలెడ్తడు గసోంటి వాడు ఎందుకు యిట్లనే ఆలోచనలపడ్డడు. అదే ముత్యాలయితే ఏమనకపోవు ఎన్ని తీర్ల తిట్టినా "తిట్టినవుగని ఊకో తిట్టెతందుకు ఉషారు. భూమలింగం శేటు బొరోలో నోరు వెంచినవు ఊ" అంటుండే "ఈరమని ఏమన్న" ఏడిసేపోరన్ని ఎత్తుకొని ఊకుంచకపోయినవు అన్నగంత గిట్లనే నన్ను" అని నారాజుల పడ్డడు ఊశయ్య,

మల్లొక రోజు రాజు అదే పనిగా ఏడుస్తుండు. ఏడుపుని పట్టించుకోకుండా టీవిల మునిగిపోయింది ఈరమని. ముత్యాలు చూసి ఎత్తుకొని వీపు నిమురుతూ ఓదార్చింది. "ఆచ్ పిట్ట..." అని పాట యెత్తింది. ఊరుకున్న తర్వాత నిద్దురలోకి జారుకుంటున్నపుడు మెల్లగ మనెమ్మస్తుంటే మాలోకం కొద్దీ తీసుకుంటుంది ఈరమని, "మనెవ్వ..మనెవ్వా.." అని పిలుస్తుంటే యినిరానంతగా టీవిల మునిగింది. కోపంతో ముత్యాలు "టీవి మీదున్న పట్టి పోరని మీదుండాలె. ఎన్నితీర్ల ఏడుకుంటే పోరడు ఎదుగుతడు. యాల్లకు తినవెట్లాలె. ఏడవంగనే నీళ్లుపాలు తాపాలే... మనసెరిగి మసలుకోనాలె... ఏం రీతిది ఏడిసినా పట్టించుకుంటలేవు.. మనిషినైతే ఒక్కసారి చెప్పితే మరవకుంటవు.. అనుకుంట యిస్తంది.

ముత్యాలు చేతుల నుండి ఊశయ్య తీసుకొని పడుకున్నోన్ని ఎత్తుకున్నడు ముద్దాడుకుంటూ మురిసిపోతున్నడు. పసిబుగ్గలు గిల్లుతూ పరవశించిపోతున్నడు. ఎప్పుడు పన్నవురా బంగారుకొండ పనిచేస్తే నీకాళ్లు రెక్కలు అలసిపోయినాయిరా తండ్రీ.." అనుకుంటూ తన్మయత్వ సంద్రంలో తేలిపోతున్న మనసు తెరలకు మాట రాళ్లు తాకుతున్నె ఈరమని రూపంలో

ముత్యాలు మీద ఎన్నటి నుంచో మసులుతున్న కోపాగ్నిగా కురుస్తుంది. "అవును నొప్పులు దీసి కన్నదానవైతివి. నీ అంత తెలుస్తదా నాకు. రోజు నువ్వు చెపుతనే గద నేనుజేసేది. నువ్వు నలుగుర్ని పెంచిన దానివైతివి. నీకెరుకున్నని నాకేం ఎరుక...." అని వ్యంగ్యంగా తిడుతున్న మనెవ్వ మాటలు ముత్యాలును ఊశయ్యను కత్తిపోట్లయి దాడిచేస్తున్నయి.

"ఏం మాట్లాడుతున్నవ్? ఏమోలవునీలుగుతున్నవు? నీది నోరా...? మోరా? అన్నం తింటన్నవా? అశిద్దం తింటన్నవా? నోరుకు ఏదొస్తే అదేనా మాట్లాడుడు గుంజి పట్టుడు లేనాలేదా? తీరిక తప్పి మాట్లాడొద్దు..." ఎన్నడూ కోపాన్ని రాని ఊశయ్య ఉరుముతండు. చేతులున్న కొడుకు ఉల్కిపడుతడనే మరో ఆలోచన లేకుండా...

ఈరమని ఈరగోల అందుకున్నట్లు చెడ్డమాటలు రెట్టించింది.

"వడ్లల్లదే బియ్యపుగింజ. ముద్దాడవడితివి మురవవడితివి. రాజు, బూజు, కొండా., యెండీ ఎన్నెన్నో అనవడితివి. ఎక్కువ తక్కువ వొర్రేదిలేదు. నోరుమూసుకుంటే ఏమీలేని యిత్తారు ఎగిరెగిరి పడ్డదట. వాన్ని నువ్వే కంటివా? నీకే పుట్టిండా??? గురితప్పని బాణమై గుండెలో గుచ్చుకుంది. కొడుకుగాని కొడుకును మరోసారి ముద్దాడి ఊశయ్య లేచిండు....???

◆

# నదులు

సవాలక్ష పేర్లతో నదులారా నేను మిమ్మల్ని కీర్తిస్తున్నాను
పాలు, తేనే, ప్రేమ, చావు, నృత్యం అన్నీ మీరే
గుహల నుంచి, శృంగార మండపాల నుంచి ఉప్పొంగి
పాకుడు రాళ్ళ నుంచి దూకుతూ
గొణుగుతున్న గులకరాళ్ళని అట్టడుగున అదిమిపెట్టి
వన దేవత తన పాత్ర నుండి వొంపుతున్నట్లు జీవజలం
పచ్చిక బయళ్ళ మధ్య నుంచి స్వచ్ఛంగా పారే ప్రవాహాలు మీరు
మీ జాతి మాజాతి ఒక్కచోటే ప్రారంభమయ్యింది
వేగవంతమైన ఈ నాగరిక నదీ ప్రవాహంతో-
నీటిలో మునుగు మునిగి, నా నగ్న ముఖారవిందాన్ని
సూర్యుడి వైపు తిప్పుతాను
ఓక్ అడవులు, పొలాలు, దేవదారు వనాలు
ప్రతి మలుపులో భూమి చేస్తున్న లక్ష వాగ్దానాలు
గ్రామాల పొగ, నిద్రిస్తున్న పశువుల మందలు
ఇసుక గట్ల మీద విహరిస్తున్న భరధ్వాజ పక్షులు... ఎన్నెన్నో
నేను నీ జలాలలో మెల్లమెల్లగా అడుగు కింద అడుగేస్తూ దిగుతాను
ఆ నిశ్శబ్దంలోని విద్యుత్తు నన్ను మోకాళ్ళదాకా తీసుకుపోతుంది
నన్ను నేను అర్పించుకునే వరకూ అది అలా తీసుకువెళుతూనే ఉంటుంది
మధ్యాహ్నపు తీవ్రతలోంచి, విశాలమైన ఆకాశపు ప్రతిబింబంలోంచి
నేను హాయిగా ఈదుతాను
ఒకానొక వేసవి అర్ధరాత్రి నేను నీ ఒడ్డునే ఆడుతున్నాను
నిండు పున్నమి చంద్రుడు గిరగిరా తిరుగుతూ బయటికి వచ్చి
చుంబన మహోత్సవంలో తన నాజూకు పెదవుల్ని జతకలిపాడు
బోటుహౌస్‌తో తపతప కొట్టుకుంటున్న
నీటి సవ్వడి నేను నాలోనే వింటున్నాను
ఆ సవ్వడి గుసగుస లాడుతూ నన్ను పిలుస్తూనే ఉంటుంది
ఒక కౌగిలి కోసం, ఒక స్పర్శకోసం, ఒక ఓదార్పు కోసం
మునుగుతున్న నగరాలన్నింటిలో హోరుమని గంటలు మోగిస్తూ
మేం పరుగెడుతూనే ఉంటాం... మేం ప్రవహిస్తూనే ఉంటాం
చెప్పడం మరిచాను,
మరణించిన రాయబార కార్యాలయాలన్నింటి నుంచీ
మాకు ఆహ్వానాలందాయి
కాని, ఆగడమంటూ ఎక్కడాలేదు
నిరంతర ప్రవాహాలు మమ్మల్ని ముందుకు
ఇంకా ముందుకు తీసుకువెళుతూనే ఉన్నాయి
ప్రయాణం ఆద్యంత రహితమైంది, అనంతమైంది.



**క్రిస్‌లా మిలోజ్**

(నొబెల్ పురస్కార గ్రహీత, అమెరికన్ కవి క్రిస్‌లా మిలోజ్ పోలెండ్‌లోని లిథుఆనియాలో 1911లో పుట్టాడు. కవి, నవలాకారుడు, వ్యాసకర్త అయిన మిలోజ్ రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో అజ్ఞాతంగా ఉంటూ నాజీలకు వ్యతిరేకంగా ఉద్యమం సాగించాడు. చాలా ఏళ్ళు దౌత్య సంబంధమైన శాఖలో పనిచేయడం వల్ల, కొత్త ప్రభుత్వంతో సత్సంబంధాలు కొనసాగలేదు. ఫలితంగా దేశ బహిష్కృతుడయ్యాడు. చివరిదశలో అమెరికాలోని బర్కిలీలో స్థిరపడి, కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో బోధన చేపట్టాడు.

మేధోశక్తి, యుద్ధానంతర పోలీష్ కవిత, ఒక నిర్వచనం కోసం అన్వేషణ, ఎన్నిక చేసిన కవితలు 1954-1973 మధ్య వెలువడిన కవితా సంపుటాలు. సుదీర్ఘమైన పోలిష్ సాహిత్య చరిత్రను ఈయన 1969లో గ్రంథస్థం చేశాడు. కవిగా సాధించిన ఔన్నత్యానికి 1978లో Neustadt అంతర్జాతీయ బహుమతి 1980లో సాహిత్య నోబెల్ పురస్కారమూ లభించాయి. కార్యకర్తగా, ఉద్యమకారుడిగా, బోధకుడి, కవిగా వివిధ పార్శ్వాలతో జీవితపు అంచులు చూసిన క్రిస్‌లా మిలోజ్ వ్యక్తిగా కూడా మహోన్నతుడు. ఉవ్వెత్తున లేచిపడే ఆయన కవితా ప్రవాహానికి ఇదొక చిన్న ఉదాహరణ.)

అనువాదం, పరిచయం

**డాక్టర్ దేవరాజు మహారాజు**

# "అడవి" గిరిజన జీవన చిత్రణ

మాచీడి సంతోష్‌గౌడ్
✆: 9885772403



**ఆదిలాబాద్ మాండలికంలో, ఇంద్రవెల్లి పరిసర ప్రాంతాలలోని గిరిజనుల జీవితాలను చిత్రించింది ఈ నవల. గిరిజనుల ఆచార వ్యవహారాలు, కట్టుబాట్లు, సంస్కృతి. సంప్రదాయాలతో పాటు, దోపిడీ వ్యవస్థ, గిరిజనుల పోరాటాలు, ప్రకృతి వర్ణనలతో సహజ సిద్ధంగా ప్రతి సన్నివేశం కళ్ళకు కట్టినట్లు చక్కగా చిత్రించబడింది. అందుకే ఈ నవల 1988 చతుర నవలల పోటీలో మొదటి బహుమతి పొందింది. ఆ తర్వాత రచయిత నెరేషన్ మార్పుతో 1996లో విశాలాంధ్ర వారు ముద్రించారు.**

తెలుగు సాహితి ప్రక్రియల్లో కెల్ల వాస్తవమైన ప్రజాజీవిత చిత్రణతో వచ్చిన నవలలు చాలా తక్కువ. సహజత్వంగా, ప్రజాజీవితాన్ని ఇతివృత్తంగా స్వీకరించి వచ్చిన నవలలు అరుదు. అటువంటి వాటిలో ఎన్నుకోదగినది వసంత రావు దేశ పాండే "అడవి" నవల. 1981 ఏప్రిల్ 20న 'ఇంద్రవెల్లి"లో జరిగిన యదార్థ సంఘటనను ఆధారం చేసుకుని, సహజంగా, ఆదిలాబాద్ మాండలికంలో, ఇంద్రవెల్లి పరిసర ప్రాంతాలలోని గిరిజనుల జీవితాలను చిత్రించింది ఈ నవల. గిరిజనుల ఆచార వ్యవహారాలు, కట్టుబాట్లు, సంస్కృతి. సంప్రదాయాలతో పాటు, దోపిడీ వ్యవస్థ, గిరిజనుల పోరాటాలు, ప్రకృతి వర్ణనలతో సహజ సిద్ధంగా ప్రతి సన్నివేశం కళ్ళకు కట్టినట్లు చిత్రించబడింది. అందుకే ఈ నవల 1988 చతుర నవలల పోటీలో మొదటి బహుమతి పొందింది. ఆ తర్వాత రచయిత నెరేషన్ మార్పుతో 1996లో విశాలాంధ్ర వారు ముద్రించారు. ఈ నవలలో ప్రధానంగా దోపిడికి ప్రతిరూపంగా షావుకారి రాఘవులు, తరతరాలుగా అణచి వేయబడిన గిరిజనుల యొక్క చైతన్యానికి ప్రతీకగా జంగు. వీరనారిగా, భార్యగా, తల్లి, అక్కగా, దేవుబాయి, జంగ్లాత్, అబ్కారి వారి ఆరాచకాలకు ప్రతి బింబాలుగా సోము, మోతిలతో పాటు నమ్మిన సిద్ధాంతానికి కట్టుబడి, తన వారికొరకు ప్రాణాలు అర్పించిన పోరాట యోధుడు 'కొమురంభీం' వంటి విశిష్ట పాత్రతో ప్రతి సన్నివేశం సహజంగా కనిపిస్తుంది.

ఇక నవలలోనికి వెళ్తే అందిన సమాచారంతో అడవినంతా గాలిస్తారు పోలీసులు అంటూ ప్రారంభమవుతుంది. విధి నిర్వహణలో భాగంగా. నాలుగు జీతం రాళ్ల కొరకు దట్టమైన అడవులలో, ఎత్తైన కొండలలో ఎలా గాలిస్తారో పోలీసుల యొక్క మానసిక సంఘర్షణను తెలియజేశాడు రచయిత. ఉదయం నుంచి అర్ధరాత్రి వరకు గాలించి ఏ సమాచారం దొరకకా తిరుగు ప్రయాణం పడతారు. వచ్చే దారిలో కచ్చా రోడ్డుపై, బాటదారి పక్కన అప్పుడే మోటర్ సైకిల్‌పై నుంచి దిగిన ఒక యువకున్ని అనుమానస్పద మనిషిగా అరెస్ట్ చేసి టౌన్ పోలీస్‌స్టేషన్‌కు తీసుకెళ్తారు. ఆ యువకుడు పేరు డా. సిద్ధార్థ ఎం.బి.బి.ఎస్. ఎమ్‌డి. గిరిజనుల జీవితాలపై రిసెర్చ్‌కు వచ్చిన ట్రూప్‌లో ఒకడు. తిరిగి వెళ్ళక ఇక్కడే గిరిజనులకు ఉచిత వైద్యం చేస్తూ వుంటాడు. ఇతను గొంతువాపు వ్యాధి గుర్తించి పత్ర సమర్పణ చేసినందుకు ప్రభుత్వం బంగారు పతకం ఇస్తుంది కాని నివారణ మాత్రం చూపించదు. అందుకే కొండ ప్రాంతంలోని గిరిజనులకు వ్యాధి నివారణకు గాను ఆయోడైజ్‌డ్ ఉప్పు అందిస్తు వుంటాడు. ఇంటరాగేషన్ అయిపోయాక అతన్ని వదిలేస్తారు.

గిరిజనులంతా కూడి సభ జరుపుకోవడానికి అనుమతి కోరుతూ ఎస్.పి కి అర్జీ పెట్టుకున్నారు. అనుమతి వస్తుందన్న నమ్మకంతో అన్ని ఏర్పాట్లు చేసుకున్నారు గిరిజనులు. ఆరోజు 1981 ఏప్రిల్ 20 ఇంద్రవెల్లి ప్రాంతంసభ జరిగేచోటు. తుకారాం, దేవుబాయి, జంగు, అతంసోము, రాము మరికొంత మంది గిరిజనులు అందరూ ఒక్కరొకరుగా సభ జరిగే చోటుకు వస్తున్నారు. కొద్ది సేపటకే చుట్టు ప్రక్కల పల్లెల నుంచి కొన్ని వేలమంది జనం పొగయ్యారు. అనుమతి పేరుతో పోలీసులు అడ్డుకుంటున్నారు. ఎలాగైనా సభ జరుపుకోవాలని గిరిజనులు, ఆపాలని పోలీసులు లాఠీచార్జిలతో ఆ ప్రాంతమంతా రణ రంగంలాగ మారుతుంది. గిరిజనుల గుండెల్లో ఎంతో తెగువ పోరాటం కన్పిస్తున్నాయి. వారి గుండెల్లో పెల్లుబికిన ఆవేశం కొన్ని వందల సంవత్సరాలుగా ఎప్పటి నుండో రగులుతుంది. అప్పుడు దేశాన్ని బ్రిటిష్ వారు, తెలంగాణను నైజాం పరిపాలిస్తున్న రోజులు. పూర్వమే వచ్చి దుకాణం పెట్టి 'ఇంద్రవెల్లి'లో స్థిరపడిన దూరపు బంధువైన విఠల్‌సేఠ్ దగ్గరకు బతుకు తెరువు కొరకు షావుకారి రాఘవులు వస్తాడు. ఏమి కావలన్నా చుట్టు ప్రక్కల ఊర్లన్ని ఇంద్రవెల్లికే వచ్చి కొనుక్కోవాలి. విఠల్‌సేఠ్, బండినిండా సామాన్లు ఇచ్చి ఒక మనిషితోడుగా పంపి చుట్టు ప్రక్కల పల్లెల్లో ఎక్కడ దుకాణంలేని "పిట్ట బంగారం" ఊరికి పంపుతాడు. దుకాణంలేని ఆ ఊరిలో దుకాణం తెరుస్తున్నారనే సంతోషంతో ఆవూరు పెద్ద మోకాసి రామరావు స్థలం చూపించి

రాఘవులతో దుకాణం తెరిపిస్తాడు. ఎవరికి కావలసిన వస్తువులు వారు, తమ వద్ద ఉన్న సారపప్పు, పత్తి, నూలు వంటివి ఇచ్చి తీసుకెళ్తున్నారు. క్రమంగా 4 వంతులకు 1 వంతు ఇస్తూ పొట్ట చేతపట్టుకుని వచ్చిన షావుకారి లక్షలు గడిస్తాడు. కాల గమనంలో మోకాసి రామారావు పాముకాటుతో మరణిస్తాడు. రామరావుకు 17 సం॥ల దేవుబాయి అనే కూతురు, 10 సంవత్సరాల సోము అనే కుమారుడు ఉంటారు, తండ్రి మరణంతో అనాథలుగా మిగిలారు. అతను 200 ఎకరాలకు ఆసామి. కాని సాగులో వుంది 20 ఎకరాలు మాత్రమే. తండ్రి మరణంతో బాధలో వున్న దేవుబాయికి ఇంతలోనే తాసీలు అధికారులు ఊర్లోకి వచ్చారు. అందరిలాగే తాసీలు కట్టడానికి తమ్మునితో కలసి వెళ్ళిన దేవుబాయిని చూసిన తాసీలు అధికారి ఆమెపై అత్యాచారం చేయబోతాడు. ఆత్మాభిమానం గల దేవుబాయి ప్రతిఘటించి తనను తాను రక్షించుకుంటుంది. దాని ఫలితంగా ఉన్న 200 ఎకరాల భూమిని తన జిత్తులమారితనంతో పటేల్ చేతచిక్కించుకుని ఊర్లో పెద్ద మనుషులుగా చెలామణి అవుతున్న షావుకారి రాఘవులు, వంటి వారికి కట్టబెడతాడు. అనాథగా మిగిలిన దేవుబాయి తనను ప్రేమించిన జంగును వివాహం చేసుకుంటుంది. ఒకరోజు జంగు వేషం వేసుకుని పక్క ఊరికి వెళతాడు. తమ్ముడితో గుడిసెలో వున్న దేవుబాయి వద్దకు, వాసనతో పసిగట్టి తమ ఇంటి ముందర బంతిపూల తోటలో గల గంజాయి మొక్కను పీకి తెచ్చి తన తమ్ముణ్ని తీసుకెళ్తాడు. అబ్కారి అధికారి తనను వదిలి పెడ్తడన్న ఆశతో తను గేదెలు కాస్తున్నప్పుడు అడవిలో చూసిన గంజాయి మొక్కలు చోటు చెప్తాడు సోము. అప్పుడు ఆ అధికారి అతి క్రూరంగా గుర్రానికి సోముని తాళ్ళతో కట్టివేసి అడవికి లాక్కెళ్లి ఆ చోటుని చూపమంటాడు. తర్వాత ఊర్లోకి తీసుకువచ్చి అనేక చిత్రహింసలకు గురి చేస్తాడు. తమ్ముణ్ని చూసి ఏమి చేయలేని నిస్సహాయతతో రోదిస్తుంది దేవుబాయి. పక్కవూరి నుండి వచ్చిన జంగు విషయం తెలుసుకుని ప్రాధేయపడతాడు. అయినా కనికరించని అధికారి, థానేసాబ్‌తో కలసి జంగును తీవ్రంగా కొట్టి పక్కన కట్టిపడేస్తాడు. తర్వాత సోముపై వారి చిత్రహింసలు ఎక్కువ చేస్తారు. కడుపులోంచి రక్తం కారుతూ చావు బతుకుల్లో వున్న సోముని రక్షించడానికి జంగు తన తాళ్ళు తెంచుకుని థానే దారును చంపి వేస్తాడు. ఇక్కడ జంగు యొక్క రౌద్రాన్ని గిరిజనుల యొక్క చైతన్యానికి ప్రతీకగా చాలా చక్కగా వర్ణించాడు రచయిత. ఇక్కడ వుంటే తనను బ్రతక నివ్వరని జంగు అడవిలోకి పారిపోతున్న క్రమంలో పక్కనే "బాజ్‌పురి" అనే ఊరు కాలిపోతుంది. అది గమనించిన జంగు అక్కడికి వెళ్ళి విషయం తెలుసుకుంటాడు. అది జంగ్లాత్ అధికారుల యొక్క దురాగతానికి బలైపోతున్న ఊరు. జంగ్లాత్ వారికి ఇది కొత్తేమి కాదు. అంతకు ముందు రోజే 20 కోలామ్‌ల కుటుంబాలు గల "అల్లిపల్లి"లో శ్యామ్‌కొలామ్‌ని చిత్రహింసలకు గురిచేసి అతని కళ్ళెదురు గానే అతని 13 సం॥ మోతి అనే బాలికను అత్యాచారం చేసి చంపి కోలామ్‌ల గుడిసెలను తగులబెట్టి వచ్చారు. జంగ్లాత్ వాళ్లను ఎదురిస్తే కోర్టులు, కచేరిల, కేసులు అంటూ తమ ప్రాణాలు తీస్తారని. అందుకే కోర్టు ఖానూన్ తెలిసిన ఒక చదువుకున్న వాడిని తీసుకువచ్చి జంగ్లాత్ వారి ఆగడాలను ఆపాలని అనుకుంటారు. ఆ చదువుకున్న వ్యక్తి పక్క వూర్లో పటేల్ దగ్గర ఉన్న "కోమురంభీం" అని నిర్ణయించుకుంటారు ఆవూరు ప్రజలంతా. "కొమురంభీం" చిన్నప్పుడే "సిద్ధిఖీ" అనే భూస్వామిని చంపి చాలా ఏళ్ళు పారిపోయి చదువుకుని వచ్చిన వ్యక్తి. కొమురంభీంను తీసుకు రావడానికి ఆ వూరు పెద్దలు కొమురంభీం చిన్నాన్నలు ఐన కుర్దు ఏసులతో పాటు జంగు కూడా వెళ్తాడు. వీరి ఆహ్వానం మన్నించి కొమురంభీం" వస్తాడు. వారి సమస్యలపై, కోర్టులు, కచేరిలు, చివరకు నైజాం ప్రభువును కలిసినా కూడా ప్రయోజనం లేక పోవడంతో "జానెడు పొట్ట కోసం, పిడికెడు మెతుకుల కోసం, అధికారం ముసుగులో సాగుతున్న దోపిడిని" అడ్డుకోవడం కోసం తను ముందు నిలబడి గిరిజనులతో చైతన్యాన్ని నింపుతూ జంగు, కొంతమంది గిరిజన యువకులతో కలసి "జోడెన్ ఘాట్' ప్రాంతాన్ని స్థావరంగా చేసుకుని, భూమికోసం, భుక్తి కోసం ప్రభుత్వంపై తిరుగుబాటు చేస్తాడు. ఆ పోరాటంలో "కొమురంభీం" వీర మరణం పొందుతాడు. జంగు, మిగతావారు అరెస్టు అయ్యి జైలుకు వెళ్తారు. స్వాతంత్ర్యం అనంతరం జైలు నుండి విడులైన జంగు ఇంటి కెళ్తాడు. అప్పటికీ సోముకి వివాహమవుతుంది. కాల గమనంలో దేవుబాయి జంగులకు తుకారాం అనే మగపిల్లవాడు జన్మిస్తాడు. కాలం గడుస్తుంది. పంచవర్ష ప్రణాళికలు వచ్చినవి, ఎలక్షన్‌లు వచ్చినయి, ప్రభుత్వాలు మారుతున్నాయి. ఐనా నేల మారలేదు, భూమి మారలేదు, గిరిజనుల బ్రతుకులు మారలేదు. అడవిని నమ్ముకున్న గిరిజనుల బతుకులు ఎండిపోతున్నాయి. అప్పుడప్పుడూ తంబాకు అమ్మకోవడానికి తంబాకు అన్నయ్యలు ఆవూరు వస్తూపోతున్నారు. క్రమంగా గిరిజనులలో చైతన్యం మొదలైంది. అందరూ ఒకచోట కలసి సామూహికంగా తమ కష్ట, సుఖాలు చెప్పుకుని, తమ కష్టాలకు ఒక పరిష్కారం ఆలోచించుకోవాలని నిశ్చయించుకొంటారు. ఆస్థలమే "ఇంద్రవెల్లి".



అది ఒక చారిత్రకమైన రోజు ఏప్రిల్-20-1981 సోమవారం సాయంత్రం సోము, తుకారం, జంగు, దేవుబాయి ఇంకా వందలకొలది జనం కొమ్ములు వూదుకుంటు నేల ఈనినట్లుగా వస్తున్నారు. అనుమతి పేరుతో పోలీసులు అడ్డుకున్నారు. దానితో ఆగ్రహించిన గిరిజనులు తిరగబడ్డారు. ఫలితం పోలీసుల తుపాకుల గుళ్ళ వర్షంలో గిరిజనుల శవాలతో ఆ ప్రాంతమంత రక్తసిక్తంగా మారింది. ఇంద్రవెల్లి శవాలగుట్టగా కన్పిస్తుంది. సర్కారు అంతమందిని కాల్చివేస్తున్న జ్వాలలను తమ తుపాకి గొట్టంతో అణచివేసాననుకుంటుంది. కాని ఆ నిప్పురవ్వలు, గోండు గుండెలను, గోండు గుడిసెలను చీల్చుకుని అడవిని అంటుకున్నాయి. రేపటి పచ్చదనం కొరకు చెదలు పట్టిన ఈ వ్యవస్థలో మార్పు కోసం అడవి ఆత్మహుతి చేసుకుంది. ఈ ఆత్మహుతితో పునీతమైన నేలతల్లి కడుపులోంచి ఒక కొత్త వ్యవస్థ మొలకెత్తుతుంది అంటూ ముగుస్తుంది.

అవును ఎక్కడ అణచివేత, దోపిడి వుంటుందో అక్కడ తిరుగుబాటు పోరాటం పుడుతుంది. పునీతమైన ఈ నేలతల్లి కడువులోంచి పీడించే వర్గం, పీడింపబడే వర్గం లేని నవసమాజం ఆవిర్భవించాలని ఆశిద్దాం. ప్రజల యొక్క జీవితాలనుంచే, ప్రజలకు కొరకు రచించిన ఇలాంటి నవలలు ప్రజలకు చేరువు కావాలి, వారు ఆదరించాలి అప్పుడే ఇలాంటి నవలలకు సార్థకత ఉంటుంది. ♦

# తెలుగు భాషా వికాసం - వాస్తవిక దృక్పథం

- తెలకపల్లి రవి



**ఉత్పత్తి సాధనాలు, సామాజిక పరిస్థితులు మారినప్పుడల్లా భాష చర్చనీయం కావడం అసహజమేమీ కాదు. ప్రవాహం లాంటి భాషలో ప్రమాణాలుఎప్పుడూ సాపేక్షమే! అత్యధిక జనానికి అందుబాటులో ఉండటం, ఆమోదయోగ్యంగా అభివృద్ధికి దోహదకారిగా ఉండటం, ఆధునీకరణ అవకాశాలు ఉండటం- ఇవి భాషా విధానంలో కీలకాంశాలు. భాష ప్రాచీనతను కీర్తించడం ఎంత ముఖ్యమో, ఆధునికత అవసరాన్ని ఆహ్వానించడం అంతకన్నా ముఖ్యం.**

ఇటీవలి కొన్ని సంవత్సరాలుగా రాష్ట్రంలో తెలుగు భాష పరిరక్షణ అన్న నినాదం ఎక్కువగా వినిపిస్తోంది. ఈ పేరుతో అనేక వేదికలు, సంస్థలు నెలకొన్నాయి. అధికార, అనధికార ప్రముఖులు ముందుండి కార్యక్రమాలు నడిపిస్తున్నారు. వీటిని తెలుగు భాషా పరిరక్షణ ఉద్యమాలని పిలుస్తున్నారు. కొన్నేళ్ల కిందట తమిళ భాషకు ప్రాచీన హోదా కల్పించిన కేంద్ర ప్రభుత్వం తెలుగును నిర్లక్ష్యం చేసిందని నిరసనలు మార్మోగాయి. ఎట్టకేలకు ఆలస్యంగానైనా ఆ హోదా తెలుగుకూ ఇచ్చారు గాని, తర్వాత దానివల్ల ఒరిగిందీ జరిగిందీ ఏమిటనేది ఇంకా అస్పష్టంగానే ఉంది. డిసెంబర్ నెలలో తిరుపతిలో ప్రభుత్వ ఆధ్వర్యంలో ప్రపంచ తెలుగు మహాసభలు తలపెట్టడం, ఇటీవలనే అధికార భాషా సంఘం అధ్యక్షుడుగా మండలి బుద్ధ ప్రసాద్‌ను నియమించడం వంటి పరిణామాలు ఈ అంశంపై ఆసక్తి పెంచాయి.

ఇంతకూ తెలుగు భాషను కాపాడుకోవడమంటే ఏమిటి? ఎవరి నుంచి? ఏ విధంగా? ఇప్పుడు మమ్మీ డాడీ చదువుల నుంచి అని టక్కున జవాబు చెప్పేస్తారు. నిజానికి ఈ సమాధానం సమగ్రమైంది కాదు. ఎందుకంటే ఇలాంటి ప్రశ్నలకు ఒక్కొక్క దశలో ఒక్కొక్క జవాబుఉంటూ వచ్చింది. ఇంగ్లీషు నుంచి మాత్రమే గాక సనాతనవాదుల నుంచి, సంస్కృత వ్యామోహం నుంచి తెలుగును కాపాడుకోవడం ఒకనాడు పెద్ద ఉద్యమంగా సాగింది. నిజానికి తెలుగుకోసం పోరాటం సంస్కరణోద్యమంలో పెద్ద భాగం. మా వాళ్లకు తెలుగులో రాయడమంటే చులకన అని శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి స్వయానా రాసిన మాట. గురజాడ మరింత సూటిగానే చెబుతారు : 'విశాల ప్రజానీకం చదువుకోవడం పూర్వాచార సంప్రదాయంలో భాగం కాదు. నాడు జ్ఞానార్జన, సాహిత్యం బ్రాహ్మణుని గుత్త సొమ్ము. అతని దృష్టిలో సంస్కృతం పెట్టిన వరవడి పవిత్రమైనదీ, మీద రానిదీ. సంస్కృత సాహిత్యం క్షీణ దశలో ఉన్నప్పుడు తెలుగు సాహిత్య సృష్టి ప్రారంభమైనందున ఆ క్షీణ దశ లక్షణాలైన భాషా కళా సంప్రదాయాలు తెలుగులో పాతుకు పోయాయి. రాజకీయ రంగంలో లాగానే భాషారంగంలో కూడా వేర్పాటుతత్వమూ, ప్రభువర్గతత్వమూ చివరకు పతనోన్ముఖం కాక తప్పదు. అనేకుల అవసరాలు కొద్దిమంది వాటికన్నా ముఖ్యమైనవి. తుదకు వాటిదే పైచేయి అయి తీరుతుంది.'

ఇంత స్పష్టతతో గురజాడ, గిడుగు సాగించిన వాడుక భాషా పోరాటం కేవలం భావోద్వేగ సంబంధమైంది కాదు. మాతృభాష - అందులోనూ ప్రజల భాషను పెంపొందించుకోవడం ఒక ప్రజాస్వామిక అవసరం. అయితే ఆంగ్లేయులు పాలించడంవల్ల, తర్వాత ప్రపంచాధిపత్యం సాగిస్తున్న అమెరికాలో మాట్లాడేది కూడా ఆ భాషే కావడం వల్ల (అయితే వారి ఆధిపత్యం కారణంగా అమెరికన్ ఇంగ్లీషు!) తెలుగుతో సహా వందలాది దేశ భాషలు కునారిల్లిపోవల్సి వచ్చింది. ప్రపంచీకరణ ఆ క్రమాన్ని మరింత వేగవంతం చేసింది. ఈ లోతుపాతులు పరిశీలించకుండా కేవలం ఉద్వేగంగానో, ఆవేశంగానో మాతృభాష గురించి ఘోషించినంత మాత్రాన దాన్ని కాపాడుకోలేము. 65 ఏళ్ల స్వాతంత్ర్యానంతరం కూడా దేశంలో ఒక ప్రధాన భాషగా ఉన్న తెలుగుకు రక్షణ లేకపోవడానికి ఎవరిని నిందించాలి? రాజకీయ సామాజిక కోణాలు కారణాలు సవ్యంగా అర్థం చేసుకుంటేనే తెలుగుకు నిజంగా వెలుగు సిద్ధిస్తుంది. తెలుగు ప్రజలకూ వెలుగు వస్తుంది.

ఉత్పత్తి సాధనాలు, సామాజిక పరిస్థితులు మారినప్పుడల్లా భాష చర్చనీయం కావడం అసహజమేమీ కాదు. ప్రవాహం లాంటి భాషలో ప్రమాణాలుఎప్పుడూ సాపేక్షమే! అత్యధిక జనానికి అందుబాటులో ఉండటం, ఆమోదయోగ్యంగా అభివృద్ధికి దోహదకారిగా ఉండటం, ఆధునీకరణ అవకాశాలు ఉండటం- ఇవి భాషా విధానంలో కీలకాంశాలు. భాష ప్రాచీనతను కీర్తించడం ఎంత ముఖ్యమో,

## రెక్కలు

కలం కదిలితే
అక్షర మొలకలు
గళం విప్పారితే
పాటల పరిమళాలు -

ఏ పువ్వైనా
విచ్చుకుంటేనే అందం

ఉమ్మ నీరు కాదది
అమృతపు సెలయేరు
బొడ్డు కోసినా
గాయం కాలేదు -

అమ్మ ప్రాణం
పణం

కుంచించుకున్న
హృదయానికి
మందు
ఏది ?

ప్రేమను పోద్దాం
వికసిస్తుంది.

కళ్ళు
తెరిస్తే
కనుచూపు మేరకే
దృశ్యం -

అంతర్నేత్రంతో
విశ్వం నీ స్వంతం

గతం
త్రవ్వుతూపోతే
వర్తమానం
గొయ్యే !

గుండెను రగిల్చిన కొద్దీ
జ్ఞాపకాల చిగుళ్ళే !!

రమణ వెలమకన్ని
✆ : 9866015040



ఆధునికత అవసరాన్ని ఆహ్వానించడం అంతకన్నా ముఖ్యం. తమిళుల వలె మనం తెలుగు భాష చరిత్రను తగినంతగా తవ్వి తీయలేకపోయామంటే కారణం ఆదికవులను స్మరిస్తూ సోదికవులైన జానపదులను విస్మరించడమే! కందుకూరి వీరేశలింగం వంటి సంస్కర్త కూడా భాషాసంస్కరణ అవసరాన్ని గుర్తించడానికి చాలా కాలం పట్టింది. ఈ సమస్య ఇప్పటికైనా తొలగిపోయిందని చెప్పలేము.

ఏ ప్రపంచీకరణ ప్రభావమైతే తెలుగుతో సహా దేశ భాషలను అనుచితంగా దెబ్బ తీసిందో దాన్నే విముక్తి ప్రధాతగా చూసే మేధావులు ఒకవైపు.. జాను తెనుగు సంప్రదాయానికి బద్ధ విరుద్ధమైన సంస్కృత సమాసాలే తెలుగు అనుకునే ఛాందసులు లేదా అమాయకులు మరో వైపు... తెలుగులో సర్వం ఉందనుకునే అవాస్తవిక వాదులు ఒకవైపు.. తెలుగులో ఏమీ లేదనే అజ్ఞానులు మరోవైపు - భాషా పరిణామాన్ని, సమాజంలో దాని స్థానాన్ని సవ్యంగా అర్థం చేసుకోలేకపోతున్నారు. మీడియా ( ఇది తెలుగు కాదు. కానీ, ప్రచార ప్రసార సాధనాలనడం కంటే మెరుగ్గా తెలుస్తుంది)లో ఎంతో పరవశంతో పాడే, మాట్లాడే భాషలో నిజమైన తెలుగు పదాలు ఎన్నో లెక్కవేస్తే ఈ పెద్ద మనుషులు ఏమవుతారు?

భాషకు సంబంధించిన అనేకాంశాలు వివాదంగా ఉన్నా ఈ వ్యాసంలో రెండు విషయాలకు పరిమితమవుదాం. సాంకేతిక పదజాలం తప్ప తెలుగులో అన్ని విషయాలు చెప్పొచ్చుననే వాదన ఒకటి. తెలుగులో వ్యక్తీకరణ సాధ్యం కాదనే వాదన మరొకటి. ఇవి రెండూ పాక్షిక వాదనలే! కుటుంబ సంబంధాలు, ప్రేమానురాగాలు, వ్యక్తిగత భావాలు, వ్యవసాయ సమాజం నాటి అంశాలు వెల్లడించడానికి తెలుగు పదాలు సరిపోతాయి. కంప్యూటర్ వంటి సాంకేతిక పదాలు అలా ఉంచి ఆధునిక భావాలైన ప్రజాస్వామ్య భావాలను వెల్లడించే చాలా పదాలు తెలుగులో ఉండవు. ఎందుకంటే మన రాచరిక, భూస్వామ్య సమాజాలు అగ్రవర్ణాలు, అధమ వర్ణాలుగా విభజితమైనందున సమధర్మాన్ని పాటించలేదు. నమస్కారం, ఆశీర్వాదం తప్ప థాంక్స్, సారీ వంటి జెస్చర్స్ ఉండవు. అలాగే సంతకెళ్లడం దగ్గర ఆగిపోయిన కారణంగా పెట్టుబడిదారీ సంస్కృతి సృష్టించిన షాపింగ్ వంటి మార్కెట్ మాటలు ఉండవు. సెమినార్, ఇంటర్ యాక్షన్ తదితర సమాలోచన పదాలు వెతకడం కష్టం. గుడ్ మార్నింగ్, గుడ్ ఈవెనింగ్ వంటి మాటలు అక్కడి వాతావరణలో వచ్చినవంటే అర్థం చేసుకోవచ్చు గాని ఈ తరహా ప్రజాస్వామ్య పదాల విషయం వేరు. తరచూ చెప్పుకునేట్టుగా శాస్త్ర సాంకేతికాభివృద్ధికి సంబంధించిన మాటలూ ఉండవు, కనుక - మనమే సరైన దృష్టితో సృష్టించుకోవలసి ఉంటుంది. ఆ ప్రయత్నమే సరిగ్గా జరగలేదు.

ఇన్నేళ్ల తర్వాత ఎవరైన స్కూలు లేదా బడి అంటారు గాని పాఠశాల అంటున్నారా? హాస్పిటల్ నుంచి వచ్చిన అస్పత్రి అంటున్నారు గాని వైద్యశాల అంటారా? బస్సు, రైలు, రోడ్డు వంటి మాటలే గాక గేటు లాంటి మాటలను కూడా ఎంత ధారాళంగా వాడేస్తున్నారు? ప్రమోషన్‌ను పదోన్నతి అంటే బాగుండొచ్చు కాని రివర్షన్, ఇంక్రిమెంట్ వగైరాల సంగతేమిటి? కంప్యూటర్‌కు తెలుగు లేదుగాని అంతర్జాలం అనుకుని మురిసిపోతే ఫలమేమిటి? సెక్రటేరియట్‌ను సచివాలయం అంటే కొంతవరకూ వాడుతున్నారు. కాని దాని పక్కనే ఉన్న సెక్యూరిటీ ప్రెస్‌ను ప్రతిభూతి ముద్రణాలయం అనడం తెలుగా? ఇదంతా ఎవరో పనిగట్టుకుని వ్యామోహంతో చేస్తున్నారనుకోవాలా? సహజ సమస్యగా పరిగణించాలా? ఇది ఒక కోణం. ఒక తెలుగులో సంతకం చేయడం కూడా రాక వేలిముద్రలు వేసే జనం కోట్లలో ఉంటే ఇంగ్లీషు మీడియం ఒక్కసారిగా విజ్ఞానవేత్తలను చేస్తుందని చెప్పే మేధావుల మాటలెంత వరకూ సరైనవి? తెలుగు చదువులే రాని వారు ఇంగ్లీషులో అల్లుకుపోతారా?

కనుక తెలుగు వికాసం తగినంతగా జరగలేదంటే దానికి పాలనా పరమైన నిర్లక్ష్యం సామాజికపరమైన సమస్యలు కూడా కారణాలుగా ఉన్నాయి. వాటిని సవివరంగా చర్చించుకుంటే ఫలితం ఉంటుంది వూరికే తెలుగు పాటలు పాడుకున్నంత మాత్రాన వెలుగులు పరుచుకోవు. తెలుగును కాపాడుకోవడం ఈ నాటి జనబాహుళ్యం మధ్యన జరగాలి గాని శ్రీకాకుళాంధ్ర దేవుడిని పూజించడం వల్ల కాదు. మాతృభాషలో పాలన, విద్యార్జన ప్రజాస్వామిక అవసరం. ప్రజల భాషా వికాసం ఒక సాంస్కృతిక హక్కు. ఈ క్రమంలో చర్చకు వచ్చే మాండలికాల సమస్య మరోసారి పరిశీలిద్దాం.

కథ

# నొప్పి



పంజాబీ మూలం : జిందర్

తెలుగు : ఇనగంటి జానకి

✆ : 0981483254

శత్రు సైనికులని భ్రమ పెట్టడానికే దట్టమైన అడవిలో చెట్లు కొమ్మల్ని కలిపికట్టి వంతెనలా తయారు చేసారు భారతీయ సైనికులు. నేను ఇంకా పంమ్మా ఆ వంతెనపై నిలబడి శత్రువులపై కాల్పులు జరుపుతున్నాము. అటు నుండి వచ్చి ఓ తూటా పంమ్మా నుదుటపై చొచ్చుకుపోయింది.. క్షణంలో పంమ్మా వంతెనపై నుండి నేల పడి మరణించాడు. ఆ దృశ్యం చూసిన నా మనసు ప్రతీకారంతో రగలిపోయింది. నేను వెతికి వెతికి శత్రువులని హతమార్చాను.

ఆ రోజు మాదే గెలుపు అయినప్పటికీ నేను చాలా నీరసంగా ఉన్నాను. కారణం పంమ్మా 'ఇకలేడు' అన్న నిజాన్ని నేను తట్టుకోలేకపోతున్నాను.

సాయంకాలం యుద్ధ విరామం తరువాత భారతీయ సైనికులు వంతెనపై నుండి వేలాడుతున్న తాళ్లు పట్టుకుని కోతుల్లా గెంతుతూ హుషారుగా దిగి సైనిక స్థావరాల వైపు వెళ్లిపోతున్నారు. నేను మాత్రం అక్కడే చతికిలి బడి పంమ్మా విషయం ఆలోచిస్తూ కూర్చుండిపోయాను. నేను వర్తమానంలోకి వచ్చేటప్పటికి పొద్దువాలిపోయింది. నాతోటి సైనికులంతా దూరంగా వెళ్ళిపోయారు. దూరంగా వెళ్తోన్న సైనికుల మాటలు అస్పష్టంగా వినపడుతున్నాయి. ఆ ధ్వని వెంట వెళ్ళే ప్రయత్నంలో నేను వంతెన పైనే చాలా దూరం నడిచాను. కాని తిరిగి వెళ్ళలేకపోయాను. ఈ రోజు నా ఎడమకాలుపై నుండి ఓ తూటా రాసుకుపోయింది. కాలు చిప్ప చితికిపోయినట్టు నొప్పిగా వుంది. బాధపడుతూనే ఎలాగో నేను వంతెన పైనుండి దిగాను.

ఎవరో నా వైపు వస్తున్నారు. వారి పాదాల క్రింద పడి నలుగుతున్న ఎండుటాకుల చప్పుడు విని నేను అంచనా వేసుకున్నాను. నేను గబగబా దిగి ఓ చెట్టు చాటున నిలబడి పొంచి చూసాను. పాకిస్తానీ గణవేష్‌లో ఉన్న ఓ సైనికుడు నా ఎదుటే వచ్చి నిలబడ్డాడు, తన వీపు నాకు స్పష్టంగా కనబడుతోంది. నేను తనని పరిశీలనగా చూసాను తను భయం భయంగా ఇటూ అటూ చూస్తున్నాడు. తను కూడా నాలాగే సాటి సైనికులతో విడిపోయాడని నాకు అర్థం అయింది. తను నావైపు తిరిగి చూశాడు నేను తుపాకి గురి పెట్టి లొంగిపొమని హెచ్చరించాను. తను నాకు లొంగిపోయాడు. శత్రువులైనా మేము ఆ దట్టమైన అడవిలో రాత్రి సాటి మనిషిలా ప్రవర్తించక తప్పలేదు. తన పేరు జమీల్ అని చెప్పాడు.

యుద్ధ భూమి నుండి తిరిగి ఇంటికి వచ్చేసినా నేను పంమ్మా ఇంకా జమీల్‌ని మరవలేకపోతున్నాను. పంమ్మా నా ప్రాణస్నేహితుడు. మేమిద్దరం ఒకే వయసు వాళ్ళం, ఒకే ఊరువాళ్ళం, కష్ట, సుఖాలు కలబోసుకునే వాళ్లం. పంమ్మా బలవంతంగా నా పేరు తన కంపెనీలో రాయించాడు. భారతీయ సైనికుల కాల్పులకి గురై నేలరాలిన శత్రువునీ చూసినప్పుడు నా మనసు సంతోషించేది. మావైపు ఎవరు పోయినా మరోసారి పంమ్మా మరణించినట్లు నాకు అనిపించేది.

* * *

జమీల్ వీపులో చొచ్చుకుపోయిన తుపాకి గుండు వంటి నిండా రక్తపు మరకలు తను నా ఎదుట వచ్చి నాతో "మీ మత గ్రంథాల్లో

మృత్యువు విషయంలో ఏ రాసారు?" అని అడుగుతాడు? నాకు ఇప్పుడు మృత్యువంటే భయం పట్టుకుంది. వంటరిగా వుంటే జమీల్ కనబడతాడేమో అన్న భయం నాలో రోజు రోజుకు పెరిగిపోతున్నది. ఆ రోజు నేను హైందవ మత గ్రంథాల్లో మృత్యువు విషయంలో ఏమిటి వ్రాసారో జమీల్‌కి వివరింగా చెప్పాను. జమీల్ అర్థం అయినట్టు తలూపాడు కూడాను. మరెందుకు తను నన్ను పీడిస్తున్నాడో?

* * *

ఇంటికి తిరిగి వచ్చిన నేను ట్రాన్సిస్టర్ వాల్యూమ్ పెద్దగా పెట్టి పాటలు వింటూనో లేక నా భార్య 'కులవంత' పక్కని కూర్చొని తనకి ఇంటి పని సాయం చేస్తునో ఆ యుద్ధభూమి విషయాలు మరవటానికి ప్రయత్నం చేసినా మరవలేక పోతున్నాను. నేను దిన పత్రిక చదువుతూ ఎక్స్‌సర్వీస్ (మాజీ సైనిక వికలాంగుల) వారికోసం వేసిన ప్రకటన వెతుకుతుంటాను. కొన్ని ఉద్యోగాలకి అప్లై చేసాను. నాలుగు ఐదు చోట్ల ఇంటర్వ్యూ ఇచ్చాను. ఎక్కడి నుండీ ఇంకా పిలుపు రాలేదు. నేను రోజూ సాయంత్రం చాలాసేపు నడుస్తూ తిరుగుతాను. అలసి పోయాకా ఇంటికి తిరిగి వస్తాను. అలా అలవకపోతే రాత్రి కాసేపైనా నాకు నిద్ర పట్టదు. తిరగటానికి వెళ్ళినప్పుడు నా చొక్కా జేబులో ఓ ట్రాన్సిస్టర్ పెట్టుకొని పాటలు ఇంకా సమాచారం వింటూ నడుస్తాను. త్రోవలో ఎవరైన పరిచయస్తులు కనబడినప్పుడు ట్రాన్స్‌స్టర్ వాల్యూం తగ్గించి పలకరింపు అయి వాళ్లు వెళ్ళేకా మళ్ళీ ట్రాన్సిస్టర్ వాల్యూమ్ పెంచేస్తాను. ఒక్కొక్కప్పుడు నేను నానకసర్ గురు ద్వారా వెళ్లే త్రోవలో నడుస్తాను. గురు ద్వారా చేరే కొద్ది గురువాణి స్వరం స్పష్టంగా వినబడుతోంది. గురువాణి గూడార్థం గమనించిన నా మనసు కాస్తా కుదుటపడుతుంది.



పిల్లలు బడి నుండి ఇంటికి వచ్చేవేళ చూసుకొని నేను ఇంటికి తిరిగి వస్తాను. పిల్లలు హోమ్‌వర్క్ అయ్యేకా, భోజనం ముగించి నా చుట్టూ తిరుగుతూ ఏవేవో కబుర్లు చెపుతారు. ఆ క్షణం నేను వాళ్ళతో కలసి నవ్వుతాను. బహుశా ఈ పిల్లల్ని చూసుకోవటానికే నేను బతికి వుండిపోయానేమో? అలసిపోయి పిల్లలు వెళ్ళి వాళ్ళ అమ్మ మంచంపై పడుకుంటారు. నా మనసులో నొప్పి మళ్ళీ నన్ను పీడించటం ప్రారంభిస్తుంది. రాత్రి పది అయ్యాక నేను కులవంత గుండె పై తలపెట్టుకొని పడుకోవటానికి ప్రయత్నం చేస్తాను. కులవంత నేను నిద్రపోయే వరకు నా తలనిమురుతూనే ఉంటుంది. ఆ సుఖమైన స్పర్శకి నా కళ్ళు బరువెక్కుతాయి. అప్పుడు మళ్ళీ జమీల్ నా వద్దకి వచ్చి అదే ప్రశ్న అడుగుతాడు. నేను భయంతో కులవంతనీ గట్టిగా పట్టుకుంటాను, పాపం కులవంత్ రోజంతా ఇంటిలో చిన్నా పెద్దా పని చేసి చేసి అలసి ఇప్పుడే పడుకున్నది అని నాకు జ్ఞాపకం వస్తుంది. నేను కులవంత నుండి కాస్తా దూరంగా జరిగి పడుకోవటానికి ప్రయత్నం చేస్తాను.

ఈ రాత్రి పన్నెండు దాటినా ఇంకా నాకు నిద్ర పట్టలేదు. కుడి కాలు పిక్కసలుపుతున్నాది. నేను కాలు నిమురుకుంటూ కూర్చున్నాను. బాధ తగ్గటం లేదు. నేను మెల్లగా కులవంత చెవి దగ్గర ముఖం పెట్టి పిలుస్తాను. తను నా వైపు వత్తిగిల్లి "మీరు పడుకున్నారు అనుకున్నానే ఇదేమిటి ఇంకా కూర్చునే వున్నారా ఏమైంది మీకు?" అని అడుగుతుంది. నా కాలు నొప్పి విషయం చెపుతూ నేను లేచి నూనే సీసా వెతికానని దొరకలేదు కనుకా నిన్ను లేపానని చెబుతాను. కులవంత నా కాలుకి నూనె రాస్తు వుంటే హాయిగా సుఖంగా అనిపిస్తుంది. కాసేపటికి నేను ఎడమ మోకాళ్ళ చిప్ప క్రింద పిక్కల పై నూనె రాయమంటాను. తను అలా చేయదు. నా వైపు తీక్షగా చూస్తూ కూర్చొంది. నేను నిష్ఠూరాలాడి నూనె సీసా నాకు ఇవ్వమని నేనే రాసుకుంటానని అడుగుతాను. తను మెల్లగా నా ఎడమ కాలుచిప్ప నుండి క్రింది భాగం ఆపరేషన్ చేసి తీసేసిన విషయం జ్ఞాపకం చేస్తోంది. నేను అర్థం చేసుకోను. తను నా చేయి పట్టుకొని నా కాలుపై నిమిరి చూపిస్తుంది. నేను మొండిగా నూని సీసా లాగే ప్రయత్నం చేస్తాను. తను జాలిగా నావైపు చూస్తు బహుశా కుడికాలు మీద భాగం మీకు నొప్పిగా వుందేమో" అని అన్నది. నేను కోపంగా అరుస్తాను కులవంత గభీమని నా తల తన గుండె పై అణుచుకోని "అరవకండి పిల్లలు లేచి పోతారు! మీకు ఎక్కడ నొప్పిగా వుందో చెప్పండి" అన్నది. నేను మళ్ళీ తన చేతి నుండి నూనే సీసా లాగుకొనే ప్రయత్నం చేస్తాను తను నా వైపు జాలిగా చూడటం నేను సహించలేను. నాకోపం రెట్టింపు అవుతుంది, నేను నా "కాలువుంది! జమీల్ కూడా బతికే వున్నాడు" అని అరుస్తాను. తను ఆశ్చర్యపోతూ లేచి లైట్‌స్విచ్ వేసి నా వైపు చూస్తూ "జమీల్ ఎవరు?" అని అడుగుతుంది. నా దుఃఖం కోపం భయం అన్నీ కలిపి నన్ను పీడిస్తున్నా నొప్పి నా కళ్లలో చోటుచేసుకుంది. నేను "జమీల్ పాకిస్తాని సైనికుడు" అని చెపుతాను. "తనకి ఏమైంది?" అని కులవంత అడుగుతుంది. "నేను వాడిని కాల్చి చంపాను." అని చెప్పేశాను. "యుద్ధ భూమిలో శత్రువు పై తూటాలు పేల్చటం ప్రతి సైనికుడి కర్తవ్యం. పంమ్మా నీ కాల్చి చంపిన వాళ్లపై మీరు విరుచుకుపడ్డానని ఇంతకు మునుపే నాకు చెప్పారే" అని నా నొప్పిని తగ్గించే ప్రయత్నం చేస్తుంది. నేను ఒప్పుకోను. "పంమ్మా నీ కాల్చిన వారిలో జమీల్ లేదు." అని నేను ధృడంగా అంటాను. "మరి ఈ జమీల్ ఎవరు, మీరు ఎప్పుడు చెప్పలేదే, ఒక్కొక్క రాత్రి నిద్దరలో జమీల్ అని మీరు పలవరించటం నేను విన్నాను. జమీల్ ఎవరు నాకు చెప్పండి?" అని పిల్లలా కులవంత నా దగ్గరగా వచ్చి మారాం చేస్తుంది. "జమీల్ నా శత్రువు! కాదు కాదు! వాడు నా మిత్రుడు లేదు లేదు ! ఆ రాత్రి నాలాగే తను బాధితుడు ! ఔను ఆ రాత్రి నాతో కష్టం పంచుకున్న వాడు నేను చెప్పే స్థితిలో లేను" అంటూ నాలో నేను గొణుగుతాను. కులవంత నా దగ్గరగా వచ్చి "నా మాట వినండి నాతో చెప్పండి" అని నన్ను బతిమాలుతుంది. కులవంత సానుభూతి కారణంగా నా మనస్థితి కాస్తా సద్దుకుంటుంది. "చెపుతాను! అంతా వివరంగా చెపుతాను గాని, నీవు నాకు ఓ గ్లాసుడు మంచినీళ్లు తెచ్చి

ఇవ్వు ఇంకా కప్పు టీ పెట్టిఇవ్వు" అని కులవంతని అడుగుతాను. టీ త్రాగిన తర్వాత చెప్పడం ప్రారంభించాను. "కార్గిల్‌లో కొన్ని సైనిక స్థావరాల్లో నవంబర్ ఇంకా డిశంబర్ నెలల్లో చాలా మంచు కురుస్తుంది. దట్టంగా మంచు కురవక మునుపే ఆ స్థావరాల నుండి క్రిందికి వచ్చేస్తారు. ఆ తర్వాత పది పదిహేను రోజులకి ఓసారి అక్కడికి వెళ్ళి ఆచుట్టుప్రక్కలా పరిశీలించి మళ్ళీ తిరిగి వచ్చేస్తారు. కొన్ని సంవత్సరాలుగా ఇలా జరుగుతూనే ఉన్నా మన సీమరేఖ దాటి అటు ఉన్న పాకిస్తాన్ సైనికులు ఆ స్థావరాల వైపు ఎప్పుడు కన్నెత్తి చూడటం అప్పటి వరకూ జరగలేదు. నిరుడు పాకిస్తాన్‌లో కొత్తగా నియమించబడిన జనరల్ మనసులో దుర్బుద్ధి పుట్టింది. భారతీయ సైనికులు కార్గిల్ స్థావరాలని చలికాలంలో విడిచి పెట్టడం తనకి అనుకూలంగా భావించి ఆ భూభాగాన్ని తన అధికారంలోకి తీసుకుందామనుకున్నాడు. మన సైనికులు అక్కడికి తిరిగివచ్చేటప్పటికి పాక్ సైనికులని ఆ ప్రాంతంపై కబ్జా చేయమని ఆదేశించాడు. మార్చి నెల ప్రారంభంలో భారతీయ సైనికులు కార్గిల్ స్థావరాలకి వెళ్ళినప్పుడు పాకిస్తాని సైనికులు వాళ్లపై కాల్పులు జరిపారు. మన దేశసైనికులు హెలికాప్టర్‌లో ఆ ప్రాంతం అంతా సర్వే చేసినప్పుడు పాకిస్తానీ సైనికులు మన సీమలో ప్రవేశించిన విషయం తెలిసింది. అంతే కాదు పాక్ సైనికులు శ్రీనగర్, లెహ, లధఖ్, ని తమ ఆధీనంలో తీసుకొని అక్కడి నుండి మీదకి వెళ్ళే మార్గాన్ని ఆవరోధించారని తెలిసింది.



అటు లాహోర్‌లో భారత ఇంకా పాక్ ప్రధాని కలసి భవిష్యత్‌లో ఇరు దేశాలు అజాత శత్రువులలా మసులుకోవాలన్న ఒప్పందం కుదుర్చుకొని చేతులు కలుపుకుంటున్నారు. ఆ ఒప్పందాన్ని విఫలం చేసే ప్రయత్నం చేస్తున్నాడు కొత్తగా నియమించబడిన పాక్ జనరల్.

పాకిస్తాన్ జనరల్ కుట్ర తెలిసేటప్పటికి చాలా ఆలస్యం అయిపోయింది. ఇక లాభంలేదు శత్రువు సైనికులని తరమి మన భూభాగాన్ని మనము వశపర్చుకోవాలి. మన సైనికులు కార్గిల్ సెక్టర్ వద్ద జమ అవ్వడం ప్రారంభించారు. అప్పుడు సెలవలో వున్న భారతీయ సైనికుల సెలవు రద్దుచేసి వెంటనే వచ్చి విధినిర్వహించమని ఆదేశాలు జారిచేసారు సైన్యాధికారి.

నీకు జ్ఞాపకం ఉండేవుంటుంది, ఆరోజు మనం మీ వాళ్ళ ఇంట్లో వున్నాము. ఆ రోజు మీ తమ్ముడికి నిశ్చితార్ధం కార్యక్రమం జరుగుతున్నది. నేను మెల్లగా నీతో నాకు యుద్ధ భూమి నుండి పిలుపు వచ్చిన విషయం చెప్పాను. నీవు చిన్న పిల్లలా మారం చేస్తూ వెళ్లవద్దు, మెడికల్ లీవ్ పెట్టమని సలహా ఇచ్చావు. సైనికులకి అటువంటివేవి చెల్లవు అని నీకు బోధపర్చి నేను నా విధి నిర్వహణకు హాజర్ అయ్యాను.

శత్రువుని లైన్ ఆఫ్ కంట్రోల్‌కీ అటువైపు తరిమేయాలి అన్న ధ్యేయంతో భారత సైనికులు వ్యూహరచన చేసారు. సైనికాధికారులు సైనికజవానులకి శిక్షణ ఇచ్చి యుద్ధభూమిలోకి పంపారు. అటు యుద్ధం చేసేటందుకు శత్రువులూ మాకన్నా ముందుగానే సిద్ధపడి ఉన్నారు. మేము వాళ్లపై దాడి చేసిన వెంటనే వాళ్ళు మా పై తూటాలు వర్షం కురిపించారు. చాలామంది భారతీయ సైనికులు వీరగతి చెందారు. ఎంత నష్టం వాటిల్లినా మన సైనికులు ఆగలేదు ముందుకు సాగుతూనే వున్నారు. శత్రువు నియంత్రణ నుండి ఒక్కొక్క స్థావరం స్వాధీనం చేసుకుంటూ అక్కడ మన దేశం జెండా పాతుకుంటూ ముందుకుసాగుతున్నారు. ఇంతలా నష్టపోతూ యుద్ధం చేయటం మనకి శ్రేయస్కరం కాదు అని ఆలోచించి మన సైనికాధికారులు కొన్ని అంచనాలు వేసుకొని వ్యూహరచన చేసారు.

కార్గిల్ నుండి ఇంకా మీదకి ద్రాస్ సెక్టర్ ఉన్నది. ఇక్కడి నుండి తిరిగి వెళ్లిన పాక్ సైనికులు బహుశా ద్రాస్‌ని తన ఆధీనంలో తీసుకొని అక్కడి నుండి ముందుకు పోయే మార్గాన్ని అవరుద్ధ పరుస్తారు. అనుకొని ఆ ఎదురుగా ఉన్న ప్రాంతంలో దట్టమైన అడవిలో చెట్టుకొమ్మలని కలిపి కట్టి వంతెనలా కట్టారు. మన యుద్ధ నిపుణులు అనుకున్నట్లే పాకిస్తాన్ ద్రాస్ పాయింట్‌పై డాడి చేసింది. ఈ పరిస్థితిని ఎదుర్కొవటానికి సిద్ధంగా వున్న భారతీయ సైనికులు శత్రువులపై విరుచుకుపడ్డారు. "యా ఆలియా అలి'" అంటూ ముందుకు వచ్చిన పాక్ సైనికులని మన సైనికులు పిట్టలా కాల్చిపారేస్తున్నారు.

భారతీయ సైనికులు ఎక్కడ నుండి కాల్పులు జరుపుతున్నారో చాలా సేపటివరకూ పాక్ సైనికాధికారులకి అర్ధంకాలేదు. వాళ్లవైపు వస్తున్న తూటాల బట్టి దిశగ్రహించి వాళ్లు తిరిగి కాల్పులు చేసేటప్పటికి చాలా సమయం పట్టింది. నా దురదృష్టం ఈరోజు మన దేశ సైనికులు వీరగతి ప్రాప్తించిన వారిలో నా ప్రాణస్నేహితుడు పంమ్మా ఉన్నాడు. నా కాలు చిప్పపై నుండి తుపాకి గుండు దూసుకుపోయింది.

ఎంత ప్రయత్నించినా పాక్ సైనికులు ద్రాస్ పాయింట్‌ని నీ జయించలేకపోయారు. మరి లాభం లేదు అనుకొని గుట్టలు గుట్టలుగా పడివున్న పాక్ జవానుల శవాలని అలాగే విడిచి పెట్టి తిరిగివెళ్ళిపోయారు.

'ఈరోజు యుద్ధంలో మేము గెలిచాము. 'నేను వంటరిగా అక్కడ వుండిపోయాను. నన్ను చూసి జమీల్ భయపడి ఆత్మరక్షణకి తుపాకి తియ్యబోయాడు. నేను తనాయుధాలు స్వాధీనం చేసుకొని తను దుస్తులు తనిఖీ చేసాను ఏవీ దొరకలేదు. నేను తను చేతులు మడిచి కట్టడానికి ప్రయత్నించాను. తను చాలా బాధగా మూలుగుతూ. "నావీపులో తూటా గుచ్చుకుంది" అని అన్నాడు. నేను తన కాళ్ళు కట్టబోయాను తన కాళ్లు కూడా రక్తంతో తడిసివున్నాయి.

"నాకు చాలా నొప్పిగా వున్నది నేను పారిపోయేస్థితిలో లేను, దయ తలచి నా కాళ్లు చేతులు కట్టకు" అన్నాడు. నేను తనని తలనుండి పాదాలు వరకు పరిశీలనగా చూసాను. తను చాలా దీనంగా వున్నాడు. "నన్ను నమ్ము ఆ పవిత్ర అల్లాపై ఆన నేను నిన్న మోసగించను, ఈ

దట్టమైన అడవిలో ఈ చీకటి పడే వేళలో సాటి మనిషిని చూసి నిజానికి నాకు కాస్త ధైర్యంగా అనిపిస్తుంది." అన్నాడు. తన పరిస్థితి చూసి "అయితే కూర్చొ" అన్నాను. నేను అలా అన్న వెంటనే కూర్చొలేదు ఏకంగా నేలపై పడుకుండిపోయాడు. అప్పుడు నేను తన వద్దకూర్చొని కసిగా "ఏరా ఏమిటి నీపేరు?" అని అడిగాను." "కాస్త మృదువుగా అడగవచ్చు కదా" అన్నాడు. "నాపేరు జమీల్ అహమద్, నేను కసూర్ వద్దవున్న ఫతిహాబాద్ నుండి వచ్చి గత రెండు సంవత్సరాల క్రితం పాకిస్తాన్ సేనలో చేరాను. మావాళ్ళు మట్టి కల్లు తయ్యారు చేసే పనిచేసేవారు కొన్ని కారణాలుగా ఇప్పుడు ఆ పని మానుకున్నారు. నాకు ఆరుగురు చెల్లిళ్ళు వున్నారు. ఇప్పుడు నా కుటుంబానికి నేను నెల నెలా పంపే సొమ్ము ఆధారం. ఒకవేళ నేను చచ్చిపోతే వారంతా అనాథలవుతారు వారు ముష్టి ఎత్తుకొని బతకాలి." అని గబగబా చెప్పేసాడు. తను నాకు తన వివరాలు చెప్పుకుంటున్నాడో లేక రాబోయే సమయం గురించి తన మనోవేదన వివరిస్తున్నాడో. నాకు అర్థం కాలేదు. నాకు జాలేసింది.

మరి నీ వివరాలో అన్నట్లు నా వైపు చూసాడు నేను తన ఉద్దేశం గ్రహించి "నాది చాలా పేద కుటుంబం, మా నాన్న పల్లెలో బంగారం ఆభరణాలు తయారు చేసే కొట్టు నడిపేవాడు. ఇప్పుడు బంగారం ధర పెరిగిపోయింది ఊరు వారు నగలు తయారు చేయించుకోవటం మానేసారు. అపై మా నాన్నకి తాగుడు కూడా అలవాటు వుంది. కొద్దో గొప్పో ఇంటిలో ఉన్నది కూడా మానాన్న తాగుడు కారణంగా ఖర్చు అయిపోయింది. ఇల్లు గడవటం కష్టంగా అయింది. నేను భారత సేనలో చేరిపోయాను. నాకు ఉద్యోగం వచ్చిన వెంటనే మావాళ్ళు నాకు పెళ్ళి చేసేసారు, ఇప్పుడు బడికి వెళ్ళే ఈడు గల ఇద్దరు పిల్లలు వున్నారు" అని చెప్పుకున్నాను. 'అయితే మన ఇద్దరు పరిస్థితి ఒకటే అన్నమాట." అన్నాడు జమీల్. 'నేను తనని సమర్థించాను. నా పెదాలు పొడారిపోయాయి, దాహంతో నా ప్రాణాలు పోయేటట్టు అనిపిస్తున్నది. నేను జమీలతో "నీ వద్ద మంచినీరుందా?" అని అడిగేసాను. తను కాస్తా ఒదిగి తన ఎడమ భుజాన వున్న నీరు సీసాని తీసి తన నోటితో సీసా మూత విప్పి సీసాలో వున్న కాస్త నీరు నా నోటిలో పోసేసాడు. నా ప్రాణాలు కాస్తా కుదురుపడ్డాయి. తను మాత్రం ఇప్పటికీ నొప్పితో బాధపడుతూ ఇటు అటూ దొర్లుతున్నాడు. నేను నా వీపుపై కట్టివున్న సంచినీ విప్పి నేలపెట్టి అందులోంచి దూది మందు బెండెంజ్ తీసి తన దెబ్బపై రాసి కట్టు కట్టాను. తను మెల్లగా లేచి కూర్చోని నావైపు కృతజ్ఞతగా చూసి "నీపేరు ఏమిటి!" అని అడిగాడు. "నా పేరు అజాయబ్" అని చెప్పాను. "నీకు లోతైన దెబ్బ తగిలింది కదు" అని అడిగాడు. "ఔను కానీ నా శరీరంలో తూటా చొచ్చుకుపోలేదు," అని చెప్పాను. "నాకు బాగా ఆకలిగా ఉంది" అని అన్నాను. తన సంచిలో వున్న మైదా ఇంకా పంచదారతో తయారు చేసిన పిండివంట తీసి నా ఎదుట పెట్టాడు. మేము ఇద్దరము తిన్నాము.



"చీకటి పడిపోయింది బాగా చలివేస్తుంది కదు," అన్నాడు. "నిజమే" అని చెప్పి నేను లేచి ఇటూ అటూ వెతికి ఎండు ఆకులూ పుల్లలూ పోగు చేయటం ప్రారంభించాను తను నాకు సాయం చేసాడు. బాగా ఆకులు పుల్లలు పోగు అయ్యాకా కాస్తా ఆకులు పక్కకి పెట్టి జమీల్ సంచీ నుండి అగ్గిపెట్టి తీసి మంటవెలిగించాడు. మంట తగ్గినప్పుడు మేము అందులో మళ్ళీ ఆకులు వేసేవాళ్ళం. కాసేపు కాచుకున్నాక మా ఇద్దరి బాధా కాస్తా సద్దుకున్నట్లు అనిపించింది. మంట వెలుగులో తలెత్తి చూసి జమీల్ "ఈ అడివిలో చెట్టు కొమ్మలు కలిపి కట్టి వంతెనలా ఎవరు ఎందుకు కట్టారో?" అన్నాడు. నేను నవ్వుకున్నాను. "ఎవరో కాదు మా సైనికులే కట్టుకున్నాము. ఈ రోజు మేము దీనిపై నిలబడి యుద్ధం చేసాము" అని చెప్పాను "ఆదా! మా పాక్ సైనికులకి భారత సైనికులు ఎక్కడి నుండి మాపై దాడి చేస్తున్నారో అంతు పట్టలేదు ఈ రోజు అయోమయంలో చాలామంది సైనికులని మేము కోలుపోయాము అన్నాడు. నేను నా నవ్వు దాచుకోలేక పోయాను జమీల్‌కి నేను నవ్వటం అసలు నచ్చలేదు. ఇప్పుడు తను ఏమి చెయ్యలేదు. "యుద్ధంలో ఇలా జరుగుతూ వుంటుంది" అన్నాను. తను సమాధానం చెప్పలేదు. "ఔను నేను నీ ఎదుట నిలబడివున్నా నీవు నన్ను ఎందుకు చంపలేదు?" ఏదో ఆలోచిస్తూ అడిగాడు. "యార్ జమీల్, నిజం చెప్పనా ఈ దట్టమైన అడవిలో ఈ దెబ్బ తగిలిన కాలు, ఆకలి, దాహం నేను రాత్రి వంటరిగా ఎలాగడపాలా అని ఆలోచిస్తూ కూర్చుని వున్నప్పుడు నాకు నీవు కనబడ్డావు నేను నిన్ను వదులుకోలేకపోయాను." అని నేను స్పష్టంగా చెప్పేసాను.

ఔను నిన్ను చూసి నాకు కాస్త ధైర్యం వచ్చింది" అన్నాడు. ఈ రాత్రి మనము సాటి మనుషులము రేపు ఫాయర్ ఆడర్ అయ్యాకా ఎవరిని ఎవరు ముందు చంపేస్తారో చెప్పలేము, అన్నాడు. తను అన్నమాట కటువుగా వున్నా అందులోవున్న నిజాన్ని గ్రహించి "నిజమే డ్యూటీ దూటియే సైనికుడు మాత్రం మనిషికాడా," అన్నాను. "సైనికుడూ మనిషే" అన్నాడు. కాసేపు మేము ఇద్దరమూ మాటలాడుకోలేదు మౌనంగా అలా కూర్చొని ఉండిపోయాము. నాకల్ల నుండి నొప్పి నా వంటి నిండా పాకి బాధపెడుతున్నది. నాకే ఇంత బాధగా వున్నప్పుడు జమీల్ వీపులో తుపాకి గుండు చొచ్చుకుపోయి వున్నది తనకి ఎంత బాధగా ఉన్నదో? నేను జమీలో వైపు చూశాను. జమీల్ బాధని అణచుకుంటూ చీకటిలో చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు. నేను జమీల్‌ని తట్టి "ఏమిటి ఆలోచిస్తున్నావు జమీల్" అని అడిగాను. "ఏవీ లేదు" అనేసాడు. 'అబద్ధం చెప్పకు మాటాడు. మాటల్లో మనము మననొప్పిని కాస్త మరుస్తాము అన్నాను. ఈ పరిస్థితిలో ఎవరైనా ఎలా అబద్ధం అడగలరు? నాకు మా అమ్మ జ్ఞాపకం వచ్చింది. పాపం తనకి తెలియదు. నేను సైనికుడిగా ఉద్యోగం చేస్తున్నానని. ఇప్పుడు నాకు తగిలిన ఈ దెబ్బ నా ప్రాణాలు తీస్తుంది, నన్ను తన ప్రాణంగా చూసుకుంటున్న మా అమ్మ నా శవాన్ని చూసి తట్టుకోలేదు. అప్పుడు మా కుటుంబ

పరిస్థితి ఎలా మారుతుందో" అన్నాడు.

"నీ ఇంటిలో నిన్ను తన ప్రాణంలా ప్రేమించిన వారు ఎవరు?" అని అడిగాడు. నాకు నా భార్య జ్ఞాపకం వచ్చింది. నేను జమీల్ కి సమాధానం చెప్పలేకపోయాను. నాకు మైకం కమ్మేసింది. అలా ఎంతసేపు ఉన్నానో నాకు తెలిదు. నేను వర్తమానంలోకి వచ్చేటప్పటికి జమీల్ నావద్ద లేడు. నేను ఎంత అమాయకుడిని శత్రువుని ఆపద బంధువుగా గౌరవించాను. నేను జమీల్‌ని తిట్టుకున్నాను. అది విన్న జమీల్ "నన్ను తిట్టకు, నేను ఇక్కడ వున్నాను నా ఆయుధాలు నీ దగ్గరే ఉన్నాయి, చూసుకో. నేను అల్లా ఆన వేసాను ఈ చలి, ఆకలి, దాహం, దెబ్బ బాధా ఏమో ఏ క్షణం మనసు మారిపోతుందో మనసు మారి నీకు నేను హాని తలబడితే రేపు కయామత్ నాడు నేను అల్లాకి సమాధానం చెప్పలేను" అని జవాబు చెప్పాడు. నేను మౌనంగా ఉండిపోయాను. కాసేపు తర్వాత నేను జమీల్‌ని పిలిచాను. నా పిలుపు విని "ఏవున్నాది మాటలాడటానికి? నేను ఈ నొప్పి భరించలేకపోతున్నాను. నేను నిన్ను బతిమాలుకుంటాను నన్ను చంపు నేను ఎలాగ బతకను ఈ తుపాకి గుండు నా శరీరమంతా విషము నింపుతున్నది ఇలా బాధ పడేకన్నా వెంటనే చచ్చిపోడం సుఖం," అన్నాడు. నాకు చాలా జాలికలిగింది. నిజమే తనని కాల్చి ఓ దెబ్బకి చంపటమే మేలనిపించింది. కానీ అలా చేయిలేకపోయాను. తనని ఇప్పుడే 'యార్' అని పిలిచాను ఇప్పుడు 'ఎలా చంపగలను' అనుకున్నాను. "చంపనా? పోని ఓ మాట చెప్పు, మీ మత గ్రంథాలలో మృత్యువు విషయంలో ఏం రాసారు" అని అడిగాడు. "ఏం రాసారో నాకు పెద్దగా తెలియదు నాకు తెలిసినంత చెపుతానువిను. మా నాన్న కృష్ణ భక్తుడు, మా అమ్మ రోజు గురుద్వార్‌కి వెళ్ళేది. నా భార్య హైందవ మతానికి చెందిన అన్ని దేవుళ్లని పూజిస్తుంది. అప్పుడప్పుడు వాళ్లు అనుకున్న మాటలలో విన్నవి చెపుతాను. ఈభూమి పై పుట్టిన ప్రతి మనిషి ఒకరోజు పోతాడు. ఈ సృష్టిలో ఏది శాశ్వతం కాదు. మనిషి బట్టలు మార్చినట్టే ఆత్మ శరీరాన్ని మార్చుతోంది. అని గీతలో రాసారట. అలాగే గురువాణి కూడా చెపుతోంది. రాముడుపోయాడు, రావణుడు పోయాడు, నీ కుటుంబం అంతా పోతోంది ఈ జీవితం ఈలోకం అంతా కలే" అని చెప్పాను.

"ఇవన్నీ నేను విన్నాను నాకు తెలుసు కాని బలవంతంగా మరణించిన వారి విషయం ఏమిటి రాసారు? వారికి ఆత్మశాంతి ఉండదుట వారు దయ్యం అయిపోతారుటా?" అని అన్నాడు. నేను సమాధానం చెప్పలేకపోయాను. నేను విన్నాను బలవంతంగా మరణించిన వారు దెయ్యమైపోతారని. మాఊరి దగ్గరా "వహేవా" అన్న ఒక ధర్మస్థలం ఉంది అక్కడికి దెయ్యము పట్టినవారు వచ్చి దెయ్యాన్ని వదిలించుకుంటారు. నేను మాటలాడలేదు. జమీల్ బాధా పెరిగిపోయింది సహించలేని స్థితిలో ఇటు అటు దొర్లుతున్నడు. తనలో తానే ఏవేవో వర్లిస్తున్నాడు. "ప్రతి మనిషి ప్రతి జీవీ అక్కడివాడే, నేను నా మాతృ భూమి కోసం నా ప్రాణాలు అర్పిస్తున్నానను నేను దెయ్యం ఎందుకు అవుతాను? నాకు స్వర్గం లభిస్తుంది."

నేను జమీల్ కష్టాన్ని చూడలేక పోయాను. నా పెదాలు ఆరిపోయాయి నాకు దాహంగా ఉంది. నేను మళ్లి మరోసారి అనుకున్నాను జమీల్‌ని కాల్చి చంపుతే కనీసం తన కష్టం తీరుతోందని. తను ఏలాగు ఎన్నో రోజులు బ్రతికే స్థితిలో లేడు. జమీల్ నన్ను మళ్లీ బతిమాలటం ప్రారంభించాడు. "భాయి భాయి నన్ను షూట్ చేసి, నన్ను షూట్ చెయ్ నేను ఈ బాధ భరించలేను."

చీకటి విడిపోతున్నాది. సూర్యుడు చెట్లు చాటున నిలబడి మా ఇద్దరినీ చూస్తున్నాడు. బహుశా సీజ్ ఫాయర్ అయి పోయిందేమో జమీల్ అదిగో సూర్యోదయము అవుతున్నాది. జమీల్ పదా నేను నిన్ను నీ సీమరేఖ వద్ద తీసుకువెళ్లి విడిచి పెడతాను" అన్నాను.

జమీల్ ఆశ్చర్యంగా నావైపు చూసాడు "ఔను జమీల్ పదా" అన్నాను జమీల్ మెల్లగా లేవటానికి ప్రయత్నం చేసాడు, నేను తనకి ఊత ఇచ్చి నిలబెట్టాను. నా తుపాకి నా భుజాన పెట్టుకొని తనని నా కుడివైపు చుట్టి పట్టుకున్నాను. దెబ్బ తగిలిన నా ఎడమ కాలుతో అడుగు తీసి అడుగు వెయ్యటమే నాకు చాలా బాధగా వున్న నేను మెల్లగా నడుస్తున్నాను. నాలాగే జమీల్ చాలా ప్రయాసపడి ముందుకు సాగుతున్నాడు కొంచెం దూరం పోయాక జమీల్ నేలపై చతికిలి పడిపోయాడు. నావైపు చూసి చేతులు జోడించి "నీవు నా శత్రువువి అయినప్పటికీ నాపై జాలి చూపుతున్నావు. నా మాతృభూమి వడిలో నా ప్రాణాలు పోతే అదో సుఖం. నేను నీకు ఎలా కృతజ్ఞత చెప్పుకోవాలో నాకు అర్థం కావటం లేదు" అన్నాడు.

జమీల్ కలసినప్పటి నుండి అటువంటి మాటలు ఎన్నో ఆడినా ఇప్పుడు మాత్రం తను అన్న మాటలు నాలో కసిపెంచాయి. తెల్లగా తెల్లవారిపోయింది. ఎక్కడా తుపాకి గాని బాంబులు వేస్తున్న శబ్దం గాని వినబడలేదు. సీజ్ ఫాయర్ అయిపోయిందేమో అనుకున్నాను. నా ఎదుట కూర్చొని వున్న జమీల్ వైపు పరిశీలనగా చూసాను. పాకిస్తాన్ సైనికుడు ధరించిన గణవేశం, తన వంటి నిండా రక్తపు మరకలు నాలో కసి పెరిగింది, నాకు పమ్మా చచ్చి నేల పడుతున్న దృశ్యం గుర్తుకు వచ్చి నేను జమీల్ వైపు తుపాకి గురి పెట్టి ట్రిగర్ నొక్కేసాను. జమీల్ చావుకేక నాకు స్పష్టంగా వినబడింది. తుపాకి పేల్చిన వెంటనే నేను నేలపడిపోయాను. నాకు తెలివి వచ్చేటప్పటికి నేను ఆస్పత్రిలో ఉన్నాను. జమీల్ నేను పేల్చిన తూటాకి గురి అయ్యాడో లేక పాకిస్తాని గళవేశంలో ఉన్న జమీల్‌ని గుర్తించి నావెనుక నుండి మరోభారతీయ సైనికుడు జమీల్ పై తూటా పేల్చి తనని చంపారో నేను ఇప్పటికి తేల్చి చెప్పలేను.

♦

# పుస్తకం

డా. వై. రామకృష్ణారావు
✆ : 8985743964



ఇదేదో
బాగా తెలిసిన పుస్తకంలానే ఉంది
అట్ట మాసిపోయినా
లోపలంతా క్రొత్తగానే ఉంది
ఏ లైబ్రరీ నుంచో
షాపు నుంచో రాలేదు
అలా వచ్చింది, అంతే !
ఔను !
బాగా తెలిసిన పుస్తకమే–
అయినా ప్రతిపేజీ
ఏదో బాధపడని సామెతలా –
ఆదిమ మానవుడూ
ఆగామి మానవుడూ
రాక్షసులు, మృగాలు, దేవుళ్ళు
ఎన్నెన్నో పాత్రలు, ఏవేవో పాత్రలు
ఇది బహు సంక్లిష్ట కథనం
ఈ పేజీలు
వేగంగా తిరిగిపోతుంటై
అర్థమవుతున్నట్లే ఉంటుంది.
ఏ కథలో అయినా
వర్తమానం నుంచీ
ఎప్పటికప్పుడు ఊరిస్తుంటుంది
సస్పెన్సు !
ఈ రచనలో
గతం కూడా సస్పెన్సే !
ఏ సంఘటనా, ఏ పరిణామం
తర్కానికి దొరకవు
అందుకే ఇది సంక్లిష్ట కథనం
అమాంతం ఆఖరి పేజీలోకి గెంతి
ఉత్కంఠకు తెరతీద్దామనుకుంటే
ఆఖరి ప్రకరణంలో పేజీలన్నీ
తెల్లకాగితాలే !
క్రమంగా
పుటలమెట్లు ఎక్కుతూ చేరుకుంటేనే
అక్షరాలు సాక్షాత్కరిస్తాయి.
అయినా ఇంకా కథ
నడుస్తూనే ఉంటుంది
సస్పెన్సు కూడా సాగుతూనే ఉంటుంది
నిజానికిదో ధారావాహిక
చివరి పేజీని
నీకు నువ్వుగా చేరుకోలేవు !
ఉత్కంఠా తీరదు
సస్పెన్సూ ఆగదు
కథ ఎలా ముగిసిందో
ఎప్పటికీ తెలుసుకోలేవు
పుస్తకం మాత్రం మూతబడుతుంది
శిథిలమయిన వెనుక అట్ట
పైకి చేరుతుంది
ఓ తాత్త్వికుడా! ఓ తార్కికుడా!
బల్లమీది పుస్తకం కాదు
బ్రతుకు పుస్తకమేంటే...!!

నచ్చిన రచన

# కరువు సీమ సాహితీరత్నం - విద్వాన్ విశ్వం !!

డా. రాధేయ
✆: 9985171411




అచట నొకనాడు పండె ముత్యాల చాలు
అచట నొకపుడు నిండె కావ్యాల జాలు
అచట నొకపుడు కురిసె భాష్యాల జల్లు
విరిసెనటనాడు వేయంచు విచ్చుకత్తి... అంటూ

రాయలసీమ గతకాలపు వైభవాన్ని కీర్తించిన కవి విద్వాన్‌విశ్వం సీమవర్తమాన కన్నీటి చరిత్రను, వాస్తవిక చారిత్రక అనుభవాల్ని జీవన చిత్రాలుగా కళ్ళకు కట్టాడు. అంతేకాదు సీమ భవిష్యత్తులో ఏర్పడబోయే ఎడారిఛాయల్ని ముందే పసిగట్టి, పెన్నా తీర ప్రాంత ప్రజల కడగండ్లను ఆర్ద్రంగా పలికిన కావ్యం 'పెన్నేటి పాట'ను సాహితీ చరిత్ర మర్చిపోదు. ఈ కావ్యం చదువుతున్నంత సేపూ 'సీమ ప్రజల గుండె తడియారదు'.

విద్వాన్ విశ్వం గతాన్ని మాత్రమే చెప్పలేదు. మొత్తం మానవ సమాజం పట్ల అంతులేని ఆర్తికి పర్యాయపదమై పెన్నేటి పాటగా ప్రతిధ్వనించాడు. ఇందులో సహజమైన మానవ నుడికారం తొణికిసలాడింది.

'సాహితీ విరూపాక్షుడు విద్వాన్ విశ్వం' పేరుతో ఆయన సాహితీ జీవితాన్ని విశ్వజీవి, విశ్వరూపి, విశ్వభావి, విశ్వమేవ, అంటూ నాలుగు అధ్యాయాలుగా విభజించి మన కందించిన సంపాదకులు డా. నాగసూరి వేణుగోపాల్, కోడిహళ్ళి మురళీ మోహన్ గార్లను మనసారా అభినందిస్తున్నాను. ఇందులో ఉద్దండులైన సాహితీవేత్తలు డా. దివాకర్ల వెంకటావధాని, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, తిరుమల రామచంద్ర, వేలూరి శివరామశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ, ఆరుద్ర, దాశరథి వంటి ప్రముఖులు విద్వాన్ విశ్వం గారిని అంచనా వేసిన తీరును, వారి కావ్య ప్రతిభా పాండిత్యాలను విశ్లేషించే వ్యాసాలను పొందుపరిచారు. ఇవి వర్తమాన సాహితీ తరానికిఎంతో స్ఫూరిని అందిస్తాయి.

1956లో రాసిన పెన్నేటిపాట నేటికీ సజీవమైనదే. కళ తప్పిన పల్లెసీమలు, కనుమరుగైపోతున్న మన సాంస్కృతిక శోభను తలపింపజేస్తుంది. పల్లెసీమల వ్యథార్థ దృశ్యకావ్యమే పెన్నేటిపాటగా అవతరించింది. వస్తువు రూపంతో ఇతివృత్తం చక్కగా ఇమిడిపోయింది. ఎంత వివరించినా, ఎంత వ్యాఖ్యానించినా తరగని సాహిత్యపు గని. రాయలసీమ పలుకుబళ్ళు వారి నాలుక మీద నాట్యమాడాయి.

సాహిత్య చరిత్రలో విశ్వంగారి స్థానం విశిష్టమైనది. వారు వ్యాసం రాసినా, పద్యం రాసినా, సమీక్షలు చేసినా తమదైన శైలితో, విషయ వైవిధ్యంతో తొణికసలాడుతూ వుంటాయి. పెన్నానదీ తీర ప్రాంతంలోని సీమ ప్రజల స్వభావాన్ని, వారి గుండె చప్పుళ్ళను సమాజానికందించారు. వారి రచనల్లో అడుగడుగునా వారి ప్రతిభావ్యక్తిత్వం గోచరమవుతుంది.

ఎన్ని కావ్యాలు వచ్చినా జీవిత చిత్రణలో, భాషలో, భావ వ్యక్తీకరణలో రాయలసీమకు ప్రాతినిధ్యం వహించే కావ్యం పెన్నేటిపాట. కవితావేశంలో పెన్నేటి పాట. మహాప్రస్థానానికి దీటైన కావ్యం. ఇరవయ్యవ శతాబ్దంలో కండగల భాషను సృష్టించుకున్న అతి తక్కువ కావ్యాలలో 'పెన్నేటి పాట' ఒకటి అని ప్రముఖ విమర్శకులు వల్లంపాటి పేర్కొన్నారు.

విశ్వంగారు సంస్కృతంలో ఎంతో పేరు ప్రఖ్యాతులు పొందిన కాదంబరి, కిరాతార్జునీయం, దశకుమార చరిత్ర, మేఘసందేశం కావ్యాలను తెలుగులో చక్కటి రసానుభూతితో అనువదించాడు. అంతే కాదు విరికన్నె, మహాశిల్పి, నాహృదయం, మహాసంకల్పం వంటి కావ్యాలను రచించారు. ఆంగ్ల భాష నుండి, రష్యన్ భాష నుండి ఆధునిక సాహిత్యాన్ని తెలుగులోకి అనువదించారు. అంతేకాదు – ఆంధ్రప్రభ వారపత్రికలో వారి 'మాణిక్యవీణ' విశ్వం గారి విశ్వరూపానికి అద్దంపడతాయి.

జర్నలిజం కోర్సును బోధిస్తున్న అనేక విశ్వ విద్యాలయాల్లో ఈ వ్యాసాలను పాఠ్యాంశాలుగా పెట్టవలసిన అవసరం ఎంతో ఉంది.

విశ్వంగారు, కావ్యంరాసినా, వ్యాసం రాసినా, గేయం రాసినా అది సామాజిక ప్రాధాన్యత సంతరించుకున్నదే తప్ప ఇతరంకాదు. నిజానికి ఆయనే ఒక మానవతావాది. పత్రికా రంగంలో ఉన్నతమైన విలువలను నిలబెట్టిన సత్సంప్రదాయవాది. కరువు సీమలో పుట్టిన కాంతరత్నం. 2015లో విద్వాన్ విశ్వంగారి శతజయంతిని జరుపుకోబోయే సందర్భంలోనైనా ప్రభుత్వం ఎటూ చెయ్యదు కాబట్టి తెలుగు విశ్వవిద్యాలయమైనా లేదా సాహిత్య సంస్థలైనా పూనుకొని వారి వివిధ రచనల సమగ్ర సంపుటాలను తీసుకువచ్చే కృషిని ఇప్పటి నుండే ప్రారంభించాలని నా సూచన. కొంతలో కొంతయినా అబ్జక్రియేషన్స్ సంస్థ పక్షాన ఈ పుస్తకాన్ని వెలువరించినందుకు సంపాదకుల్ని మరోసారి అభినందిస్తూ వర్తమానతరం సాహితీ మిత్రులు విశ్వం గారి మానవతావాదాన్ని అందిపుచ్చుకోవడానికైనా ఈ పుస్తకాన్ని కొని, చదివి తీరాలి ! ♦

# కొత్త పుస్తకాలు

## వాక్కుకు వయసు లేదు

(కవితా సంపుటి)

డా. సి. నారాయణరెడ్డి

వెల : రూ.150/- పేజీలు : 175

ప్రతులకు : విశాలాంధ్ర బుక్‌హౌస్




కాలాన్ని కవచంగా తొడుక్కుని
విక్రమిస్తే
ఏ వ్యక్తి హృదయమైనా
ఎంతటి తీవ్ర ప్రఘాతాలకైనా
ఎదురొడ్డి నిలువగలుగుతుంది.
ఈదే బాహువులకు
స్థిర సంకల్పం తోడుగా ఉంటే
సువిశాల సాగరం అవతలితీరం వచ్చి
ఎదురుగా నిలుస్తుంది.

- డా. సి. నారాయణరెడ్డి

## వివేచన

వి. చెంచయ్య

వెల : రూ.50/- పేజీలు : 128

ప్రతులకు : 9440638035




సామాజిక పురోగమనం దృష్ట్యా సాహిత్యంలోని మంచి చెడ్డల్ని విశ్లేషించేది సాహిత్య విమర్శ – ఎంత గొప్ప శిల్పమైనా వస్తువుపైకి పాఠకుల దృష్టి మళ్ళించడమే దాని కర్తవ్యంగా ఉండాలి. – కవి చేతిలో శబ్దాలు సైనికుడి చేతిలో ఆయుధాలు, మందుగుండు సామాగ్రిలాంటివి. ఉపయోగించడం చేతగాకపోతే తన చేతిలోనే పేలిపోతాయి. – వాస్తవ జీవితం అంటే మనం అనుభవిస్తున్నది. జీవిత వాస్తవికత అంటే మనం అనుభవించాల్సింది. వాస్తవ జీవితం నుండి జీవిత వాస్తవికతవైపు పాఠకుల్ని మళ్ళించడమే సాహిత్యంలో వాస్తవికత.

- పేపర్ బ్యాక్

## లక్ష్యం

ఇ.సి.ఐ.ఎల్ ఉద్యోగుల రచనల సంకలనం

సంపాదకులు : గిన్ని ఆనందరావు, జి. యాదగిరి రావు

వెల : రూ.75/- పేజీలు : 169

ప్రతులకు : 9490098660




పద్మభూషణ్ డా. ఏ.ఎస్. రావుగారి 98వ జన్మదినం సందర్భంగా సాహితీస్రవంతి ఇ.సి.ఐ.ఎల్. వారిచే "లక్ష్యం" పేరుతో, మన సంస్థ ఉద్యోగుల రచనల సంకలనం ప్రకటించడం ఎంతో అభినందనీయం. ఇ.సి.ఐ.యల్. సాహితీ స్రవంతి వారు వరుసగా ఆరు సంవత్సరములుగా పద్మభూషణ్ డా. ఏ.ఎస్. రావు గారి జన్మదినం సందర్భంగా 'స్ఫూర్తి', 'ముందడుగు', 'మార్గదర్శి', 'నీరాజనం', 'సాధన'లు ప్రచురించి, నేడు "లక్ష్యం" పేరుతో మరో సంకలనాన్ని తీసుకురావడం సమంజసంగా ఉంది.

- పి. సుధాకర్

## మిసిమి

వ్యాసాలు

సరిసెట్టి ఇన్నయ్య

వెల : రూ.125/- పేజీలు : 230

ప్రతులకు : 27645536




Among the many magazines in which his essays have been published, **MISIMI** is one. Ever since the magazine started over two decades ago, Innaiah has been writing for it on a variety of subjects encouraged by the founder, Shri Alapati Ravindranath, whose many interests in art, philosophy, psychology and humanism, Innaiah shares. The present volume is a collection of those articles and is appropriately dedicated to the memory of shri Ravindranath.

**- Anjaneya Reddy**

## కలిసిన హృదయాలు

యెల్ది సుదర్శన్ పద్మశాలి

వెల : రూ.100/- పేజీలు : 123

ప్రతులకు : 09892411067




కథల్లోని పాత్రల సంభాషణలకూ, ఆ పాత్రల మనశ్చిత్రణకూ తన వ్యాఖ్యలను కూడా జోడించి, పాఠకులకు స్వయంగా ఆర్తితో, ఆసక్తితో, వివరంగా చెబుతున్నట్లు రాసిన కథలు ఇవి. ఆధునిక పరిస్థితులనూ, సంప్రదాయ భావాలనూ, తను పుట్టి పెరిగిన ప్రాంతపు మాండలికాన్నీ, తను చాలా కాలంగా ఉంటున్న నగర సంస్కృతి ప్రభావంతో అలవడిన మిశ్రమభాషనీ కలగలిపి, తనదైన శైలిలో అభ్యుదయ ధోరణిలో చెప్పిన కథలు ఇవి.

- అబ్బూరి ఛాయాదేవి

## సామెతల్లో తెలంగాణ జనజీవనం

డా. పిల్లా సత్యనారాయణ

వెల : రూ.50/- పేజీలు : 59

ప్రతులకు : 9849812054




డా. పిట్టా సత్యనారాయణగారు "తెలంగాణ జనజీవనం" పేరుతో సామెతల్లో తెలంగాణ జీవితం ఎట్లా తొణికిసలాడుతుందో చక్కగా వివరించారు. ఇక్కడి రాజకీయ సాంస్కృతిక జీవనం నుండి సామెతలు ఎట్లా పుట్టుకొచ్చాయో వాటి నేపథ్యాన్ని, సందర్భాన్ని విశదీకరించారు. ఆ వివరణలో సహజత్వమే ఉంది.

- బన్న అయిలయ్య

## అసామాన్య విశాఖలో విశాఖమాన్యులు

మోదు రాజేశ్వరరావు

వెల : రూ.250/- పేజీలు : 250

ప్రతులకు : 9391811226



నేను ఈ సంకలనం ఓ మహా సంకల్పంగా తలచి, ఓ యజ్ఞంగా భావించి దాదాపు $4^{1/2}$ సంవత్సరాల కాలంలో సమాచార సేకరణ, చేయడం జరిగింది (మధ్యలో 6సార్లు తీవ్ర అనారోగ్యానికి గురికావడం చెప్పకుండా ఉండలేను). అసలు ఈ కావ్యాన్ని మీకందించడానికి గల కారణాలు ఒకటి ఈ పుస్తకంలో గల మహనీయులందరితో దివంగతులైన వారిలో కొద్ది మంది మినహా పరిచయం ఉండడం, వారితో అప్పుడప్పుడు సాంస్కృతిక రంగానికి సంబంధించి వివిధ విషయాల మీద చర్చించే చనువు ఉండడం, (ఈ పరిచయం ఓ మహద్భాగ్యంగా భావిస్తూ వుంటాను) రెండు, గతంలో వీరందరిని గురించి విడివిడిగా వివిధ పత్రికలలో రావడం. చాలామంది వాటిని నిక్షిప్తం చేయలేకపోవడం, అలాకాకుండా ఇలా గ్రంథస్తం చేయడం వలన రాబోయే తరాలకు ఇది ఒక జ్ఞాన దీపంగా నిలచి, సమాచార కరదీపిక కాగలదన్న సదుద్దేశంతో చేసిన సంకలనం ఇది.

మోదు రాజేశ్వరరావు

## ఉదయిస్తున్న భూమి అస్తమిస్తున్న చంద్రుడు

కాలీన కావ్యం

డా. టీ.వీ. భాస్కరాచార్య

వెల : రూ.116/- పేజీలు : 112

ప్రతులకు : 9394513044



కవిత్వం... నడకలో నాన్యత సరిక్రొత్తదనం... సొంత గొంతుక... మనస్సుకు హాయిగా హత్తుకునే భావజాలం... కొత్తవస్తువు... కొత్త ప్రయోగం... కొత్త రూపం! ఒక్క మాటలో... సామాజికమైన విలువలతో కూడిన వినూత్నమైన సోయగాలను వెలార్చే కవితల హరివిల్లు ఈ కృతి. అందుకే కలం కుంచె రంగులూ, తళుకులూ, నయగారాలు పోతూ వయ్యారాలు ఒలక బోస్తాయి– ఈ శబ్ద చిత్రాలు. అర్థవర్ణాలు రంగరించుకొని మనో నేత్రాలకు కనువిందులు చేస్తాయి – ఈ వినూత్న ప్రయోగాలు! అరే! ఇలా కూడ ఆలోచించ వచ్చా అనే ఆశ్చర్యాలను కలిగిస్తాయి.

ఆచార్య ఎస్వీరామారావు

## జయంత మహాపాత్ర కవితలు

అనువాదం : డా. యు.ఎ. నరసింహమూర్తి

వెల : రూ.60/- పేజీలు : 104

ప్రతులకు : 040-27678430



సంక్లిష్ట సంకీర్ణ వర్ణమిశ్రితమయిన కావ్యాన్ని నరసింహమూర్తి చాలా చక్కగా, సమర్థవంతంగా అనువదించారు. అనువాదం అనువాదంలా కాక స్వతంత్ర రచనలో ఉండే ధార, అనాయాస అభివ్యక్తి వుండాలి. డా. నరసింహమూర్తి సాధించారు.

శివారెడ్డి

## భావ ప్రయాగ

కలల కళల కూడలి...

పేరం జయశీలరావు

వెల : రూ.180/- పేజీలు : 290

ప్రతులకు : 9390610068



జయశీలరావుకి కవిత రాయడంలో గల ఒడుపూ, ఆధునికమైన ఎత్తుబడులు చూస్తే, వారిలా చాలాకాలం ముందే కవిత్వం రాసారంటే, ఒకింత ఆశ్చర్యపోతాము. కొంత తిలక్ వచన కవిత్వ ఫక్కీ వీరి రచనలకు మంచి ఆకర్షణను తీసుకొచ్చింది. ఆకాశవాణి, విజయవాడ కేంద్రం ప్రసారం చేసిన (1975 నుంచి మొదలుకుని) అనేక కవితలలో సాంద్రత, భావగరిమ ఉన్నతంగా కన్పించి పాఠకులకు మంచి రచన చదివిన తృప్తిని మిగులుస్తాయి.

రామతీర్థ

## మరో చర్చ

రాచపాళెం చంద్రశేఖరరెడ్డి

వెల : రూ.100/- పేజీలు : 222

ప్రతులకు : 24744580





కనీసం వందమంది తెలుగు సాహిత్య విమర్శకులను గురించైనా ఇలా రాయవలసిన అవసరం ఉంది. తెలుగు సాహిత్య విమర్శ మీద ఎంత అసంతృప్తి ఉన్నా, సాహిత్య విమర్శ వస్తున్నంతగా దాని మీద విశ్లేషణ జరగడం లేదు. ఎంత సాహిత్య విమర్శకులు ఉన్నట్లుగా, విమర్శ విమర్శకులూ ఉండాలేమో అనిపిస్తుంది.

రాచపాళెం చంద్రశేఖరరెడ్డి

## కళింగ వంశధార

నల్లి ధర్మారావు

వెల : రూ.25/- పేజీలు : 97

ప్రతులకు : 9989168799



పాత్రికేయునిగా వంశధారతో గల ఓ పాతికేళ్ల అనుబంధం కూడా ఈ రచనకు ఉపయోగపడింది. చరిత్ర పట్ల మమకారం, సాహిత్య రంగంతో గల సంబంధాలు, కమ్యూనిస్టు పార్టీలతో గల ప్రత్యక్ష, పరోక్ష, అనుబంధాలు ఈ రచనకు కావలసిన ప్రాణవాయువును అందించాయి. దీనిని ఇంతకన్నా గొప్పగా, సమగ్రంగా రచించవచ్చు. కొన్ని పరిమితులు విధించుకుని రాయాల్సివచ్చింది. నిజానికి, దీనిలోని ప్రతి అధ్యాయం పిహెచ్‌డిలను సాధించే పరిశోధనలకు అర్హమైనవే. 'వంశధార'కు ప్రత్యేకంగా అంత శక్తి వుంది. నదులపట్ల మనుషుల్లో ప్రేమాభిమానులు, భక్తి, గౌరవాలు, కృతజ్ఞతాభావాలు మరింత పెంచడానికి ఈ రచన ఉపయోగపడుతుందని నమ్ముతున్నాను. ఈ రచనకు లక్ష్యం అదే.

నల్లి ధర్మారావు

## 'లక్ష్యం' ఆవిష్కరణ

సాహితీ స్రవంతి ఇ.సి.ఐ.యల్ ఆధ్వర్యంలో డా.ఏ.ఎస్.రావు 9వ వర్ధంతి జరిగింది. ఈ సందర్భంగా ఇ.సి.ఐ.యల్ ఉద్యోగుల రచనల సంకలనం "లక్ష్యం" ఆవిష్కరణ సభ అక్టోబర్ 21న జరిగింది. సభకు సాహితీ స్రవంతి నగర కార్యదర్శి జి. యాదగిరిరావు అధ్యక్షత వహించారు. ప్రముఖ సాహితీవేత్త మోతుకూరి నరహరి "లక్ష్యం" రచన సంకలాన్ని ఆవిష్కరించారు. ఆయన మాట్లాడుతూ డా. ఏ.ఎస్.రావు ఆవిష్కరణలుచేసి, ఎలక్ట్రానిక్స్‌లో స్వావలంభన సాధించే విధంగా కృషి చేసారన్నారు. ఇ.సి.ఐ.యల్‌ను స్థాపించటంలో ఆయన చేసిన కృషి మరువలేనిదన్నారు. సాహిత్య సేవలో ఇ.సి.ఐ.యల్ ఉద్యోగులుచేస్తున్న కృషి అభినందనీయమన్నారు. వరుసగా 6వ సారి ప్రచురించి, డా. ఏ.ఎస్.రావు నగర్‌లో ఆవిష్కరించటం వారి దీక్ష, పట్టుదలకు నిదర్శనంగా అభివర్ణించారు. ఉత్పత్తిలో రోజు వారిగా కృషి చేస్తూ సాహిత్యంలో రెగ్యులర్‌గా వ్రాయటం ఎంతో గర్వించదగ్గదన్నారు. కవితలు, కథలు, నాటికను కూడా వ్రాయటం రచనలో విభిన్న ప్రక్రియలో ఒకచోట చేర్చి ప్రచురించటం బాగుందని అన్నారు. రెగ్యులర్‌గా రచనలు చేసి ప్రచురించుతున్న



ఇ.సి.ఐ.యల్ ఉద్యోగుల రచనల సంకలనం ఆవిష్కరణ దృశ్యం

కవులు, రచయితలకు, మరియు సాహితీ స్రవంతి ఇ.సి.ఐ.యల్ వారికి అభినందనలు తెలియజేసారు. సాహితీ స్రవంతి ఇ.సి.ఐ.యల్ కన్వీనర్ గిన్ని ఆనందరావు మాట్లాడుతూ ఇ.సి.ఐ.యల్ ప్రతినెలా సాహిత్య జనకవనం ఇ.సి.ఐ.యల్ ప్రాంగణంలో ఏర్పాటు చేయటం జరుగుతున్నది అన్నారు. ఏ.ఎస్ రావునగర్ హౌసింగ్ సొసైటీ కార్యదర్శి కె. సోమయాచారి మాట్లాడుతూ రెగ్యులర్‌గా రచనల సంకలనం ప్రచురించి ఏ.ఎస్. రావునగర్‌లో ఆవిష్కరించటం ఎంతో ఆనందించదగ్గ విషయం అన్నారు.

## ఆదోనిలో గురజాడపై వ్యాసరచన పోటీలు



గురజాడపై వ్యాసరచనపై పోటీలో పాల్గొన్న విద్యార్థిని, విద్యార్థులు. పరిశీలిస్తున్న సాహితీ స్రవంతి రాష్ట్ర కమిటీ సభ్యులు కెంగార మోహన్

తెలుగు సాహితీ ప్రపంచంలో అరుదైన ముద్రవేసిన నవయుగ వైతాళికుడు గురజాడ అప్పారావు 150వ ఉత్సవాలను పురస్కరించుకొని కర్నూలు జిల్లా అదోని డివిజన్‌లో వ్యాసరచన పోటీలు నవంబర్ 18వ తేదీన జరిగాయి. సాయి జూనియర్ కళాశాలలో నిర్వహించడం జరిగింది. ఈ పోటీలు 6వ తరగతి నుండి పీజీ స్థాయి వరకు గురజాడపై వివిధ అంశాలతో నిర్వహించారు. 6 నుండి 8వ తరగతి విద్యార్థులకు గురజాడ జీవితం., 9 నుండి 10వ తరగతి విద్యార్థులకు సంఘ సంస్కర్తగా గురజాడ, ఇంటర్మీడియట్ స్థాయిలో గురజాడ దేశభక్తి గేయం - నేటి పరిస్థితులు, డిగ్రీ స్థాయి గురజాడ రచనల్లో స్త్రీలు, పీజీ స్థాయిలో వ్యవహారిక భాషకు గురజాడ వేంకట అప్పారావు కృషి. బిఇడి మరియు తెలుగు భాషా పండితులకు గురజాడ సాహిత్య దృక్పథం - సామాజికకోణం అనే అంశాలపై 255 మంది విద్యార్థినీ, విద్యార్థులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా ఆర్ట్సకళాశాల తెలుగుశాఖాధిపతి డా.సంజన్న మాట్లాడుతూ తెలుగు సాహిత్యంలో విశిష్టమైన రచనలతో కృషిచేసిన మహాకవి గురజాడ అన్నారు. సాంఘీక దురాచారాల నిర్మూలనకు గురజాడ రచనలు ఎంతో దోహదం చేయడమే కాకుండా స్త్రీ అభ్యుదయానికి బాటలు వేశాయని అన్నారు. ఈ కార్యక్రమంలో సాహితీస్రవంతి జిల్లా ప్రధాన కార్యదర్శి కెంగార మోహన్ మాట్లాడుతూ గురజాడ అప్పారావు 150వ జయంతి వేడుకలు ఈ యేడాది జరుగుతున్నాయని రాష్ట్ర ప్రభుత్వం ఈ వేడుకలను అధికారికంగా చేయాలని నిర్ణయించినా చేయకపోవడం విచారకరమన్నారు. ఆ మహానీయుడిని స్మరించుకోవడం తెలుగు ప్రజల కనీస కర్తవ్యంగా సాహితీ స్రవంతి భావించిందని గురజాడ అప్పారావు గూర్చి, భవితను నిర్మించే విద్యార్థులకు సంపూర్ణ అవగాహన కల్పించాలని సంకల్పించాలన్న ఉద్దేశ్యంతో ఈ పోటీలు పెట్టామన్నారు. డివిజన్ అధ్యక్ష ప్రధాన కార్యదర్శులు ఆవుల బసప్ప, సక్కరి భాస్కర్, నాయకులు డి. రామదాస్ యు ఎన్ తిక్కయ్యలు పాల్గొన్నారు.

---కెంగార మోహన్

# నివేదిక

## మెరుగు కథా పఠనం




విజయనగరం సాహితీ స్రవంతి 'మెరుగు' వేదికపై కథా పఠనం

అక్టోబర్ 2వ తారీఖున మెరుగు కథా పఠనం గురజాడ స్వగృహం విజయనగరంలో సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో జరిగింది. కన్వీనర్ చీకటి దివాకర్ మాట్లాడుతూ ఔత్సాహికులు తయారవ్వాలనే ఉద్దేశ్యంతో కథలు వ్రాసేవారు, వ్రాస్తున్నవారు ఎలా వ్రాయాలో, చదవాలో, పాఠకులకు చేరువ కాగల అంశాలను చర్చించడం జరుగుతుందని, రాష్ట్రంలో మంచి కథలు వస్తున్నప్పటికి, సద్విమర్శకుల సంఖ్య తక్కువగా ఉందన్నారు. కథకులు కథలను చర్చించుకోవాలని, చర్చలో పాల్గొన్నవారు కథలో పాజిటివ్ ఏమిటి? నెగిటివ్ ఏమిటి? అన్నది శ్రద్ధగా విని విమర్శ చేయాలన్నారు. సద్విమర్శలు ఎప్పుడు మంచి ఫలితాన్నిస్తాయన్నారు. ఆ దిశగా కృషి చేయాలని సూచించారు. ఇందులో వి. వెంకట్రావ్ విరుగుడు మంత్రం, విజయాదిత్య సూరీడు, జానకి, మానవుడు - చీమ కథలు చదివి వినిపించారు. పంతుల జోగారావు గారు కథలపై స్పందిస్తూ విరుగుడు మంత్రంలో ఆర్థికాంశాలు, పురుషాహంకారం, స్త్రీ పడుతున్న బాధలు అంశాలున్నాయన్నారు. కథలో ఎపుడూ ఉండాల్సిన చోట పదాలు ఉంటే రక్తి కడుతుందని, ముగింపు ఆశాజనకంగా ఉండాలని అన్నారు. ఎన్.కె. బాబు జానకి కథలో మానవునిలో ఉన్న అనైక్యత జీవుల్లో ఉండే ఐక్యత బాగుందన్నారు. ఆదిత్య కథలో పర్యావరణం, భవన నిర్మాణం ప్రకృతితో మమేకమైన ఒకప్పటి మానవునికి, ఇప్పటి మానవునికి ఉన్న వ్యత్యాసం బాగా చూపారన్నారు. వెంకట్రావ్ కథలో భర్త సోమరితనం వలన భార్య కుటుంబాన్ని రక్షించుకోవడం కోసం, ఒకప్పుడు ఏమి తెలియకపోయిన, ఆమె కుటుంబ పరిస్థితులే అన్ని తెలుసుకునేలా కుటుంబాన్ని నడిపే విధంగా తిరుగుబాటు ధోరణిని నేర్పించాలన్నారు.

దూరి వెంట్రావ్ జానకి కథ బాలకథకి దగ్గరగా ఉందని, ఇంప్రూవ్ చేసుకుంటే బాగుంటుందని చీమలతో పాటు ఇంకొన్ని క్రిమి కీటకాలను జోడిస్తే బాగుంటుందన్నారు. మరికొందరు శ్రోతలు స్పందిస్తూ కథలు కవితాత్మకంగా, భాష సరళంగా ఉందని, ఫ్లో బాగుందని, కాకపోతే మారుతున్న సమాజంలో మనిషి ఆలోచన ఆశాజనకంగాను, పరిష్కార దిశగా కథలుండాలని అభిప్రాయపడ్డారు. కథలో గందరగోళం లేకుండా వినేవారికి అర్థమయ్యే రీతిలో ఉండాలని, కథను వినిపించడానికి ముందర ఇంటి దగ్గర ఒకటికి పదిసార్లు చదువుకుంటే, మనం వ్రాసేది ఎంతవరకు అవునో, కాదో అనే విషయం మనకే అర్థమవుతుందని ఆ ప్రయత్నం చేయాలన్నారు. విజయవాడలో జరిగిన సాహిత్య కార్యశాల అంశాలనురాజశేఖర్ ప్రస్తావించారు. పాయల మురళి పద్యాన్ని, నిర్మల పాట పాడి వినిపించారు.

**జీవ వైవిధ్యంపై కవి గాయక సమ్మేళనం :** జీవావరణంలోని ఏ జీవి నిరుపయోగమైనది కాదు. ప్రతి ప్రాణి మనుగడకు ప్రత్యేక కారణం ఉంటుంది. నిర్వహించే కార్యమూ ఉంటుంది 45వ జాతీయ గ్రంథాలయ వారోత్సవాల్లో (14 నుండి 20) భాగంగా సాహితీ స్రవంతి గురజాడ కేంద్ర గ్రంథాలయంలో నవంబర్ 18వ తేదీన జీవ వైవిధ్యంపై కవిగాయక సమ్మేళనం ఎస్.వి.ఆర్. కృష్ణారావు, పి.యస్. శ్రీనివాసరావు, బి.యస్.మౌళి ఆధ్వర్యంలో నిర్వహించింది. కె. ధనలక్ష్మి గీతంతో ప్రారంభమైన ఈ సభలో చీకటి దివాకర్ ఆహ్వానం పలుకుతూ గ్రంథాలయాలు ఆధునిక దేవాలయాలు అని చెప్పిన నెహ్రూ విజ్ఞాన సమపార్జనలో ముందున్న వ్యక్తిగా పేర్కొన్నారు. ప్రపంచ జీవ వైవిధ్య సదస్సులు హైదరాబాద్‌లో జరిగాయన్నారు. యస్.వి. ఆర్ కృష్ణారావు మాట్లాడుతూ జీవ వైవిధ్యం మానవాళి కోసం, మనుగడ కోసం అన్ని కలిసి అంటే జీవులు, మనుషులే కాకుండా పశు పక్ష్యాదులు కలసి జీవించాయన్నారు. జీవ వైవిధ్యం మార్కెట్ శక్తుల చెరలో బంధీ అవుతున్న రోజులివని, జీవ పదార్థంపై పేటెంట్ హక్కుల ఫలితంగా భారత్ లాంటి దేశాల నుండి పసుపు, వేప మొదలగు వాటిపై గుత్త సంస్థలు పేటెంట్ హక్కులు పొందుతున్నాయని, 75 మంది పాల్గొన్న ఈ సభలో 32 మంది కవులు, గాయకులు జీవవైవిధ్యంపై జరుగుతున్న అన్యాయాన్ని,



మానవ మనుగడ ఎటుపోతుందోనని ఆందోళన వ్యక్తం చేశారు. పులి, ఏనుగు, తిమింగిలం, పావురాళ్ళు, పిచ్చుకలు, ఎన్నో రకాల పుష్పాలు, ఫలాలు గ్యాలరీల్లో చూసుకొనే పరిస్థితులొస్తున్నాయని, బలవంతుడు బలహీనున్ని తొక్కిపెట్టే విధంగా ఇప్పటి పరిస్థితులున్నాయని, సృష్టికి ప్రతి సృష్టి చేయగలిగే మనిషి ప్రపంచీకరణ నేపథ్యంలో, పతనమవుతున్న విలువల ఫలితంగా తన ఉనికిని కోల్పోతున్నాడని బహుళ జాతుల బహురూపాల వెలుగులో మృగారణ్యంలోని జంతువులను తరిమేస్తూ మానవమృగాలు రాజ్యమేలుతున్నాయని, ఆత్మ విధ్వంసం జరుగుతుందని, మానవ వ్యవస్థే ప్రక్కదారి పడుతుందని అవస్థల ముసుగులో వ్యక్తిత్వమే కోల్పోతున్నప్పుడు జీవ విధ్వంసం ఒక లెక్కా అని ప్రశ్నించారు. ఇలా జరగడానికి గల కారణాలను మేధావులు, కవులు, రచయితలు, గాయకులు తమ తమ కోణాల్లో ప్రజలకు తెలియజేసి చైతన్య పరచాలని, మార్పుకు ప్రతి ఒక్కరి కృషి అవసరమని ఉద్ఘాటించారు.

**చంద్రిక రాణి**

# నవయుగ వైతాళికుడు గురజాడ



సమాజాన్ని అధ్యయనం చేసి, సామాజిక రుగ్మతలను రూపుమాపడానికి ప్రయత్నించిన గురజాడ అప్పారావు నవయుగ వైతాళికుడని సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు, ప్రస్థానం మాసపత్రిక సంపాదకులు తెలకపల్లి రవి అన్నారు. సాహితీ స్రవంతి, స్టీల్ ప్రోగ్రెసివ్ ఎంప్లాయిస్ యూనియన్ (సిఐటియు) సంయుక్తాధ్వర్యాన విశాఖ ఉక్కునగరం గురజాడ కళాక్షేత్రంలో అక్టోబర్ 21న నిర్వహించిన గురజాడ 150వ జయంతి ఉత్సవాల్లో ఆయన ముఖ్యఅతిథిగా ప్రసంగించారు. తెలుగుజాతికి సామాజిక చైతన్యం, తెలుగు మహిళలకు విముక్తి కల్పించిన కవి గురజాడ అన్నారు. తెలుగు సాహిత్య సంస్కృతికి గురజాడ, శ్రీశ్రీ మూలస్తంభాలని అభివర్ణించారు. 1910లో గురజాడ రచించిన దేశభక్తి కవిత ద్వారా 'దేశమును ప్రేమించుమన్న మంచియన్నది పెంచుమన్న' అని చాటిచెప్పారనీ, అంతకుముందు వంద సంవత్సరాలు తెలుగు సాహిత్యంలో దేశభక్తి గురించి చెప్పిన కవులు ఎవరూ లేరని తెలిపారు. గురజాడ కన్యాశుల్కం నాటకం సమాజంలోని అన్ని దుష్పరిణామాలపై ఎక్కుపెట్టిన అస్త్రమని అభివర్ణించారు. తిక్కన, వేమన, గురజాడ ధార్శనిక కవులని ఆయన అన్నారు. దేశ స్వావలంబన, జాతిని కాపాడుకోవడం గురజాడకు మనమిచ్చే నిజమైన నివాళి అని పేర్కొన్నారు. స్టీల్‌ప్లాంట్ డైరెక్టర్ (పర్సనల్) వై.ఆర్.రెడ్డి మాట్లాడుతూ, దేశభక్తిని ప్రోత్సహించే విధంగా గురజాడ రచనలు ఉన్నాయన్నారు. సిఐటియు రాష్ట్ర పూర్వ అధ్యక్షులు సి.హెచ్ నర్సింగరావు మాట్లాడుతూ, ఫ్యూడల్ భావాలకు వ్యతిరేకంగా అభ్యుదయ భావాలను వ్యాప్తి చేయాల్సిన అవసరాన్ని గురజాడ నొక్కి చెప్పారన్నారు. గురజాడ చిత్రపటానికి తెలకపల్లి రవి పూలమాల వేసి నివాళు లర్పించారు. స్టీల్‌ప్రోగ్రెసివ్ ఎంప్లాయిస్ యూనియన్ అధ్యక్షులు జె. అయోధ్యరామ్ అధ్యక్షతన జరిగిన ఉత్సవాల్లో సాహితీ స్రవంతి ప్రతినిదులు యు.రామస్వామి, స్టీల్ గుర్తింపు యూనియన్ అధ్యక్షులు ఎన్. రామారావు, సుందరయ్య అధ్యయన వేదిక కన్వీనర్ డిసిహెచ్ వెంకటేశ్వరరావు తదితరులు పాల్గొన్నారు. విశాఖకు చెందిన కళ్యాణి భవ్య గురజాడ రచనల నృత్య రూపాలను ప్రదర్శించారు. ప్రజానాట్యమండలి కళాకారులు పలు గీతాలు ఆలపించారు.

## జ్ఞాపకాల దొంతరే స్మృతి కవిత్వం

మనిషి జ్ఞాపకాల దొంతరే స్మృతి కవిత్వమని, సాహిత్యంలో స్మృతి కవిత్వం ఒక ప్రత్యేక ప్రక్రియ అని సాహితీ పరిశోధకులు కపిలవాయి లింగమూర్తి పేర్కొన్నారు. మహబూబ్‌నగర్ జిల్లాకు చెందిన సీనియర్ పద్యకవి దరెగోని శ్రీశైలం రచించిన "భ్రమర గీతికలు" కరుణ రసకావ్య సంపుటిని నవంబర్ 18న అచ్చంపేటలో త్రివేణి జూనియర్ కళాశాలలో ఆవిష్కరించిన సందర్భంగా ఆయన ముఖ్యఅతిథి ప్రసంగం చేశారు. స్త్రీ ఎడబాటు భరింపరానిదని, వృద్ధాప్యంలో మరీ భరించలేమని లింగమూర్తి అన్నారు. శ్రీశైలం



కవిత్వంలో ప్రాచీన కవుల కవిత్వం కనిపిస్తుందన్నారు. డాక్టర్ పి. భాస్కరయోగి పుస్తక సమీక్ష చేస్తూ శ్రీశైలం ఆటవెలది, తేటగీతిలలో రచించినప్పటికీ సరళమైన భాషలో రచించడం అభినందనీయమన్నారు. విశ్రాంత జూనియర్ కళాశాల ప్రిన్సిపాల్ మధుసూధన్‌రెడ్డి సభకు అధ్యక్షత వహించగా, అతిథులుగా డాక్టర్ భీంపల్లి శ్రీకాంత్, మల్లేపల్లి శేఖర్‌రెడ్డి, వెల్దండ రుక్మాంగదరెడ్డి, దేవకాటమరాజు నరసింహులు తదితరులు పాల్గొని ప్రసంగించారు.

## గజపతి నగరంలో కవిగాయక సమ్మేళనం

విజయనగరం జిల్లా, గజపతినగరంలో అక్టోబర్ 10వ తారీఖున స్థానిక శాఖా గ్రంథాలయంలో సాహితీస్రవంతి ఆధ్వర్యంలో కవిగాయక సమ్మేళనం నిర్వహించడం జరిగింది. ఈ కార్యక్రమానికి చెళ్ళపిళ్ళ శ్యామల అధ్యక్షత వహించారు. పి.ఎస్. శ్రీనివాస్ ఆధ్వర్యంలో కవిగాయక సమ్మేళనం జరిగింది. ఈ సమావేశంలో చెళ్ళపిళ్ళ సన్యాసిరావు ప్రసంగిస్తూ నేడు విస్తృతంగా పుస్తక ప్రచురణ జరుగుతున్నా ఆచరణ మాత్రం తక్కువైపోయిందని, విలువలు క్రమేపీ అడుగంటి పోతున్నాయని ఆవేదన వ్యక్తం చేసారు. సింహభట్ల వెంకటశాస్త్రి ఈ సమావేశం ప్రాముఖ్యత తెలిపారు. చీకటి దివాకర్ మాట్లాడుతూ ప్రపంచ జీవ వైవిధ్య సదస్సు జరుగుతున్న సందర్భంలో జీవ వైవిధ్యం గురించి కవులు, మేధావులు ఆలోచించ వలసిన అవసరం ఉందని అన్నారు. స్థానిక చైతన్య భారతి అధ్యక్షులు డా.వి. కృష్ణారావు, సెక్రటరీ బొంతలకోటి శంకర్రావు ఈ సమావేశంలో పాల్గొన్నారు. మానాపురం, పాయలతోపాటు సత్యవతి, శ్యామల, పద్మజ, రమణమూర్తి పప్పు, అచ్యుతరావు, డి.జి.ఎస్. శ్రీనివాస్, వాసు, దుర్గారావు, మౌనిక, శంకర్రావులు తమ కవితలు వినిపించారు. గంద్రేటి శ్రీనివాస్ పాటలు పాడి సమావేశం రంజింపజేసాడు.

అనంతరం మానాపురం కవిత్వాన్ని సమీక్షిస్తూ కవితల్లో ఉన్నలోటు పాట్లు తెలియజేసాడు. కవిత్వం ఎప్పటికప్పుడు మారిపోతున్నదని కాలంతో పాటు అధ్యయనం చేయవలసిన అవసరం కవికి తప్పనిసరిగా ఉందని తెలియజేసాడు. పదవ తరగతి విద్యార్థి దుర్గారావు రాసిన కవిత బాగుందని పేర్కొన్నారు. బొంతల కోటి బాల్యంపై ఒకపాట పాడి విన్పించారు. ఈ కార్యక్రమంలో గ్రంథాలయాధికారి పట్నాయక్ కూడా ఆద్యంతం ఉండి సహకరించారు.

## మట్టి మూలాలను వెతకాలి

"మట్టి మూలాలను వెతకేపని కవులు చేపట్టాలని" సాహితీ స్రవంతి రాష్ట్రకార్యదర్శి కె. అనందాచారి అన్నారు. బోడేపూడి విజ్ఞానకేంద్రం గ్రంథాలయంలో ఉపాధ్యాయుడు, కవి, రచయిత కట్టా శ్రీనివాస్ రచించిన "మట్టివేళ్ళు" పుస్తక పరిచయ సభ జరిగింది. సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి అధ్యక్షతన జరిగిన సభలో పలువురు కవులు, కళాకారులు పాల్గొన్నారు. గ్రంథాలయ వారోత్సవాల సందర్భంగా పుస్తకావిష్కరణ జరగటం ఎంతో ఆనందం, అభినందనీయమని గ్రంథాలయ నిర్వాహకుడు కపిల రామ్‌కుమార్ అన్నారు. మొవ్వా శ్రీనివాసరావు మాట్లాడుతూ కవులు సామాజిక నేపథ్యంలో కవిత్వం రాస్తున్నారు, బావుంది దానితో పాటు సాంకేతిక పరిజ్ఞానం కూడా పొంది ఇంటర్‌నెట్‌ను వినియోగించడం ద్వారా ప్రపంచం నలుమూలలకు వ్యాప్తి చెందాలని సూచన చేసారు. దానికి స్పందిస్తూ త్వరలో కవిత్వ శిక్షణాశాల ఏర్పాటు చేయబోతున్నామని ఆ సందర్భంగా సాంకేతిక జ్ఞానం అందించే ప్రక్రియ చేపడతామని ఆనందాచారి తెలిపారు. పలువురు ఆ ప్రతిపాదనను స్వాగతించారు. కళానిలయ నిర్వాహకుడు శేషగిరి "మట్టివేళ్ళు" కవితా సంపుటిలోని



'మట్టిమూలాలు' పుస్తకావిష్కరణ సభలో మాట్లాడుతున్న యాకూబ్

ఒక కవితను స్వరపరచి గానం చేయటం ఆకట్టుకుంది. ఈ సభలో "కవిసంగమం" నిర్వాహకుడు డా. యాకూబ్ సంకలనంలోని కవిత్వాన్ని ప్రశంసించారు. కన్నెగంటి వెంకట్ పుస్తకాన్ని పరిచయం చేసారు. నందకిషోర్, సాధనాల, గాలి కిరణ్, సి.హెచ్. ఆంజనేయులు, జి. శ్రీనివాస్, బి.వి.కె. విద్యార్థి, గాయకుడు ఆసు ప్రసాదు, ప్రజానాట్యమండలి కళాకారులు, కవయిత్రి సునంద తదితరులు పాల్గొన్నారు. లెనిన్ శ్రీనివాస్ వందనసమర్పణతో సభ ముగిసింది.

## ఉమ్మడిశెట్టి పురస్కారానికి కవితా సంపుటాలకు ఆహ్వానం

ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డు రజితోత్సవ పురస్కారానికి కవితా సంపుటాలను ఆహ్వానిస్తున్నట్లు అవార్డు వ్యవస్థాపకులు డా. రాధేయ ఒక ప్రకటనలో తెలిపారు. ఈ పురస్కారం కోసం 2012లో ప్రచురించబడిన కవితా సంపుటాలను పంపించవలసిందిగా కోరారు. ఎంపికైనా ఉత్తమ కవితా సంపుటికి రూ. 2000/–లతో సత్కరించనున్నట్లు తెలిపారు. 2013 జనవరి 31 లోపుగా నాలుగు ప్రతులను 'డా. రాధేయ, అవార్డు వ్యవస్థాపకులు, కవితా నిలయం, 13-1-606, షిర్డినగర్, రెవెన్యూ కాలనీ, అనంతపురం – 515001 చిరునామాకు పంపించమని ఆ ప్రకటనలో కోరారు. ఇతర వివరాలకు 9985171411 ద్వారా సంప్రదించవచ్చును.

## తనికెళ్ళ భరణికి డా॥ నాగభైరవ అవార్డు



ప్రముఖ రచయిత, సినీనటులు తనికెళ్ళ భరణికి డా. నాగభైరవ కోటేశ్వరరావు స్మారక సాహితీ అవార్డు 2012ను అందించనున్నట్లు అవార్డు కమిటీ ప్రధాన కార్యదర్శి చిన్ని నారాయణరావు ఒక ప్రకటనలో తెలిపారు. డిసెంబరు 2న అవార్డు బహుకరణ కార్యక్రమం నెల్లూరు పట్టణంలో నిర్వహించనున్నట్లు తెలిపారు. ఆ సభలో వెన్నెలకంటి, ఖదీర్‌బాబులు పాల్గొంటున్నారని ఆ ప్రకటనలో తెలిపారు.

## ఇస్మాయిల్ అవార్డు - 2012

ఈ సంవత్సరం ఇస్మాయిల్ – 2012 అవార్డుకు రామినేని లక్ష్మి తులసిని ఎంపికచేసినట్లు నూజెర్సీ నుండి తమ్మినేని యదుకుల భూషణ్ ఈ-మెయిల్ ద్వారా తెలియజేశారు. ఈ పురస్కారాన్ని గతంలో పాలపర్తి ఇంద్రాణి, గోపిరెడ్డి, రామకృష్ణారావు, గరికపాటి పవన్‌కుమార్, పి. మోహన్, వైదేహి శశిధర్, గండేపల్లి శ్రీనివాసరావు, పద్మలతలకు అందజేసినట్లు ఆయన తెలిపారు.

## 2013 సంక్రాంతి కథల పోటీ

నీ హారిక ఫౌండేషన్, చిలకలూరిపేట, సాహితీకిరణం మాసపత్రిక సంయుక్త ఆధ్వర్యంలో 2013 సంక్రాంతి కథల పోటీ నిర్వహిస్తున్నట్లు సాహితీకిరణం సంపాదకులు పొత్తూరి సుబ్బారావు ఒక ప్రకటనలో తెలిపారు. ప్రథమ బహుమతి రూ. 2500/-, ద్వితీయ బహుమతి రూ. 1500/-, తృతీయ బహుమతి రూ. 1000/-లు, మూడు ప్రోత్సాహక బహుమతులుగా రూ. 500/-లు అందివ్వనున్నట్లు తెలిపారు. కథలను డిసెంబరు 31లోపుగా 'సాహితీకిరణం, ఇం.నెం. 11-13-154, అలకాపురి, రోడ్ నెం. 3, హైదరాబాద్-500 035 చిరునామాకు పంపించవలసిందిగా కోరారు. ఇతర వివరాలకు 9490751681, 9866400059 ద్వారా సంప్రదించవచ్చును.



అక్టోబర్ 14న 'రమ్యభారతి' సాహిత్యవేదిక ఆధ్వర్యంలో 'మన విజయవాడ' కవితా సంకలనాన్ని విడుదల చేస్తున్న సమాచార శాఖ, రీజనల్ జాయింట్ డైరెక్టర్ చొరగుడి జాన్సన్. చిత్రంలో శతావధాని పాలపర్తి శ్యామలానంద ప్రసాద్, గుమ్మా సాంబశివరావు, డా. జి.వి. పూర్ణచంద్, చలపాక ప్రకాష్, గోళ్ళ నారాయణరావు.



అక్టోబర్ 27వ తేదీన హైదరాబాద్ లోని సుందరయ్య విజ్ఞానకేంద్రంలో 'పాలపిట్ట సాహితి - విమలాశాంతి సాహిత్య సేవాట్రస్టు' సంయుక్త నిర్వహణలో జరిగిన సాహిత్య పురస్కార ప్రదాన సభ జరిగింది. "ఇప్పుడు" కవిత సంపుటి రచయిత ఆశారాజు, 'శాంతి రజనీకాంత్ స్మారక కవితా పురస్కారం-2012'ను కథారచయిత ఎ.ఎన్.జగన్నాథశర్మ 'విమలాశాంతి సాహిత్య సేవాపురస్కారం-2012'ను అందుకున్నారు.




సమైక్య భారతి 16వ వార్షికోత్సవం సందర్భంగా అక్టోబర్ 28 నుండి 30 వరకు జరిగిన కార్టూనోత్సవ్ - 2012లో ముగింపు రోజు కార్టూన్ రంగానికి సేవలందించిన సుధామను సత్కరిస్తున్న ప్రెస్ అకాడెమీ మాజీ ఛైర్మెన్ పొత్తూరి వెంకటేశ్వరరావు, కుడివైపు రాష్ట్ర సాంస్కృతిక సలహాదారు కె.వి.రమణ, ఎడమవైపు మాజీ ప్రిన్సిపల్ సెక్రటరీ నరేంద్ర లూథర్, జి.వి.ఎస్.రాజు.



రవీంద్ర భారతిలో "ఇవి అబద్ధాలు కావు" గ్రంథావిష్కరణ జరిగింది. అందులో వోలేటి పార్వతీశం, మద్దాళి రఘురాం, డా. పాలకుర్తి మధుసూదనరావు డా. కె.వి. రమణాచారి, ఆచార్య ఎన్.గోపి, మల్లాది శైలజా సుమన్, సత్యవోలు సుందరసాయి.



'యువభారతి' స్వర్ణోత్సవాల సందర్భంగా 26 అక్టోబర్‌న రవీంద్రభారతిలో జరిగిన సభలో యువభారతి ప్రచురణల ప్రధాన సంపాదకులు సుధామను సత్కరిస్తున్న ముఖ్య అతిథి శాంతా బయోటెక్నిక్స్ అధినేత కె.ఇ. వరప్రసాదరెడ్డి, చిత్రంలో కె.వి. రమణాచారి రాష్ట్ర మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు గంగాభవాని, సంస్థ అధ్యక్షులు మాడభూషి అనంతాచార్య ప్రభృతులు వున్నారు.



దాట్ల దేవదానం రాజు రచించిన 'యానాం కథలు' ఆవిష్కరిస్తున్న ఆంధ్రజ్యోతి సంపాదకులు కె.శ్రీనివాస్. చిత్రంలో ఎండ్లూరి సుధాకర్, ఏ.ఎన్.జగన్నాథశర్మ, దేవదానం రాజు, మల్లాడి కృష్ణారావు, శిఖామణి, వాడ్రేవు వీరలక్ష్మీ దేవి, రామాచంద్రమౌళి ఉన్నారు.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

# వాసిరెడ్డి సీతాదేవి

**15.12.1932 - 13.04.2007**



అనేక నవలలు, కథలు రాసారు. 'మట్టిమనిషి' వీరి ప్రసిద్ధ నవల. 'మరీచిక' నవల ప్రభుత్వ నిషేధానికి గురయింది. అభ్యుదయ సాహిత్య వ్యాప్తికి తన వంతు కృషి చేసారు.

PRSVM02A144 AM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.H/SD/415/10-12

# ప్రజాశక్తి బుక్‌హౌస్ తాజా ప్రచురణలు




వెల: రూ. 50/-




వెల: రూ. 50/-




వెల: రూ. 50/-




వెల: రూ. 50/-




వెల: రూ. 30/-




వెల: రూ. 70/-




వెల: రూ. 20/-




వెల: రూ. 70/-




వెల: రూ. 15/-




వెల: రూ. 300/-




వెల: రూ. 50/-




వెల: రూ. 20/-




వెల: రూ. 20/-




వెల: రూ. 150/-




వెల: రూ.200/-




వెల: రూ. 35/-




వెల: రూ. 40/-




వెల: రూ. 20/-




వెల: రూ. 50/-




వెల: రూ. 150/-

ప్రతులకు: ప్రజాశక్తి బుక్‌హౌస్, ఫోన్: 040-27660013 27608107, ఫ్యాక్స్: 04027635136

50

**If Un delivered please return to :** Prasthanam, C/o M.H.Bhavan, Plot No. 21/1, Azamabad
Near RTC Kalyanamandapam, Hyderabad - 500 020 (A.P.) Ph: 040-27660013, Cell: 9490099053



| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVMO2A144 |
| పుస్తకం పేరు | ఉద్యానం |
| తారీఖు | 25-5-24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | K Daveed |
| పేజీలు విడదీసినది | K Daveed |
| స్కాన్ చేసినది | Gayatri |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | GOOD |